# రావుల రామాయణము

కావ్యకర్త:

డాక్టర్ రావుల సూర్యనారాయణమూర్తి, ఎం.ఏ., డి. లిట్.




ప్రచురణ

శ్రీ ఎం. వి. ఎస్. ప్రసాద్, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

1992

**RAVULA RAMAYANAMU**
by
Dr. Ravula Suryanarayana Murty

Edited by:
Mudivarti Kondamacharyulu
Publication Wing.

T.T.D. Religious Publications Series No. 424

First Edition : September, 1992

Copies: 5000




Published by:

Sri M. V. S. Prasad, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.




Printed at:

Tirumala Tirupati Devasthanams Press,
Tirupati - 517 507.

## ముందుమాట

కవితాశాఖని అధిరోహించి వాల్మీకి కోకిల మధురమధురంగా గానం చేసిన రసవదాదికావ్యం శ్రీమద్రామాయణం. సూర్యచంద్రులూ, నగాలు, నదులూ ఈ భూమి మీద ఎంతకాలం వుంటాయో అంతకాలమూ అజరామరమై ఈ విశాల విశ్వంలో విలసిల్లుతుంది రామాయణం.

ఆ మహాకవి కంఠం నుంచి వెలువడ్డ ప్రతిపదమూ రసాస్పదం. ఆయన వాక్కుతో మానవత రూపం సంతరించుకున్నది. పురుషార్థాలు జ్యోతులై వెలిగాయి. ఆ పుంభావసరస్వతి కవితలో రాజనీతి అంతర్లీనమై ప్రవహించింది.

సర్వశ్రుతి మనోహరమైన రామాయణ మహాకావ్యావిర్భావం ఒక మహత్తర వాతావరణంలో జరిగింది. కామమోహితమైన క్రౌంచపక్షుల జంటలో మగపక్షిని సంహరించి నిషాదుడు ఘోరమైన అధర్మం ఆచరించాడు. ఆ అధర్మదర్శనం వల్ల వాల్మీకి హృదయం ద్రవించి స్రవించింది. శోకగతమైన ఆవేశం శ్లోకమై రామాయణ మహాకావ్యానికి నాంది పలికింది. వాల్మీకి కరుణరసార్ద్రహృదయుడని ఈ క్రౌంచమిథున వృత్తాంతం వ్యక్తపరుస్తున్నది.

విశ్వసాహిత్యంలో రామాయణం ఒక అద్వితీయమైన కావ్యరాజం. పాశ్చాత్య భాషల్లో కూడా రామాయణానువాదాలూ, విమర్శ గ్రంథాలు, వ్యాసాలూ అసంఖ్యాకంగా వెలువడ్డాయి. రష్యాలాంటి దేశాల్లో సైతం రామాయణానికి ఆదరణ లభించడం రామాయణకావ్య విశ్వజనీనతకూ, సార్వకాలికతకూ సజీవ తార్కాణం.

వేదం వెల్లడించే పరమపురుషుడు శ్రీరామచంద్రుడిగా అవతరించగా ఆ వేదం కూడా వాల్మీకివల్ల రామాయణ రూపంగా పరిణమించింది. వాల్మీకి ఇలాంటి లోకోత్తర మహాకావ్యరచనా పటిష్ఠతకు ఆకరమైన తపోమాహాత్మ్యం, దివ్యజ్ఞాన సంపత్తి కలిగినవాడని ప్రసిద్ధిపొందడమే కాకుండా ఛందశ్శాస్త్రాని కొక కొత్త యుగాన్ని సృష్టించాడు.

వాల్మీకి రామాయణంలో గృహజీవితాన్ని అద్భుతంగా వర్ణించాడు. కథాకవిత్వాలలో అనన్యసాధారణమైన శిల్పం ప్రదర్శించాడు. పాత్ర పోషణలో కృతహస్తుడైన

ఆయన రామాయణంలోని సామాన్య పాత్రలను సైతం ఎంతో శ్రద్ధతో తీర్చిదిద్దాడు. ఆయన తన కావ్యం ద్వారా బోధించిన నీతి ధర్మతత్త్వాలు నిరుపమానాలు.

భారతజాతి జీవనాడికి మూలాధారాలు రామాయణ భారత భాగవతాలు. ఈ మూడింటిలో రామాయణం ఆసేతు శీతాచలం ఎప్పటి కప్పుడు సమకాలీన కవుల గళాలనుంచి అవతరిస్తూనే వున్నది. సరళమూ సర్వసుబోధకమూ అయిన శైలిలో తిరుమల తిరుపతి దేవస్థానాల పౌరసంబంధాధికారి డాక్టర్ రావుల సూర్యనారాయణ మూర్తి రచించిన రామాయణాన్ని సహృదయలోకానికి సమర్పిస్తున్నాము.

తిరుమల తిరుపతి దేవస్థానాలు చేపట్టిన బహువిధభక్తి సాహిత్య కార్యక్రమాలలో ప్రాచీన గ్రంథాల ప్రచురణ ఒకటి. మహత్తర కావ్యాలసారాన్ని సకల జనులకూ అంద జేయాలని మా అభిలాష. ఈ గ్రంథం పాఠకులకు ఆనందపారవశ్యం కలిగించగలదని ఆశిస్తున్నాము.

ఎం.వి.ఎస్. ప్రసాద్
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానాలు

తిరుపతి,
సెప్టెంబరు 6, 1992

# మనవి

సంస్కృత వాఙ్మయంలో ఆదికవి అయిన వాల్మీకి రచించిన రామాయణం లాంటి మహాకావ్యం మరొకటి ఆవిర్భవించలేదు. రసవంతమైన కావ్యంగా, ధార్మిక గ్రంథంగా, సరస సుందర కథోపాఖ్యానమయమైన పురాణరత్నంగా, సంస్కృతభాషా సారళ్య సౌష్ఠవ ప్రదర్శకమైన లక్ష్యగ్రంథంగా, ఉత్తమ మానవ జీవిత నీతి నిరూపకమైన నీతి శాస్త్రంగా, భారతీయ సంస్కృతి సర్వస్వ నిధానంగా దానికున్న ప్రశస్తి అప్రతిమానం. రామాయణ కావ్యంలో వాల్మీకి ప్రదర్శించిన కల్పనాశక్తి అనిదంపూర్వం; అనితర సాధ్యం.

వాల్మీకి మహర్షి హృదయజలదం నుంచి వర్షించిన రామాయణామృతధార వాగులై, వంకలై ప్రవహించి భారతీయ సాహిత్య క్షేత్రాన్ని సస్యశ్యామలం చేసింది. ఆ మహాకావ్యం మూలంగా ఆర్ష సంస్కృతి అజేయమై నిలిచింది. కథలుగా, పాటలుగా, నాటకాలుగా, ప్రబంధాలుగా రామకథ రూపు వహించి భారతీయ నిత్య జీవనంలో లీనమైపోయింది. తెలుగు వాఙ్మయంలో రామకథ ప్రాకని శాఖ లేదు.

భావితాత్ముడైన వాల్మీకి భాష ఎంత సులభ సుందరమో అంత శక్తిమంతం. వాల్మీకి రామాయణంలో మూలమూలలా దాగివున్న సౌందర్యాన్ని తెలుగు ప్రజలకు సాక్షాత్కరింపచేయాలని కొందరూ, రామనామగానం చేత భవబంధ విమోచనం చేసుకుని ఆ నీలమేఘశ్యాముడి పాదసాన్నిధ్యం పొంది పునర్జన్మ రాహిత్యం సాధించుకోవాలని కొందరూ, వేదధర్మ స్వరూపాన్ని కథామూలంగా వ్యక్తపరచి లోకాన్ని ధర్మసంపన్నం కావించాలని కొందరూ రామాయణకథాకావ్యాలు వ్రాశారు.

తెలుగులో పద్యవిద్యకి ఆద్యుడై హృద్యానవద్యంగా ఐతిహాసిక కావ్యావతరణం కావించిన నన్నయ్య నుంచి నేటిదాకా అవ్యాహతంగా పద్యవిద్య తెలుగు సాహిత్యప్రక్రియల్లో ప్రముఖమై సాగుతునే వున్నది. మొదటినుంచీ ఈ పద్యకవితా విధానానికి అనువాద ప్రక్రియ అపారంగా దోహదం చేసింది; చేస్తున్నది. భాస్కర, రంగనాథ, గోపీనాథ, మొల్లలను వదిలితే, ఈ శతాబ్దంలో ఎందరో యథాశక్తి రామాయణం పద్యరూపంలో అందజేశారు. రామాయణ కల్పవృక్షం కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారిని జ్ఞానపీఠం అలంకరింపచేసింది.

సర్వాలంకార శాస్త్రలక్షణోపేతమై, సకల పురుషార్థ ప్రదమై విరాజిల్లుతున్న రామాయణాన్ని ఈనాటి అవసరానికి అనుగుణంగా, నవ్య కవితా పరిణతిని దృష్టిలో వుంచుకుని ధార్మిక ప్రపంచానికి అందించటానికి ఆనందిస్తున్నాను. సంగ్రహ రూపాన్ని సంతరించుకున్న ఈ యథావాల్మీకమైన తెలుగు కావ్యం భక్తుల, పద్యకవితా ప్రియుల ఆదరాభిమానాలు పొందగలదని నా ప్రగాఢ విశ్వాసం.

ఈ కావ్యాన్ని సాధ్యమైనంత నిర్దుష్టంగా తీర్చిదిద్దటంలో తోడ్పడ్డ మహాకవులు శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులు గారికీ, శ్రీ మల్లంపల్లి శరభయ్యశర్మ గారికీ నా కృతజ్ఞతాంజలులు. దీని ప్రచురణకు సహాయపడ్డ తిరుమల తిరుపతి దేవస్థానాల కార్యనిర్వహణాధికారి శ్రీ ఎం.వి.యస్. ప్రసాద్, ఐ.ఏ.ఎస్., గారికీ, సప్తగిరి సంపాదకులు శ్రీ కాట్రపాటి సుబ్బారావుగారికీ, సర్వాంగ సుందరంగా ముద్రించిన టి.టి.డి. ప్రెస్ మేనేజరు శ్రీ ఎం. విజయకుమార్ రెడ్డి గారికీ, వారి సిబ్బందికీ, ముచ్చటైన ముఖచిత్రాన్ని రూపొందించిన ఈశ్వర్ పబ్లిసిటీస్ అధిపతి, ఆప్తమిత్రులు శ్రీ ఈశ్వర్ గారికీ నా వందనాలు.

విధేయుడు

రావుల సూర్యనారాయణమూర్తి

# సమర్పణము

పారగుణవల్లి మాతల్లి నారయమ్మ
శుద్ధచరితుండు జనకుండు సూర్యరావు
పరమపుణ్యులు వీరికి భక్తిమీర
అంకిత మొనర్తు నాదు రామాయణమ్ము.

శ్రీరస్తు

# రావుల రామాయణము

## బాల కాండము

శ్రీ రఘురామ చంద్రు కథ చెప్పిరి సత్కవు లెంద రెందరో
చారు మనోరథమ్ము లనిశమ్ము నను వాణి దయార్ద్ర దృష్టి చే
కూరగ, తేనెలూరు పలుకుంబడి చక్కని తెల్గు బాసలో;
భారము రాముపై నిడి అభంగుర భంగిని విన్నవించెదన్.

కాలము మారిపోయినది కావ్య లతాంత మరంద ధారలన్
గ్రోలి తరింపగా జవము కొందరిలోనను లేదు నేడు; ఏ
వేళను గాంచినన్ జనులు వేయి విధాలుగ జీవనమ్ముకై
ఆల మొనర్తు రొక్క క్షణమైనను తీరికలేని రీతిలో.

వేసర దీ జగమ్మిది, వివేకము భక్తియు వీడకుండుటన్
వాసియు వన్నెయున్ గలుగు భానుని వంశమునందు బుట్టి ఏ
దోసము లేని సచ్చరితతో విలసిల్లిన రామమూర్తిదౌ
భాసుర కీర్తిగాథ విన భక్తులు నిచ్చలు నిచ్చగింపరే!

దేశకాలాను గుణమైన దృష్టితోడ
సంగ్రహంబుగ కథజెప్ప సమయమందు
చేతులను మోడ్చు వాగర్థసిద్ధి కొఱకు
వేంకటేశ్వరస్వామికి విమల భక్తి.

శైశవము నాటి నా మేటి ఆశ తీర
మహిత రీతి రచింతు రామాయణమ్ము
బహుజనావళి మెచ్చెడు ఫణితిలోన
సత్కవీశ్వర గణముల సంస్మరించి.

వినుత శ్రీరామనామమ్ము వేద వినుత
మిహపరమ్ముల సాధన మీ చరిత్ర;
ధాత్రిని గుణవిచార విదగ్ధులైన
విజ్ఞులను శ్రద్ధతో విన వేడికొందు.

అది అయోధ్య; ఆకరము సంపదల కెల్ల
స్వాదు సలిలప్రపూర్ణమై పారునట్టి
దివ్యమగు సరయూనదీ తీరమందు
వఱలు; భూతలస్వర్గ మా పురవరంబు.

దశరథుండను ధన్యు డుదారయశుడు
మహిత రఘువంశజుడు ధర్మమర్మవిదుడు
రమ్య గుణశాలి సత్య పరాక్రముండు
ప్రజలు మెచ్చంగ నేలె నా పత్తనంబు.

కోసలాధిపు డతనికి కూర్మిసతులు
కలరు కౌసల్యయు సుమిత్ర కైక యనగ
పరమ సాధ్వీమతల్లులు; ప్రత్యహంబు
పతి నతిప్రీతి సేవించు భవ్యమతులు.

పుత్త్రిసంతతి మాత్రమ్ము పొందలేక
కుందు నెదలోన నిక్ష్వాకు కులనృపుండు
కాల మహిమము కాబోలు! కలుగ ఁ రయ్యె
వ్రతము లెన్ని యొనర్చిన వంశకరులు.

ధర్మ మెందును దప్పని దశరథుండు
కోర్కి తీరగ నొకనాడు కులగురువును
ఘన తపోధనుని వశిష్ఠమునిని గాంచి
వినయ మొప్ప మనోవ్యథ విన్నవించె.

చెప్పె నపుడా మహాముని చిత్తమలర
"పుత్రకామేష్టి యాగమ్ము పూతమతిని
సలిపి నంతనె నీ వాంఛ సఫల మగును
ఐహికా ముష్మిక శుభంబు లబ్బు నీకు.

ఋష్యశృంగాభిధానుండు ఋషివరుండు
పుడమి వసియించు విబుధసంపూజ్యు డతడు
దయను జూపంగ నలువురు ధర్మమతులు
సుతులు కలిగెద రతిబలాన్వితులు నీకు."

శిష్ట వర్తనుడైన వశిష్ఠు డట్లు
ధరణిలో సుస్థిర శుభ సంతతులు వెలయ
క్షితి తలేశు దశరథు నాశీర్వదింప
హర్ష వశమున పులకించె నతని తనువు.

సచివ బంధు మిత్రాదులు సంతసిల్ల
శాస్త్ర విధి యజ్ఞ మొనరింప జనవిభుండు
సరయువు తటాన నిర్మించె సవనశాల
సకల వస్తు సంభరితమై జానుమీర.

వేద వేదాంగ వేత్త వివేకశాలి
ఋష్యశృంగర్షియే ముఖ్య ఋత్త్విజుడుగ
అనఘ మౌని సంఘంబు సాహాయ్యపడగ
ఇనకులీనుండు పుత్రకామేష్టి సలిపె.

వారిజాసను తోడుత పరమ ఋషులు
సిద్ధ గంధర్వ వరులు వసించి రచట
యజ్ఞభాగమ్ము గ్రహియింప నభిలషించి
సహజమైన అంతర్ధాన శక్తియుతులు.

ఆ తరుణమందు సురలు విధాత తోడ
విన్నపము చేసికొని రిట్లు వినయ మొనయ
"సరసిజోద్భవ! భవదీయ వరము కతన
కావరము నందె నెంతయో రావణుండు.

దయము ధర్మమ్ము వీడిన దనుజవిభుడు
గర్వితు డతండు మూడు లోకాల కేగి
కలుషములకు పాల్పడగ రక్కసుల గూడి
భయము భ్రాంతియు నెల్లెడ పాదుకొనియె.

పరమ పావన పౌలస్త్యవంశమందు
జన్మమెత్తియు గూడ దశాస్యుడౌర!
పాప కృత్యమ్ములకు నెల్ల పాలుపడుచు
విశ్వ సంతాపకుండయి విఱ్ఱవీగె.

సాధుజనుల బాధించుచు సంచరింప
వాడు, తలదాచుకొన మాకు నీడ లేదు;
జగములను బ్రోవ నాతని సంహరించు
వెరవు నే చందముననైన అరయు మయ్య!"

వేల్పు లట్టులు దీనులై వేడు కొనగ
బ్రహ్మ మందహాసంబుతో బదులు పలికె
"మున్ను నే రావణుని తపమ్మునకు మెచ్చ
తనకు మృతిరానియట్టు లతండు కోరె.

అసురసిద్ధ సురాదుల నప్పుడెన్ని
వార లెవ్వరి చేతను ప్రాణహాని
కలుగని విధాన వరమును గాంచె గాని
మానవుల మాట మాత్రమ్ము మరచిపోయె.

కాన నిస్సంశయమ్ముగ మానవుండు
క్రూరుడగు రావణాసురు గూల్చ గలడు"
అని విరించి ప్రసన్నుడై అభయ మొసగ
మోద మతులైరి దివిజులు మునులు కూడ.

అందరును కార్యసిద్ధికై హరి దలంప
అంతలో నట ప్రత్యక్ష మయ్యె శంఖ
చక్ర పద్మ గదా హస్త శస్తు డగుచు
శ్రిత జనాళికి సులభుండు శ్రీధవుండు.

ఆదిమధ్యాంత రహితు అనంతు గాంచి
బ్రహ్మ సురలును భక్తితో పలికి రిట్లు
"సకల భువనైక నుతకీర్తి! సత్యమూర్తి!
శాశ్వతానందదాయి! భుజంగశాయి!

దేవ! మూడు లోకాలకు నీవ దిక్కు
అసుర నాథుడు బహు దుర్మదాంధు డయ్యె
వాని దుష్కృత్యముల దెల్ప వశముగాదు
ఖలుని ఖండించి సాధుల గావు మయ్య!"

శరణు జొచ్చిన వారల మొరలు విన్న
విష్ణు దేవుం డభయ మిచ్చె వేడ్కమీర
రావణాసురు దుర్నివారకుని దునుమ
పుడమి పొడమగ దశరథు పుత్రు డగుచు.

ఉర్వీరక్షకై నరవేష మూన బూను
తోయజాక్షున కెంతయో తోడుపడగ
క్షితిని వానర వీరుల సృష్టిజేయ
జలజ గర్భుండు శాసించె సకల సురుల.

దీక్ష బూనిన వెన్ను డదృశ్యు డయ్యె.
అజుడు వేంచేసె నాదట ఆత్మపురికి
సురలు తమ తమ తావుల కరిగి రెలమి
క్రతువులోన హవిష్య భాగముల నంది.

మంతు గనిన సుమంత్రాది మంత్రి వరులు
ఋశ్యశృంగుని సతిశాంత, హితులు, సతులు
భూపతులు, బంధువుల కెల్ల ముదము గూర్చె
లోప మొదవని యాగ విలోకనమ్ము.

పుత్ర కామేష్టి అటు పరిపూర్ణ మయ్యె
అంతలోన భూపతి అధ్వరాంగణాన
అగ్నికుండంబు నందుండి అవతరించె
దీప్తులను వెదజల్లుచు దివ్య తనుడు.

భవ్యు డా యజ్ఞ పురుషుండు పలికె నిటులు
"మీకు జగమునకు జయమ్ము మించుగాత!
స్వర్ణపాత్రాంచితమ్మైన పాయసంబు
ధన్యుడవు గ్రహియింపు మో దశరథేశ!

దీని బంపెను కరుణతో దేవగణము
ఒసగు మిది రాణులకు యథాయోగ్యరీతి
భక్తితో భుజియింప నీ పాయసంబు
పుత్త్రిలను వారు శీఘ్రమే పొందగలరు."

అట్టులు వచించి ప్రేక్షకు లాలకింప
అద్భుతానంద మగ్నుడౌ అవని పతికి
కనక మయమైన పాయస కలశ మొసగి
దివ్యుడగు యజ్ఞపురుషు డదృశ్యు డయ్యె.

అతుల తేజు డా పురుషుని ఆజ్ఞ దలచి
ప్రణయ మధురాంతరంగుండు పంక్తిరథుడు
పంచె ముువ్వురు సతులకు పాయసమ్ము
క్రోలినంతనె వారలు చూలు దాల్ప.

సగము భాగము కోరి కౌసల్య కిచ్చె
మిగులు పాలులో సగము సుమిత్ర కొసగె
కడమ భాగమం దర్ధంబు కైక కిడియె
పాత్ర నిహిత శేషంబు సుమిత్ర పొందె.

అమిత భక్తిని గొన్న పాయసము దిన్న
సతులు దినకర పావక ద్యుతులతోడ
గర్భవతులైరి వల్లభు కాంక్ష దీర
సర్వ శుభములు జగముల పర్వ నటులు.

శుభద మైనట్టి తిథి చైత్ర శుద్ధ నవమి
ధర పునర్వసు మూడు పాదాలు గడచె
కర్కటంబను పుణ్యలగ్నంబు నడచె
ఆ ముహూర్తాన కౌసల్య రాము గనియె.

కోసల విభుండు దశరథు కోర్కి పండె
దేవ దుందుభి స్వనములు దెసల నిండె
అలరె పురలక్ష్మి వరభూషణాఢ్య యగుచు
విరుల జల్లులు దివినుండి కురిసె భువిని.

కైక గర్భాన భరతుండు కలిగె; కవల
కనియె లక్ష్మణ శత్రుఘ్నులను సుమిత్ర;
కోర నృపతి, వశిష్ఠుడు కుల గురుండు
మది దలచి వారి కర్థనామముల నుంచె.

శైశవము నుండి ఆ అవనీశు సుతులు
రామలక్ష్మణు లన్యోన్యరక్తు లగుచు
ఆటపాటల జంటగా నలరుచుండ
భరత శత్రుఘ్ను లొప్పిరి పరమ మైత్రి.

బాల లీలా వినోదాలు చాలజూపు
రామభద్రుండు తమ్ముల ప్రేమ నందె
సంతతానందు డయ్యె భూకాంతు డంత
రామనామంబు మ్రోగెను రాజ్యమెల్ల.

సుందరులు రఘువంశకిశోరు లవని
అస్త్ర వేదులు వేదాధ్యయన నిరతులు
సర్వ లోక భద్రరతులు జ్ఞానయుతులు
సత్య సత్త్వగుణులు వారు సాధుమణులు.

సుతుల పరిణయ విషయమ్మై హితులతోడ
దశరథేంద్రుడు చర్చించు తరుణమందు
అరుగుదెంచె విశ్వామిత్ర పరమమౌని
ఒక్క పని పూని వేడ్క అయోధ్య కెలమి.

చిత్త మలరంగ నపుడు కౌశికుని గాంచి
అధిక భక్తితో అర్ఘ్యపాద్యంబు లొసగి
అధివసింపగ జేసి అర్హాసనమున
కుశల సంప్రశ్న మొనరించె దశరథుండు.

బ్రహ్మ పదము పడసిన నీ రాక కతన
శ్రేయము లభించె నాకు గాధేయ! నేడు
అనఘ మగు నీదు కోరిక నానతిమ్ము
ముదముతో నెఱవేర్తును మునివరేణ్యా!

ఆ విధంబుగ వచియింప భూ విభుండు
హర్ష చిత్తుడై పలికె బ్రహ్మర్షి యతడు
సిద్ధి బడయంగ గోరి ప్రసిద్ధిగన్న
సవన మొనరించు చున్నాడ క్ష్మాతలేంద్ర!

అది పరిసమాప్తి నందెడు నంతలోన
పాపమతులు మారీచ సుబాహు లనెడు
రక్కసులు రేగి కురిసిరి రక్తవృష్టి
వేగముగ వచ్చి అధ్వర వేదిపైన.

కామ రూపులు వారు విఘ్నంబు సేయ
శాపమిడి చంపనెంచక శ్రమకు నోర్చి
ఆశ్రమము వీడి వచ్చితి నవనినాథ!
వ్రతుల కెవ్వారికేని కోపంబు తగదు.

అందుచేత సచ్చరితు ని న్నాశ్రయింతు
రాము సత్య పరాక్రమ ధాము బంప
సవన రక్షణ మాతండు సలుప గలడు
దైత్యుల వధింప నన్యుల తరముగాదు.

రాజ! నీ ప్రాణ సముడైన రామమూర్తి
అస్త్ర శస్త్ర పారగుడు మహాత్ము డంచు
ఈ వశిష్ఠుడు మునికోటి యెఱుగ రొక్కొ?
పంపు మెల్లరు మది సమ్మతింప నతని."

విభుడు దశరథు డిట్లనె వికలమతిని
"వయసు చూడంగ పదునారు వత్సరాలు
రామభద్రుని కెంత విక్రమము గలదు?
కపట దనుజుల నెదిరింప కదనమందు.

బిడ్డలందరి లోనను ప్రియతముండు
వీని నెడబాసి క్షణము జీవింప లేను;
కరుణ జూపుము నే ధనుర్ధరుడ నగుచు
సవన రక్షణ మొనరింతు సంయమీంద్ర!"

అనియె నపుడు విశ్వామిత్రమునివరుండు
"గర్వితుడు రావణుడు లోక కంటకుండు
తానె మఖ విఘ్న మొనరింప తరలివచ్చు
లేనిచో దైత్యవీరుల నేని బంపు."

పలికె నంత సంభ్రమముతో పంక్తిరథుడు
"కుశిక కులమణీ! దైవము గురుడ వీవె
దానవేంద్రు మార్కొనగ మా తరముగాదు
పరమ కోమల మూర్తిని బంప గలనె?"

ఆగ్రహము జెంది అ క్కౌశికాత్మభవుడు
"పుత్త్రి వాత్సల్య మెంచకు భూమిపాల!
ఆడి తప్పని రఘువంశ మయ్య! మీది
మచ్చ గూర్తువె నీ విట్లు మాట మార్చి."

పరమ గురుడు వశిష్ఠుడు ప్రభుని గాంచి
"వెలయువాడ వీ విక్ష్వాకు కులము వెలుగ
తివిరి ప్రతిసృష్టి సేయు గాధేయు డితడు
ప్రతిన వీడక రాముని బంపు" మనియె.

ఆ మునీంద్రుని వాక్యాల నాలకించి
భయము బాధయు విడనాడి ప్రణతు డగుచు
రాముని సలక్ష్మణుని బంప భూమివిభుడు
కీర్తి పెంపొందు చుండ నంగీకరించె.

కూర్మి పట్టిని రాముని కుశలమతిని
అతని యనుజుని సౌమిత్రి నప్పగింప
అనుగు తల్లిదండ్రులకు వందన మొనర్చి
వెడలి రత్యంత ధీరులు వీరు లపుడు.

తూణ ధను రద్భుత కృపాణ పాణు లగుచు
గాధినందను గూడిన కాలమందు
కమ్మగా గాలివీచె; మంగళరవాలు
వీనువిందుగ దెసలందు విస్తరిల్లె.

అలఘు రఘురామ మహిమంబు నాత్మదలచి
అగ్రగామి విశ్వామిత్రు డరుగుచుండ
వెడలు చుండిరి వెనువెంట విభుని సుతులు
ప్రకృతి సుందర దృశ్యాల పరవశించి.

చేర సరయువు దక్షిణ తీరసీమ
తీయగా రాము బిలిచి గాధేయమౌని
ఆచమింపగ జేసి బలాతి బలలు
పరమ విద్య లటంచు నర్పణ మొనర్చె.

"ఈ బలాతి బలలు పఠియింప నీకు
అలపు ఆకలి దప్పులు కలుగ వెపుడు;
వెలిగెదవు వేయికిరణాల వేల్పుకరణి
నీకు సము డెవ్వ డుండడు నిఖిలజగతి."

అట్లు వచియించి గాధిజుం డస్త్ర శస్త్ర
విద్య లన్నియుఁ గ్రమముగా విశదపఱుప
సరయువు తటాన ఆ నిశాసమయమందు
తృప్తిగా వారు తృణశయ్య సుప్తులైరి.

"పుణ్య పురుష! కౌసల్యా సుపుత్ర! రామ
వేగ లే లెమ్ము తొలిసంజ వేళయయ్యె
దైవ మాహ్నికమును దీర్ప తరుణమిద్ది"
అనియె దశరథ తనయుల గనుచు మౌని.

వేకువనె లేచి, సోదరుల్ వేదవిధిని
స్నాన జపములు హోమమ్ము లైన వెనుక
మునికి మిక్కిలి భక్తితో మ్రొక్కు లిడిరి
పూర్వ రీతినె నడచిరి మువ్వు రపుడు.

సరయువు జలాలు గంగతో సంగమించు
అంగదేశ కాననవాటి నలరుచున్న
ఖ్యాతిగాంచిన రుద్రుని ఆశ్రమంబు
వారు మార్గమధ్యంబున జేరినారు. .

కౌశిక మునీంద్రయుతముగ దాశరథులు
రాత్రి ఆ తపోవనిని విశ్రాంతి గనిరి;
అతిథి పూజలు చేసిన అచటి ఋషులు
నావ గూర్చిరి జాహ్నవీ నదిని దాట.

గగనవాహిని గంగను గాంచినంత
ఆనతిచ్చిన మునిగాథ లాలకించి
మానవేంద్రుని సుతులు నమస్కరింప
సాగె నదిమీదియాత్ర ఉత్సాహ మెసగ.

మరల నేలపై నడచు ముువ్వురును వారు
ఘోర గంభీర విపినమ్ము జేరుతటిని
తాటకాకథ చెప్పెను తాపసుండు
శౌర్యనిధియైన శ్రీరామచంద్రు జూచి.

"రామ! ఇది తాటకావాస భూమి సుమ్మి
మౌని శపియింప దనుజగా మారినట్టి
కామరూపిణి కలుషాత్మ ఈమె చంపు
మానవుం డెవ్వ డేనియు కానరాగ.

కసిని పగబూను దుష్టరాక్షసి వధించు
మబల యని సంశయింపకు మయ్యా! నీవు
క్షాత్ర ధర్మము ప్రజకు రక్షణముగూర్చు
బాహు విక్రమునకు నీకు భద్ర మగుత!"

అంతలో క్రోధ విహ్వాల యగుచు రాగ
తమ్ముడౌ లక్ష్మణుండు సత్వరితలీల
తాటక చెవులు ముక్కును తఱుగ, దాని
కూల్చె కోదండరాముదు క్రుద్ధు డగుచు.

ఘోర భైరవ వికృత శరీర కూల
కౌశికుడు రఘురాముని కౌగిలించి
శిరము మూర్కొని కొంత యోచించి మదిని
సంతసమున సర్వ మహాస్త్రజాల మొసగె.

వనములో రేయి వసియించి పయనమైరి
దాశరథి కోరినంతనె దారిలోన
సకల దివ్యాస్త్రముల నుపసంహరించు
మంత్రముల నుపదేశించె మౌనివరుడు.

రామలక్ష్మణ యుతుడైన బ్రహ్మమౌని
వనములోని సిద్ధాశ్రమ పదము జేర
మునులు గాధేయునకు తగుపూజ సలిపి
అర్ఘసత్క్రియ మన్నించి రధిపసుతుల.

సవన మారంభ మయ్యె నాశ్రమమునందు
కౌశికుడు కోరినట్టులు దాశరథులు
కంటికిని కూర్కు లేకుండ కాచుచుండ
పంచ దివసంబు లరిగె ఏ భయము లేక.

ఆరవ దినంబు వచ్చెదు నంతలోన
వేగమే ఆకసమునుండి విఘ్నకరులు
వింతగా రక్తమును మఖవేదిపైన
కురియ సాగిరి రాముడు క్రోధమంద.

బలియులైన మారీచ సుబాహువులను
శేషరాక్షస నివహంబు చెదరగొట్టి
చంపె రాముడు వివిధాస్త్ర శస్త్ర సమితి
మునులు వేల్పులు లోకాలు ముదము చెంద.

మునికి సమకూర అవ్యయ మోక్షసిద్ధి
పూత తమమైన యజ్ఞమ్ము పూర్తియయ్యె;
కనుల నానంద బాష్పాలు కడలు కొనగ
కౌగిలించె రాఘవులను గాధిపట్టి.

సిద్ధుడై వెలుగొంద కౌశికుదు మునులు
విమల ఫలమూల తతులచే విందొనర్చి
వీరులను వినుతించిరి వే విధాల
పావనాశ్రమ నామ మన్వర్థ మయ్యె.

ముచ్చటల తోడ గడవంగ మూడు నిశలు
"ధార్మికుండైన జనకు డధ్వరము బూనె
దానితో గూడ అద్భుత ధను వొకండు
మీర లరయుంగ గలరయ్య మిథిలలోన."

మునివరేణ్యు డట్లు వచింప ఇనకులుండు
"మెలగు వారము నీ యాజ్ఞ మిథిల కట్లె
మేలుగా నేగి సౌభాగ్య లీల గాంచి
వేగ వచ్చెద" మనియెను వేడ్క మెరసి.

వినయ ధనులు రాకొమరులు వెంటరాగ
మానితంబగు సిద్ధాశ్రమంబు వీడి
బయలుదేరె విశ్వామిత్ర పరమమౌని
పరిజనంబుతో మిథిలానగరము జేర.

అద్భుతావహమై యొప్పు ఆత్మకథయు
కరము రమణీయమైన సాగర చరిత్ర
పరమ చిత్రమౌ గంగావతరణ గాథ
దారిలో వారలకు జెప్పె తాపసుండు.

గాధి సూనుని, మౌనుల గలసి చనెడు
సానుజుండగు శ్రీరామచంద్రు డరసె
జీవముల జాడలేని తపోవనంబు
మిథిలకు సమీపమం దొక పథమునందు.

"అతిమనోజ్ఞమై యలరు నీ యాశ్రమంబు
ఖగమృగాదిక శూన్యమై కానవచ్చు
ఏ మునీంద్రు డిచ్చట వసియించె మున్ను
ఏల వర్జిత మయ్యెనో ఎఱుగ వలతు."

పృచ్ఛ చేసె నా రీతి భూవిభుని సుతుడు
తనువు పులకింప కౌశిక మునిని గాంచి
తెలిపె నంత రాఘవుని సందియము తొలగ
గాధిసుతు డా పురాతన గాథ నిట్లు.

"గౌతమాశ్రమంబుగ నిది ఖ్యాతి గాంచె
ధార్మికుండు లోక ప్రసిద్ధ మతియైన
గౌతముడు నిజ రమణీ సమేతు డగుచు
సురలు మెచ్చగ సాగింప చిరతపస్సు.

ఆ మహాత్ముని పత్ని అహల్య ఆమె
మోహనాంగి; దేవతలును మునులు కూడ
రూప యౌవనములు రెండు రూపుగొన్న
పొలతి నరసి కోరెద రామె పొందు నంద.

పతికి భక్తితో సతము సపర్య సేయు
ఆ మనోహరాకార నహల్య గూడ
కామ పరితప్తుడై శచీకాంతు డెంతొ
వేచియుండెను కాలంబు వెదకి కొనుచు.

ఆశ్రమము వీడి గౌతము డవల కేగ
అతని రూపము చక్కగా నలవరించి
సమయము నెరింగి ఏతెంచి అమరవరుడు
ప్రమద నా అహల్యను గాంచె ప్రమద మెసగ.

"వలపు నణచంగ శక్య మెవ్వరికి గాదు
చేరగా నిన్ను తిరిగి వచ్చితిని నేను"
అట్టు లనియెడు ముని రూపు నరసినంత
నాతి యెరిగె నాత డమరనాథు డనుచు.

ఆస లిగురొత్తగ 'కృతార్థనైతి' నంచు
గౌతమ మునీశ్వరుని పత్ని కాంక్షదీర
కౌతుకాన్వితు నాతని కౌగిలింప
దివిజనాథుడు కేళిని తేలియాడె.

మనసు గొలుప నింద్రియ సౌఖ్య మనుభవించి
"గౌతమ తపస్వి వచ్చెడు కాలమయ్యె
కదలు" డన నహల్య సఫలకాముడైన
వాసవుడు వేగ మేగెను భయము గదుర.

ఆశ్రమోపాంతమున నెదురైన ఇంద్రు
కపట వేషిని గాంచిన గౌతముండు
కోపశీలియై శీఘ్రమే శాప మొసగ
వ్రీలిపడె భూమి నింద్రుని బీజయుగము.

ఆశ్రమంబును జొచ్చి అహల్య జూచి
"కామినీ! తిండి దొరకక గాలి దినుచు
ధూళి బొరలుచు శిలవలె వేలయేండ్లు
ఏరికి అదృశ్యవై తపియింపు మిటనె.




నందనమ్ము కరణి వెలుగొందు వనము
నిర్జనమ్మయి శూన్యమై నీరసిల్లు
పరమ పురుషుని రాముని పాదరజము
పూర్వరూపము ఘటియించు బోటి! నీకు.

వేచియుండుము రఘురాము జూచుకొలకు
మ్రొక్క నతనికి శాపవిముక్తి గలుగు
నన్ను జేరి సేవింతువు మున్ను వోలె"
అని వచించి గౌతముడు హిమాద్రి కరిగె.

"ప్రాణ్యదృశ్యయై ఆశ్రమప్రాంగణాన
నీదు చరణాబ్జ రజముకై నిర్నిమేష
లోచనాలతో నేటికి వేచియున్న
ఆ అహల్యను బ్రోవుమో యనఘచరిత!"

అటులు మౌని విశ్వామిత్రు డానతీయ
ఆ మహాభాగయు తపోధనాఢ్యయైన
గౌతమార్ధాంగి శాపాంతగాథ గాంచ
అడుగిడిరి శూన్య దుర్గమోద్యాన వనిని.

కోమలి నహల్య కననైన రాము డపుడు
తనదు నామంబు తెలిపి పాదాల నంటి
ఒక్కపరి తృప్తి తీరగ మ్రొక్కు లిడగ
ఆత్మ నెరిగె నామె యతడు హరి యటంచు.

అద్భుతానంద రస వివశాత్మ యగుచు
ఆ మనోహరి వచియించె రాము నరసి
"పరమపురుష! అపూతనై ఒరులు కనని
తప్తచిత్తను నేటికి ధన్యనైతి.

గౌతమ మహర్షి చెప్పిన గడియ వచ్చె
మోహమును వీడి శాపవిముక్త నైతి
భూపసుతుని దర్శించు విభూతి" ననుచు
అర్ఘ్యపాద్యాది పూజల నందజేసె.

పుణ్యసాధ్విని దివిజులు పొగడుచుండ
అమిత తేజుడు గౌతము డటకు వచ్చి
సముచితంబుగ రాముని సత్కరించి
తపము సాగింప సతితోడ తరల నెంచె.

రామలక్ష్మణు లప్పుడు రాణ మెఱయ
వినుత నీహార శిఖరికి వెడలనున్న
పావన చరిత్రులైన దంపతుల బంపి
ప్రీతితో మౌనికాంతుని వెంట జనిరి.

వారలు పవిత్ర గంగా భవాని దాటి
కౌశికునితో విదేహ విఖ్యాతపురము
మిథిల జేరిరి, చూడగ ప్రథితమఖము
కలసి వచ్చెదు బృంద ముత్కంఠ నంద.

జనక విభుని మహా యాగశాల కరిగి
సవన వస్తు సమృద్ధికి సంతసించి
“నేడు వనవాటు లెల్లను నిండిపోయె
వివిధ దేశాగతులు వేదవిదులతోడ.

వీక్షణము సేయదగు నొక విడిది” యనుచు
దాశరథి వచియింప నా కౌశికుండు
సుందరమ్ము ప్రశాంతమౌ చోటుగాంచి
వెంట వచ్చిన వారితో విడిసె నచట.

గాధిజుదు బ్రహ్మమౌని ఆగమన మెరిగి
కులగురుండౌ శతానందు గూడి వచ్చి
శ్రుతిహితంబుగ గావించి యతిథి పూజ
అనియె మిథిలాధినాథుడు జనకవిభుడు.

“పూజ్యపాద! మీ రాక మా పుణ్యఫలము
సవము పండ్రెండు దినములు సాగునింక
సురల యాగ భాగార్థుల జూడవచ్చు
ఆగ వేడెద మిమ్ముల నంతదనుక.

కనగ ఉత్తమరూప యౌవనులు వీరు
చంద్ర సూర్యుల కరణి దిశల నెసగుచు
భూరి వనులలో సుమసుకుమారు లయ్యు
కూడ నేతెంచు ఈ జోడు కోడె లెవరు?”

దశరథ సుతులు వీరలు ధరణి నాథ!
శ్యామలామలమూర్తి మా రాము డితడు;
ఎప్పుడీ రాము కంటిని రెప్పవోలె
కాచుకొను అనుజుండు లక్ష్మణు డితండు.

తండ్రి యొసగిన ఆజ్ఞ నౌదల వహించి
సవన సంరక్షణార్థమై సాగివచ్చి
భద్ర యశులు వీరలు కాకపక్ష ధరులు
తాటకను వధియించిరి దారిలోన.

ఏను: వనవాటిలో దీక్ష బూనినంత
భూధవ! సుబాహు మారీచ యోధవరుల
ఇరు శరంబుల బడగొట్టి ధరణి మీద
రాము డొనరించె నధ్వర రక్షణమ్ము.

గౌతమ మహర్షి నాతిని రాతిజేయు
సతి అహల్య ఈ శ్రీరామ చంద్రమూర్తి
పాదధూళితో పూర్వరూపంబు నొందె
తొల్లి సలిపిన పాపంబు తొలగిపోవ.

కూర్మి సాకేత వాసు లీ కొమరు లధిప!
శీఘ్రమే చూడవచ్చిరి శివధనుస్సు"
అటులు మౌని వినిచిన ఆఖ్యాన మెల్ల
భూపు డాలించె హర్ష ప్రపూర్ణు డగుచు.

ముని శతానందు డా గౌతముని సుతుండు
చిరతపస్వి తన తల్లి చేర ధవుని
కారకుండైన రాముని ఘనుని గాంచి
పట్టు జాలని ముదముతో పలికె నిటులు.

"స్వాగతము రామ! వరనరపాలపుత్త్ర!
మాన్యుడైన విశ్వామిత్రమౌనితోడ
ఈ తెఱంగున నిచ్చటి కేగుదేర
భవ్య భవదీయ దర్శన భాగ్య మబ్బె.

కౌశిక మహర్షి కవచమై కాచుకతన
నిన్ను బోలిన ధన్యులు నిక్క మరయ
కలుగ బోరయ్య! సర్వ లోకాలలోన
వినుము రఘురామ! గాధినందనునిగాథ!

గాధివిభుని సుతుండైన కౌశికుండు
వీర్యవంతులలో పృథువిక్రముండు
కన్న బిడ్డల కైవడి గనుచు జనుల
నేల నేలె యశమ్ముతో వేలసమలు.

ఉర్విభుడు విశ్వామిత్రు డొక్కతరిని
కాన నేగె నక్షౌహిణీ సేనతోడ
పరమ శాంత హరిణ సంఘ సురుచిరంబు
శ్రీ వసిష్ఠ మహర్షి తపోవనంబు.

బ్రహ్మలోకంబు బోలు ఆశ్రమ పదంబు
వారు చేరినంత నొసంగి స్వాగతంబు
కుశిక వంశవరేణ్యుని కుశల మడిగె
శిష్టుడు త్రికాలవేది వశిష్ఠమౌని.

కందమూల ఫలాహార మందజేసి
విభునకు ససైన్యునకు మంచి విందొనర్ప
అనఘు డా మునిచేయ నభ్యర్థనమ్ము
కాదనగ లేక పోయెను కౌశికుండు.

సంతసంబుతో నంతట శబల యనెడు
కామధేనువుతో జెప్పె నా మహర్షి
షడ్రసోపేతమైన భోజన మొసంగ
ఆచరింపగ సత్కార మర్హ సరణి.

అన్నరాసులు లేహ్య చోష్యాదు లెల్ల
రసము లమృత తుల్యంబులు రమ్యరీతి
క్షణములో నక్షయంబుగ శబల కురిసె
విందు విలసిల్లె బహువిధానంద మొప్ప.

గోసహస్రంబు గైకొని కోరి తనకు
కామగవి నిమ్మనుచు వేడె గాధిసుతుడు
రజత రాసుల నిచ్చిన రా దటంచు
తోడనే వశిష్ఠ మహర్షి త్రోసి పుచ్చె.

ఎన్ని రీతుల కోరిన నీయ డయ్యె
కామధేనువు నా మునికాంతు డపుడు
ధర్మ కర్మల కెల్ల నాధార మనుచు
తనదు జీవిత సర్వస్వ మనుచు తెలిపి.

సైన్య సంయుతుడైన రాజన్య వరుడు
బలిమితో దాని బట్టించి బయలు దేరె
మూర్ఖు నెదిరింపలేనని ముని వచింప
సురభి మనసులో నత్యంతశోక మందె.

బ్రహ్మ బలము దివ్య మతిప్రభావయుతము
సాటికాలేదు దానికి క్షత్ర బలము
కాన నీ తపోమహిమచే వాని మదము
బలము నడచి వత్తు నటంచు పలికె శబల.

వరబలంబున గవి వీరవరుల నంత
సృష్టి యొనరించి క్షితిపతి సేన దున్నుమ
గాధిసుతుడు విరక్తుడై ఘనతపంబు
శీతనగమున సలిపెను శివునిగూర్చి.

వరదుడగు వామదేవుని వరము పొంది
కౌశికుండు మహాస్త్ర సంకలితు డయ్యె
పొగరున జని వశిష్ఠతపోవనమ్ము
దగ్ధ మొనరించె ఘనతరాస్త్రాలచేత.

ఆగ్రహోదగ్రు డగుచు మహాతపస్వి
కాల దండము మించిన లీల గ్రాలు
బ్రహ్మదండంబు చేబూని వరుస బెట్టి
అతని సర్వాస్త్ర సమితి నాహుతి యొనర్చె.

ప్రభుడు చివర ప్రయోగింప బ్రహ్మశిరము
దండశక్తి గ్రసించె నద్దాని కూడ
బ్రహ్మ తేజుండు రోమకూపాల నుండి
బయలు వెడలంగ దీప్తుల పావనాగ్ని.

తాపసి వసిష్ఠు బ్రహ్మ స్వరూప మపుడు
రౌద్రము మనోజ్ఞము భయంకరంబు నయ్యె;
క్షత్రియ బలంబు నిజముగ సాటిరాదు
బ్రహ్మ బలమున కంచు నా ప్రభు డెరింగె.

పరిభవంబుతో దక్షిణా పథము జేరి
అచల తపమును బ్రహ్మత్వ మందగోరి
వేయి యేండ్లు విశ్వామిత్రవిభు డొనర్ప
పలికె పరమేష్ఠి "రాజర్షివరు" డటంచు.

తన తపమ్మున కా లబ్ధి తగ దటంచు
ఆగ్రహాన కౌశికుడు మహోగ్ర తపము
సలుపుచుండ నేతెంచె త్రిశంకు డటకు
తన్ను బొందితో దివి కంప దక్షు డనుచు.

కులగురు కుమారశత మతికుపితు లగుచు
శాప మొసగి రటంచు త్రిశంకు డనగ
శరణు జొచ్చిన ఐక్ష్వాకు శాంతపరచి
సఫల కాముని జేయ యజ్ఞమ్ము సలిపె.

కుక్కమాంసంబె నిత్యంబు కూడుకాగ
ఏడు వందల మారులు హీనమైన
ముష్టి జాతి వాశిష్ఠులు పుట్టునట్లు
కుశిక కులజుండు శపియించె కోపవశత.

నిత్యధార్మికు డగు తన్ను నింద చేయు
కతమునను శాప మిచ్చెను కౌశికుదు, ని
షాదుడవు కమ్మటంచు మహోదయునకు
సర్వ లోక దూషితుడయి సంచరింప.

తన పిలుపుతో హవిస్సు గైకొనగ రాని
అమరవరులపై కౌశికు డాగ్రహించి
స్వార్జిత తపోబలాన త్రిశంకు బంపె
మేనితో స్వర్గమునకు నిమేష మందె.

స్వర్గ భువనంబునకు గురుశాప హతుడు
రాదగ డటంచు సురలు నిరాకరింప
పాకశాసను దుగ్రుడై పంపివేసె
తల్లక్రిందుగ నాతండు ధరణి గూల.

అవని బడెడు త్రిశంకుని ఆర్తరవము
ఆలకించి విశ్వామిత్రు డాగు మనుచు
క్షణములో సృజించె అపర సప్తఋషుల
అపర తారకా సముదయం బాకసాన.

అట్లు మరొక బ్రహ్మగ దక్షిణాశయందు
నవ దివంబును సృష్టించి దివిజగణము
సమ్మతింపగ నుంచె త్రిశంకు నచట
శాశ్వతముగ నతడు సద్యశంబు గనగ.

దక్షిణమునందు విఘ్నాలు తగిలె ననుచు
పశ్చిమాశాంత మందు నొప్పారుచున్న
పుష్కర తటాన దివ్యతపోవనమ్ము
వినుతతేజుండు చేరెను మునులతోడ.

కంద మూలాశనుం డయి అందు సలిపె
ఘనతపము దృఢదీక్షతో కౌశికుండు
మఖ పశువుకాగ అ వ్వనమార్గమందు
చను శునశ్శేఫు డాతని శరణు వేడె.

అంబరీషుండు మొదలిడ యజ్ఞ మొందు
యాగ పశువును శతముఖు డపహరించె;
ఒక్క నరపశువునకై అయోధ్యరాజు
శీఘ్రముగ నేగి కాంచె ఋచీక మౌని.

ఆ మహర్షి మధ్యమసుతు నమ్మివేయ
ఆ శునశ్శేఫు రక్షకై కౌశికుండు
తన కుమారుల నడిగె అతనికి మారు
యజ్ఞ పశువుగ ప్రీతితో నరుగ నొకని.

స్వాత్మజులు ధిక్కరింపగ శాప మొసగె
చెడు కులంబున బుట్ట వాశిష్ఠు లట్లు;
అంబరీష శునశ్శేఫు లలరుచుండ
యజ్ఞఫల జీవదానంబు లమరజేసె.

ధర్మ రతుడు విశ్వామిత్ర పరమ మౌని
సౌమ్య పుష్కర క్షేత్రాన సలుపు తపము
వర్షములు వేయి నిండంగ వనజభవుడు
పలికె "ఋషివైతి" వనుచు దేవతలు మెచ్చ.

దానితో తృప్తి చెందని మౌనివరుడు
మరల తపమును సాగింప మహిత దీక్ష
మెలత మేనక ఏతెంచె మించువేడ్క
మెరుపుతీగను బోలు అప్సరస ఆమె.

తరుణి అప్రతిమాన సౌందర్య మరసి
కామమోహితు డయ్యె నా కౌశికుండు
మేనకా భోగ మగ్నత మేను మరచి
గడపె దశ వత్సరమ్ములు క్షణము లట్ల.

నాక వాసులు తపము విఘ్న మొనరింప
చెలువ నంపి మోహావిష్టు జేసి రనుచు
గాధిజుండు గ్రహించి ఆగ్రహముతోడ
ఉత్తరాద్రి కేగెను తప్తచిత్తు డగుచు.

కౌశికీ తీరవనవాటి కౌశికుండు
కామము జయించి తపమును కఠిన నిష్ఠ
సలుప వేయేదు, లాతని శాంతు జేసి
హర్షమున బిల్చె బ్రహ్మ "మహర్షి" యనుచు.

అజుని పల్కుల నాలించి అహరహమ్ము
గాధిపుత్రుండు సాగించె కఠినతపము
ఊర్ధ్వ బాహుడై విజితేంద్రియుండు నగుచు
వేయి వత్సరమ్ములు; వజ్రి విభ్రమించి-

రమణి నాకవిలాసిని రంభ నంపె
కామ విభ్రాంత చిత్తునిగా నొనర్ప;
అమరులకు నై తపోభంగ మాచరించు
ఉవిద గాంచి విశ్వామిత్రు దుగ్రు డయ్యె.

ఇంతి కోపవశు డయి శపించి శిలగ
పరితపించుచు మఱల కోపమును గెల్చి
బ్రహ్మపదమంద జేసె నప్రతిమ తపము
కౌశికుండు వేయేండ్లు పూర్వాశ కరిగి.

ఆ మహర్షి మహోగ్ర తపోగ్ని చేత
మూడు జగములు క్షణములో మాడకుండ
అమర గణములు మెచ్చ బ్రహ్మర్షి యనుచు
గాధినందను దీవించె కమలభవుడు.

కౌశికుని కోరిక ఫలింప కరుణతోడ
వచ్చిన వశిష్ఠ మౌనియు బ్రహ్మ ఋషిగ
అతని నాశీర్వదించె సఖ్యమ్ము దనర
ఆ తపస్వి విశ్వామిత్రు డరయ నితడె."

అని వచించె శతానందు డచట నున్న
రామ లక్ష్మణులు జనకరాజు వినగ
తపము రూపంబు దాల్చిన ధన్యతముని
గాధిజుని పరమోత్కృష్ట గాథ నెల్ల.

సంయమీంద్రుని రాకకు సంతసించి
సవనము జయప్రదంబుగ సలుపవేడి
చనియె సపరివారమ్ముగ జనక విభుడు
విడిది కేగె బ్రహ్మర్షియు విశ్రమింప.

జనక భూపతి మరుదివసంబు నందు
ప్రేమ మీర విశ్వామిత్రు పిలువనంపి
స్వాగత మొసంగ, పలికె నా పరమమౌని,
"క్షత్రియులు వీరు దశరథ పుత్త్రమణులు.

అధిప! నీ పవిత్ర హర శరాసనంబు
గాంచి ముదముతో వెడల వాంఛించు వీరు
లోక విశ్రుతులు; కలుగు నీకు శుభము
దాని జూపింపు మిప్పుడు తనివి దీర."

జనకవిభు డంత ధనురాగమన చరిత్ర
విస్తరమ్ముగ నీ రీతి విన్నవించె
"యజ్ఞభాగము తాను దక్షాధ్వరాన
కానక మహోగ్రు డయ్యె ముక్కంటి మున్ను.

అనిమిషుల మీది కినుకతో ధనువు నెత్తి
శివుడు శిరములు ఖండింప సిద్ధపడగ
సన్నుతించుచు వారలు శాంతు జేయ
చాప మచ్చటనే వీడి చనియె నతడు.

సవన మొనరింప సమకట్టి అవనిదున్ను
సమయ మందున నాగేటి చాలునందు
కానవచ్చెను నాకొక కన్య ధన్య
ఆత్మజగ పెంచుచుంటి సీతాహ్వయాన.

భవుని చాపంబు మా పూర్వవంశ్యుడైన
దేవరాతుని జేర మదీయ మయ్యె;
తరుణి మా ఆత్మజాత సీతాకుమారి
వీర్యశుల్క జేయగ నాకు వేడ్క కలిగె.

బహు మహీవర చతురంగ పరికరాల
క్రిక్కిరిసి పోయె మిథిల మున్నొక్కమాఱు
చాట శివచాప మెక్కిడు శౌర్యశాలి
ఆమె పాణిని గ్రహియింప నర్హు డనుచు.

కాని రాజకుమారు డొక్కడును గూడ
వింటి నెత్తెడు శక్తి చూపింప డయ్యె
బాహు బలశాలి శ్రీరామభద్రు డెక్కు
పెట్టినం జాలు సీత కేల్పట్ట గలడు".

ఇనుప పెట్టెను జనక మహీశునాజ్ఞ
వీర్యవంతులగు అయిదు వేలమంది
కష్టముగ దెచ్చి రష్ట చక్రాలపైని
విస్మయము నొంద జనములు వింటి నరసి.

"ఎక్కుపెట్టుట యనుమాట ఎట్టు లున్న
కదపలే రింమకయు ఇంతకాల మెవరు
ఘన తరంబగు ఈ దివ్యకార్ముకంబు
వీరు లీ రాఘవులకు చూపింపు డయ్య!"

జనకరాజు కౌశికునితో ననగ నట్లు
హరు శరాసనము దశరథాత్మజునకు
చూపె నతడు; దాశరథి మంజూష దెరచి
మౌనివరు నాజ్ఞ గోరెను దాని నెత్త.

సన్మునీంద్రుండు ప్రీతితో సమ్మతింప
లీల వోలె శ్రీరాముడు కేల బూని
విల్లు మోపెట్టి విఱిచెను ఫెళ్లు మనగ
అరయు రాజవరేణ్యు లచ్చెరువు నొంద.

కురిసె పువ్వుల వాన లంబరము నుండి
మొరసె మంగళ రవములు మోద మొదవ
అరసె జనకమహారాజు కరవు దీర
మెరసె సీత కన్నులు మిరుమిట్లు గొనగ.

పుట్టెనంత మహాధ్వని పుడమి వడకె
మునిగిరి సదస్యు లెల్లరు మూర్ఛలోన
తీరగా భీతి, వారలు తేరు కొనగ
ప్రణతు లిడి జనకవిభుండు పలికె నిటులు.

"కార్ముక మ్మిట్టె విరిగె రాఘవునిచేత
కౌశికా! కంటి నీ జగత్కాంతు శక్తి
అటులె పరమోపకారు ని న్నరయుచుంటి
ఇట్టి ఘటనకు మూల మీవే మహాత్మ!

క్షత్త్రియ బలమ్ము బ్రహ్మతేజమ్ము కలసె
రాము రూపాన విక్రమోద్దాము డితడు
బాలకుఁడు కాడు త్రిభువన పాలకుండు
ధన్య మొనరించె నా జన్మ ధనువు దునిమి.

నా దుహిత వీర్యశుల్కగా నాడు నేను
పలికిన ప్రతిజ్ఞ నేటికి సత్య మయ్యె
పరిణయమ్ము గావింప నా ప్రాణమైన
సీత రామున కగుగాక జీవకళిక.

ఘనత గాంచిన మౌని వీ వనుమతింప
వేగమే అయోధ్యాపురి కేగ గలరు
ప్రభువునకు దెల్పి శివధనుర్భంగ గాథ
మంత్రు లింగితజ్ఞులు మంత్ర తంత్రవిదులు.

సీతను మదీయ సుతను సంప్రీతితోడ
దాశరథికి నే నొసగంగ దలచినట్టి
విషయము వినయ మేపార విన్నవించి
దారయుతు దశరథు గొనితేర గలరు."

దిక్కు దిక్కున సాగించి తీవ్రతపము
బ్రహ్మ ఋషియైన ఆ ముహూర్తమున కంటె
గాధితనయుడు పులకితకాయు డగుచు
అట్టులే యొనరింపగ ననుమతించె.

ఆ మహీశుడు దూతల కాజ్ఞ నొసగ
రయమున రథా లయోధ్యాపురంబు జేరె;
రాజమందిరంబున దశరథుని గాంచి
పలికి రిట్లు వారలు భవ్య భాషణాల.

"విభుదు జనకుందు నెయ్యము వియ్య మెనయ
తియ్య తియ్యని పలుకుల తెలుప బంపె
అచట నున్న విశ్వామిత్రు డనుమతింప
రాము డొనరించె శివ ధనుర్భంగ" మనుచు.

"విమలచారిత్ర మైథిలి వీర్యశుల్క
అనుచు తాను ప్రతిజ్ఞ బూనిన కతాన
రామునకు సంతసంబున నామె నొసగ
మిమ్ము సమ్మతింపగ జేయ మమ్ము బనిచె.

సకల బాంధవ పరిజన సహితు లగుచు
తరలిరందు మా మిథిలకు ధరణి నాథ!
ప్రథిత యశుదు మత్ప్రభుమనోరథము దీర"
అని వచించిరి దూతలు జనకునాజ్ఞ.

అనఘులు వశిష్ఠ వామదేవాది మునుల
స్వామి భక్తులైన తనదు సచివ వరుల
పిలువ నంపి దశరథుందు తెలియ జేసె
దూత వాక్యమ్ములకు పరితోష మంది.

గురు పురోహితామాత్యులు, త్వరితగతిని,
వెడలుదము సముచితముగ పెండ్లి కనిరి;
వారు మిథిలాపురవరమ్ము చేరినంత
స్వాగత మొసంగె జనకుందు సంబరాన.

ధారుణీ పతి జనకు నంతఃపురమ్ము
హర్ష కళలతో దేరుచు అలరుచుండె;
దశరథుడు గాంచి ఆత్మపుత్త్రిద్వయుంబు
పరమ సంతోషమున పరవశత నందె.

"క్షితిప! మీ కులగురుడు వశిష్ఠ మౌని
కాంచి పూజించి తరియింప గలిగినాడ
విపుల యశులైన మీతోడ వియ్యమంద
పరమపావన మయ్యె మా వంశమెల్ల.

అధ్వరమ్ము పరిసమాప్తమైన యంత
విమలమగు నట్టి సుప్రభాతమున రేపు
జరుపగా వివాహము ఋషి సమ్మతముగ
నీ యనుజ్ఞను పాలింతు నృపలలామ!

మీకు వశవర్తులము సుమీ! మే" మటంచు
పలుకనట్లు విదేహ భూపాలకుందు
దశరథ నృపాలుదు సదారతనయు డగుచు
విశ్రమింపగ నా రాత్రి విడిది కేగె.

జనకు డా తత్త్వసంవేది మునుల తోడ
తెల్లవారగ సవన సత్క్రియలు దీర్చి
తన యనుజు కుశధ్వజు జేసె తరలిరాగ
రమ్యమైన సాంకాశ్య పురంబునుండి.

వినయ మెనయంగ జనకుండు పిలువ నంప
సదమ లేక్ష్వాకు నృపవంశ సత్తముండు
సచివ బంధు పురోహిత సహితు డగుచు
వచ్చి మిథిలేశు జూచి వాక్రుచ్చె నిట్లు.

"కుల పురోహితు డిక్ష్వాకు కులుల కెల్ల
వంద్యు డీ వశిష్ఠ మహర్షివరు డటంచు
నీ వెరుంగుదు; వితడు వర్ణింప గలడు
సభ్యులు వినంగ మాదు వంశక్రమంబు.

పరమ యోగి వశిష్ఠుడు వాక్య విదుడు
కౌశిక మునీంద్రు నాజ్ఞను గాంచి వినిచె
సలలితంబుగ నిక్ష్వాకు కుల చరిత్ర
మానితము ఋషిమండల మధ్యమందు.

"మాన్యులు వదాన్యు లగుచును మనువు మొదలు
తరతరాల ధర్మాత్ములై పరగునట్టి
అజిత రాజులచేత ఈ యన్వయంబు
లోక విశ్రుత మయ్యె అనేక గతుల.

అర్కకుల విభు తనయులం దగ్రజుండు
ప్రేమ సాగరుడైన శ్రీరాము డితడు;
ఇతని వెనువెంట సంప్రీతి సతము చనెడు
లక్ష్మి వర్ధను డనుజుడీ లక్ష్మణుండు.

సోదరులు ధర్మ నిరతులు వేదవిదులు
ధీరమతులు, వరింతుము వారి కొఱకు
జనక భూపతీ! నీ తనూజలను వేడ్క
తరుణుల నిడంగ దగదె సద్వరుల కెలమి.

అంత న వ్విదేహవిభుడు సంతసించి
"స్వీయః వంశచరిత్రను చెప్ప టెపుడు
తనదు ధర్మము కన్యాప్రదాత" కనుచు
శ్రేష్ఠ ధర్మాత్ము డైన వశిష్ఠు గాంచి.

"మూడులోకాలలో కీర్తి పొందినట్టి
పరమధర్మాత్ము డగు నిమిప్రభువరుండు
మూలపురుషుడు మాకు; భూపాలవరులు
మిథిల పాలించి రెందరో ప్రథితయశులు.

హ్రస్వ రోమ నాముండు మహాత్ము డతడు
దేశ మేలి మా జనకుండు దివికి జేర
అవనిభార మూనితిని; నా యనుజు డితడు
సరస సద్గుణశాలి కుశధ్వజుండు.

అధిపుడు సుధన్వు డనెడు మహాబలుండు
పాలన మొనర్చె సాంకాశ్యపట్టణంబు;
సీతతో పాటు కోరగ శివుని ధనువు
అతని మాటల మన్నింపనైతి వేను.

అందు కాతడు మిక్కిలి ఆగ్రహించి
పురము మిథిలను బలముతో ముట్టడింప
సమరమందు సుధన్వుని సంహరించి
నేతగా కుశధ్వజు నట నిలిపినాడ.

రూపగుణముల రామానురూప సీత
లక్ష్మణున కట్లె మా ఊర్మిళాకుమారి
కూర్తు ప్రియులుగ మీరలు కోరినట్లు
ధన్యుడను రఘువంశ బాంధవము కతన.

నేడు నక్షత్ర మది మఘు; నేటి కింక
మూడవ దివస ముత్తర చూడ శుభము
పెండ్లి కనుచు వచింతురు పెద్ద లెపుడు
దాని కంగీకరింపుడు దశరథేశ!"

అట్టు లనెడు జనకవిభు నరసి పలికె
ఘనతపశ్శాలి తేజస్వి కౌశికుండు
"సమము లీరెండు కొలములు సాటిలేని
తీరున చిరకాలముగ వర్ధిల్లు ధరణి.

రమ్య గుణశీలురగు దశరథ తనయులు
భరత శత్రుఘ్నునాములు వరులు గలరు
వారి కన్ని విధమ్ముల వాసి మీరు
కన్నియలు కుశధ్వజునకు కలరు గాదె?

కోరుచున్నాము పెండ్లి కొమారితలుగ
వారి నిరువుర శూరులౌ వరుల కొరకు
చక్కగా మేళవించి వంశాలు రెండు
అలర నాచంద్రతారార్క మవనిలోన."

జనకుడు వశిష్ఠ కౌశిక మునుల గాంచి
"మీ రొసంగిన యాజ్ఞను గారవించి
భరత శత్రుఘ్నులకు గూడ జరుప నెంతు
ఒక్క వేదికపై వివాహోత్సవాలు."

పలుక నీ రీతి దశరథావని విభుండు
విడిదిలో విధియుత నాంది విధుల దీర్చి
సుతుల శ్రేయంబు గోరి భూసురుల కిచ్చె
వత్సహిత ధేను సహస్ర ముత్సుకతను.

దక్షిణలు భూసురుల కిచ్చు దశరథ నృపు
గలిసె భయభక్తి, గౌరవకలితబుద్ధి
ధరణీ వరుడు యుధాజిత్తు; భరతపుత్త్రి
మాతులుడు కేకయాధీశసూతి యతడు.

"అనుగు మనుమని కనుగొన ఆస్థ చెంది
నా కొసగె నాజ్ఞ మాతండ్రి కేకయుండు
అతి రయమ్మున తోడితె మ్మనుచు నతని
అంత భరతుకోస మయోధ్య కరిగినాడ.

మీర లెల్ల రున్నారలు మిథిల ననుచు
చెప్పగా నట, ఇటకు వచ్చితిని భూప!
భరతు నా మేనయల్లుని అరయ నేను"
అను యుధాజిత్తు దశరథు డాదరించె.

ప్రేమధాములు జానకీరాము లనుచు
ముచ్చటల జను లెల్లరు మురియు చుండ
నయన పర్వమై కనవచ్చె నగరమందు
ప్రకట కల్యాణ శృంగారవైభవమ్ము.

యోగ్య ముత్తర ఫల్గునీయుక్త తిథిని
ధార్మికుడు వసిష్ఠుడు విప్రతతులతోడ
పేర్మి నలరెడు మంగళ వేదిపైని
పరిణయక్రియ లన్నిటి జరుప బూనె.

సర్వభూషణ భూషిత చారువదన
జనక రాజన్యదుహిత క్ష్మాతనయ వచ్చె
క్రమ దరహాస మంజుల కాంతు లొలుక
పుణ్యముల ప్రోవు శృంగారమూర్తి యామె.

కౌశికుడు శతానందుడు కాంచుచుండ
మంత్ర విధిసహితముగ హోమంబు సలుప
జనకు డగ్నిసన్నిధికి భూజాత జేర్చి
నిలిపి రఘురాము నెదుటను పలికె నిటులు.

సీత ఈమె నా కొమరిత స్వీకరింపు
నీదు సహధర్మచారిణి నిందు ప్రేమ
పావనమ్మైన భవదీయపాణిచేత
రామ! చేకొను శ్రీకరం బీమెకరము.

ఈ మహాసాధ్వి కోసలరామ! నిజము
నిత్యము మెలంగు నీతోడ నీడపోలె"
అనుచు ధారవోసెను రాము హస్తమందు
భూధవుడు జనకుడు మంత్రపూత జలము.

భేరులను గొట్టి వేల్పులు విరులు గురియ
పర్వ దివి భువి శంఖారవంబు నిండి
పాడి యాడిరి పౌరులు వాడలందు
పరమ మంగళ సీతా వివాహవేళ.

మించు వేడ్క ఊర్మిళను సౌమిత్రి కిడగ
భరతున కొసంగ మాండవి పత్నికాగ
కృపను శత్రుఘ్నునకు శ్రుతకీర్తి నీయ
పరిణయం బాడి రవ్వారు పరమరక్తి.

నవ వధూవరులను గాధినందనుండు
చేర బిలిచి ముదమున ఆశీస్సు లొసగి
జనక దశరథ నృపులు త న్ననుమతింప
అపుడు సంతృప్తితో తుషారాద్రి కరిగె.

సతులతో వంశకరులైన సుతులతోడ
తన తపంబెల్ల ఫలియించె నని తలంచి
వేడ్క దశరథ నృపమౌళి విడిది జేర
తెలియ రాకుండ గ్రుున తిరిగె రేయి.

క్రొత్తకోడండ్రు కొడుకులు కూర్చ ముదము
పరిజనులతో దశరథుండు పయన మయ్యె;
ధన కనక వస్త్ర వాహన తతి యుతంబు
సారె నొసగి జనకు డంత సాగనంప.

వా రయోధ్యకు చనియెడు దారిలోన
ఘోరముగ మింట పక్షులు కూయసాగె;
జంతువులు ప్రదక్షిణముగ గంతు లిడగ
పరిసరం బొక్కపరి భూత భయద మయ్యె.

దుర్నిమిత్తము లెల్లెడ తోచినంత
పృథ్వి కదలంగ వాయువు వీవ దొడగె;
నృపుడు సుతులు వశిష్ఠాది ఋషులు దక్క
సేనతో నెల్లవారు నిశ్చేష్టులైరి.

ఆగ్రహోగ్రుడై యచట ప్రత్యక్ష మయ్యె
మెరయు పరశువుతో కాలమృత్యు వట్లు
పూజ కర్హుడు భృగువంశమునివరుండు
క్షత్త్రి సంక్షయు డాతడు జామదగ్ని.

అర్ఘ్య పాద్యంబు లిడ వసిష్ఠాదిమునులు
పరశురాముండు కినుకతో పలికె నిటులు
"శూర! రాఘవ! హరుని శరాసనంబు
విరచితి వటన్న వార్త నే విన్నవాడ.

అద్భుత మచింత్య మయ్యది అరయు మిదిగొ
నాదు జనకుండు జమదగ్ని నా కొసంగె
విష్ణు చాపము భయదము వీర్యయుతము
నేడు దీని నెక్కిడి చూపు నీ బలమ్ము.

తపము సలుపంగ నా తండ్రి ధనువు వీడి
అత్యహంకారి కార్తవీర్యార్జునుండు
చంపె నాతని, క్షత్త్రివంశాల నెల్ల
నాశ మొనరించినాడ నావేశమతిని.

మఖము గావించి కాశ్యపమౌని కొసగి
క్షితితలం బెల్ల యజ్ఞదక్షిణగ రామ!
ఇంతకాలము నేను మహేంద్రగిరిని
తపము సలుపుదు పొందుచు విప్రులసుఖము."

రాము డెక్కిడుచు ధనుర్వరంబు పలికె
"జామదగ్న్య! భూమీసుర జాతి బుట్టి
కౌశికుని బాంధవుడవైన కతన నాకు
పూజ్యుడవు; నిన్ను చంపగ బూనలేను.

భార్గవా! వైష్ణవము దివ్య బాణమిద్ది
పర పురంజయంబును శత్రుభంజనంబు
నీదు పుణ్యగతియొ లేక పాదగతియొ
దీనికిని లక్ష్య మేర్పడ తెలుపు మిపుడె."

వైష్ణవ మహాధనుర్బాణపాణి రాము
విక్రమంబును వీక్షించి వికల మతిని
జామదగ్ని వచించెను జడత వీడి
"ఆదివిష్ణుడ వీవంచు ఆత్మ గంటి.

సురలు దివినుండి వేడ్కతో జూచుచుండ
ఆలమున ఓడితి నన సిగ్గేల నాకు?
ఎక్కుపెట్టిన బాణమ్ము నిపుడ విడుము
అవల నేను మహేంద్రాద్రి కరుగువాడ."

తడయ కుండ దశరథాగ్రతనయు డట్లె
అరిజన భయంకరుండైన పరశురాము
ఘనతపోలబ్ధ పుణ్యలోకాలు పడగ
విడిచె వైష్ణవ శరమును పుడమి వడక.

సకల జగదీశుడగు శంఖ చక్ర ధరుని
రామభద్రు గని పరశురాము డంత
నతులిడి చనె మహేంద్రపర్వతము పైకి
మునులు దివిజులు రాముని పొగడి రపుడు.

పరశురాముండు చనినంత పార్థివుండు
పతులతోడను స్నుషలతో సుతులతోడ
బాంధ వమాత్య గురు మిత్ర పటలితోడ
పరిజనులతోడ సాకేతపురము జేరె.

తన మఱంది యుధాజిత్తు తన్ను గోర
ఒండొరుల బాయనట్టి సహోదరులను
భరతశత్రుఘ్నులను బంపె ధరణిధవుడు
నందనుల కేకయాధీశు నగరమునకు.

తల్లిదండ్రుల యాజ్ఞ నౌదల ధరించి
సర్వకార్యాలు చక్కగ జరుపు కొనుచు
చెలగి రాముడు క్రీడించె సీత గూడి
సిరిచెలువతోడ విహరించు హరివిధాన.

శ్రీ మదిక్ష్వాకు వంశాబ్ధి సోము డగుచు
ప్రభవ మందిన సుగుణాభిరాముగాథ
బాలకాండము భక్తితో పలికినాడ
పాఠకులు శ్రోత లందంగ పరమసుఖము.

* * *

# అయోధ్యాకాండము

నిత్య సత్య ధర్మ వ్రత నిరతు డతడు
వేద వేదాంగ సంవేది వీరమూర్తి
భవ్య తేజస్వి ప్రతిభావిభాసురుండు
రామ భద్రుండు వైరి పురంజయుండు.

తరణి కుల వర్ధనుడు ప్రియ దర్శనుండు
భద్రమూర్తియై శ్రీరామభద్రు డలర
కరము శోభిల్లె కౌసల్య కనుల గాంచి
వెలది సీత శ్రీరాముని ప్రేమ నలరె.

శ్రేష్ఠ గుణుని తనూభవజ్యేష్ఠు నతని
ప్రజల కభిమాన పాత్రుడై పరగువాని
యౌవరాజ్యాభిషిక్తు జేయంగ దలచె
ధారుణీభారవహుడైన దశరథుండు.

తత్ప్రియత్నంబు నందున్న ధార్మికుండు
క్ష్మావిభులను సామంతుల సచివ వరుల
సకల దేశస్థులను పౌరజానపదుల
పిలిచి రప్పించి కొలువుండి పలికె నిటులు.

పావనేక్ష్వాకు వంశసంభవులు క్షితిని
పాలన మొనర్చిరి చిరము భవ్యరీతి
వృద్ధుడ విశీర్ణదేహుడ శ్రద్ధతోడ
జగము నిక మీద ఏలగ జాల నేను.



విద్యలకు నిధాన మవక్రవిక్రముండు
వినయ సంపన్ను డతడు వివేకశాలి
రాముని మదీయసుతు యువరాజు జేయ
సమ్మతింపగ మీరు, విశ్రాంతి గొనెద.

అఖిల లోకహితాసక్తు అత్యుదారు
రాము సద్గుణ మణిగణధాము నిపుడు
శ్రీకరంబుగ పట్టాభిషిక్తు జేసి
అభిమతార్థ సంసిద్ధి నే నంద దలతు.

కన్న బిడ్డల కైవడి గాచునట్టి
ప్రభుని ప్రజ్ఞను సభ్యులు ప్రస్తుతించి
వేవిధాల కృతజ్ఞత వెల్లడించి
రాము నొనరింప గోరిరి రాజుగాగ.

శ్రేయము దలంచి శ్రీరాము జ్యేష్ఠపుత్రు
వినుత రూపగుణౌదార్య విక్రమాఢ్యు
పట్ట భద్రు జేయు డనగ పంక్తిరథుడు
సభ్యవరుల పలుకులకు సంతసించె.

మునివశిష్ఠుని వామదేవుని కనుగొని
"శ్రీకరంబు చైత్రం బభిషిక్తుజేయు
మంచి కాలంబు మఱి మధుమాస మెంచ
పుష్ప భరిత వనాలతో పొలుపుమీరు.

జా గికేటికి కార్యాలు సలుపు డయ్య!
మంత్రి సత్తముడైన సుమంత్రు బిలిచి"
అని ముని ప్రోక్తవిధు లెల్ల నాచరించి
రాముని సభకు తోడ్కొని రాగ బనిచె.

వెంటనే ఆ సుమంత్రుడు వెంటరాగ
పరమ సుందర ఘనబాహు బలయుతుండు
రాముడు వెలుంగ జేసెను రమ్యరీతి
స్వీయ కాంతులతోడ ఆ శ్రేష్ఠ సభను.

అతి విశాల వక్షఃస్థల మలరువాడు
ధారుణీ ప్రజాపాలన తత్త్వవిదుడు
సకల కల్యాణ గుణరత్న సాగరుండు
తండ్రి పాదాల వ్రాలి వందనము లిడెను.

నరపతి దశరథుడు హర్షపరవశుండు
చిత్రమణి హేమ పీఠికాసీను జేసి
ప్రథిత కౌసల్య పుత్రుడౌ రాముతోడ
అమృత మధుర వాక్యాలతో అనియె నిట్లు.

“రామ! నిర్ణయించిరి యువరాజు జేయ
నిన్ను జనులెల్ల; సుముహూర్త మెన్న రేపె-
తార పుష్యమి; అందరి దనుపునట్టి
ఘనగుణమ్ములు జన్మతో గాంచి తీవు.

తండ్రిగా ఎనలేని వాత్సల్య మంది
ఇప్పు డుపదేశ మొనరింతు హితము వినుము
వ్యసనములు వీడి నయవినయములు దాల్చి
మిగుల విజితేంద్రియుండవై మెలగుమయ్య!

మంత్రి మండలితోడనే మంతనంబు
సంతతము సానురక్తితో సలుపు మయ్య!
భృత్యుల నమాత్యుల జనుల ప్రేమ గనుము
నిశ్చల ప్రజామోదము నెగడ మనుము.

కొట్టముల నిండ ధాన్యాలు కూర్పవలయు
కోశముల ధనములు గూర్పు కొరతలేక
ఆయుధాగారముల నింపు మాయుధాల
అలరు మెప్పుడు ఆత్మ సంయమముతోడ.”

రాణి కౌసల్య కీ వార్త రాముహితులు
తడవు లేకుండ తెలుపంగ గడగి రంత;
సభను చాలింప దశరథ చక్రవర్తి
రథముపై ధామమున కేగె రాఘవుండు.

రాజ సౌధమునకు దశరథుడు మరల
రామభద్రుని రావించి ప్రేమ మీర
"దుర్నిమిత్తంబు లెన్నియో తోచుచుండె
జరుపదలతు రాజ్యాభిషేచనము రేపె.

కాన రామకుమార! ఈ క్షణమునుండి
చెదరకుండగ నీదగు చిత్తవృత్తి
సీతతోడ పూను ముపవసించి వ్రతము
రేయి దర్భశయ్యను నిదురింపు డయ్య!

కలుగు విఘ్నమ్ము లిట్టి సుకర్మలందు
రామ! భరతు డయోధ్యకు రాకమున్నె
యౌవరాజ్యాభిషిక్తు జేయంగ నిన్ను
తగిన తరుణ మటంచు నే దలతు మదిని."

తత్క్షణ మతండు తల్లి యంతఃపురమ్ము
చేరి ఎరిగింపగా స్వాభిషేకవార్త
జనని శ్రీదేవి గొలుచు కౌసల్య వినియె
ముదము దళుకొత్త పులకలు మొలకలెత్త.

సీతతోడ సుమిత్రతో సిరులు చిందు
అనుజు డాతండు లక్ష్మణుం డచటనుండ
పలికె రాముండు "నా తోడ వసుధ నేలు
అస్మదీయ ద్వితీయాంత రాత్మ వీవు

తల్లులకు మ్రొక్కి ఆత్మ సౌధమున కరిగె
కూర్మి శ్రీరామచంద్రుడు కులగురుండు
శిష్ట చరితుండు మౌని వశిష్ఠు డంత
వేదవిధు లెల్ల దీర్చి దీవించి వెడలె.

ఆత్మలో వేదవేద్యుని హరి దలంచి
రాజసూనుండు సీతతో రాత్రి నెఱపె
పరమ నిష్ఠతో ఉపవాస భవ్యదీక్ష
వేగు జామున జపియించె విమలబుద్ధి.

ధ్వజ వితానము చిత్ర పతాక లలర
పూల తోరణమ్ములు సుగంధాలు చిమ్మ
రామ పట్టాభిషేక వార్తలు కథలుగ
చెప్ప కొనసాగి రెల్లెడ చేరి జనులు.

ఆలపింపంగ గాయకు లతులగతుల
నర్తకీ గణ మాడగ నవ్యరీతి
దీపవృక్షాళి దివ్యమౌ దీప్తు లీన
పురము సర్వము వెలుగొందె పూర్ణశోభ.

కాంచె భర్మ హర్మ్యమునుండి కైకదాసి
కళల దేలెడు సంపన్నగర మయోధ్య;
ఆమె ప్రశ్నించినంతనే అచటిధాత్రి
చెప్పె శ్రీరామ పట్టాభిషేక వార్త.

పదన మధ్యంబునకు నేగి నిదుర లేపి
పడతి కైకతో పలికె పాపాత్మురాలు
"కనుల జూడంగలేను నీ కష్ట మెపుడు
వృద్ధి నీ వంద భాగ్య సంసిద్ధి నాకు.

కామితార్థము లొసగుచు ప్రేమమీర
కాంత కౌసల్య నెప్పుడు కాంచుచుండు
ఉల్లసిల్లగజేసి నీవల్లభుండు;
వట్టి మాటల వంచించు వనిత! నిన్ను.

కానిచో జననాథుడు పూనుకొనునె
తరిమి నీ పుత్త్రి భరతుని తాతకడకు
పట్టమును గట్ట జానకీ పతికి రేపు
కన్న సుతుని నిన్నును నన్ను గాచుకొనుము.

తనకు రామాభిషేక వార్తా శ్రవణము
గూర్పగా మహామోదము కోర్కి తీర
ఒక్క దివ్యాభరణ మామె కొసగి కైక
పరమ హర్ష విస్మయములు వ్యక్తపరచె.

కుటిలచిత్త మంథర వాసి గుణవిహీన
కోపమున నగను విసరికొట్టి పలికె
"పొంగి పోవుచు నుంటివే మూర్ఖురాల!
భాగ్య హీనుడు నేటితో భరతసుతుడు.

రామమాత కౌసల్యకు రాణి! నీవు
పాదదాసిగా మారుట పచ్చి నిజము"
కొంప కూలినటు పలుకు కుబ్జగాంచి
సవతికొడుకును కైకేయి సన్నుతించె.

"ప్రేమధాము డిందీవరశ్యాము డైన
రాముడు భరతుకంటె గారాబు నాకు
ఘనతరంబగు భక్తిని గౌరవాన
తలచి కొలుచు నతడు నన్ను తల్లికంటె.

భ్రాతలను ప్రాణమున కంటె ప్రీతి జూచు
రామమూర్తి నిక్కముగ ధర్మజ్ఞు డరయ
అగ్రజన్ముండు రాజున కర్హు డతడు
పట్టభద్రత; కావల భరతు డందు."

అంత మంథర కినుకతో అనియె నిట్లు
"రాము డా వెన్క తన పుత్రు రాజు జేయు
పరిభవం బంది కౌసల్య పలువిధాల
గర్వివగు నిన్ను వీడునే గతము మరచి?

ప్రతిదినంబును నీవు పరాభవముల
పాలుగాకుండ సుతుని భూపతిని జేయు
రాముని సపత్నిపుత్రు దూరముగ నుంచ
వెరవు పరికించవలయు సత్వరము దేవి!"

అపుడు మంథర దుర్బోధ లాలకించి
క్రోధవిహ్వాలయై కైక కోరె వెరవు
రాము నట్టు లడవికి శీఘ్రముగ బంపి
పట్టుదలతో భరతు పట్టభద్రు జేయ.

"మున్ను సమరాన నీ పతి మూర్ఛనొంద
రథము సారథ్య మొనరించి రక్ష సేయ
నిత్యసత్యవ్రతుడు రేడు నీకు రెండు
వరము లొసగిన మాటను మరచినావె?

రాము నభిషిక్తు జేయుట రాజు మాని
భరతునకు పట్టమును గట్ట ప్రథమవరము
రాము పదునాలుగేడు లరణ్యములకు
పంపునటు కోరు రెండవ వరము కాగ.

కోమలీ! నాటి వరములు కోరు మిటులు
కోపగృహము జేరి అచట కుపిత వగుచు
పవ్వళింపుము నేలపై పంతమూని
తెగువ కోర్కులు నీవు సాధింపవలయు.

భరతు డేలంగ రాజ్యము బలిమి కలిమి
వరము వడయుము ధారుణీపాలు వలన;
శక్తియుక్తుల జూపగా సమయ మిదియె
నీదు మాటను జవదాట నేర డతడు."

"మాయ మర్మమ్ము లెరుగని మందమతిని
నే నెరుగనైతి భూపతి పూనినట్టి
కార్యగతులు; నా హితము జగాన గోరు
మంతు కెక్కిన సునిశిత మతివి నీవు.

కుందనపు బొమ్మవే మరుగుజ్జు వయ్యు
నీదు గూనులో మాయలు నీతు లెన్నొ?
రాము డేగి మా భరతుడు రాజుగాగ
కప్పుదును గూనుపైని బంగారు తొడుగు.

పట్టు పుట్టాలు గట్టి అప్సరస రీతి
సంచరింతు వేడ్కంగ నీ శత్రుగణము;
కోరి సౌభాగ్యవతి నీకు కుబ్జ లెల్ల
సేవ సేయుదు రనిశమ్ము స్నేహ మొప్ప."

అటులు కొనియాడి కృతనిశ్చయాత్మ యగుచు
క్రోధ భావ తీవ్రత జేరి కోపగృహము
చారు భూషణములు దీసి పారవైచి
కైక పడియుండె కళదప్పి కటికనేల.

రామ పట్టాభిషేకంబు రమ్యభంగి
జరుపుకొరకు నియోగించి సచివవరుల
కైక కా వార్త దెలిపెడు కాంక్ష గలిగి
అరిగె దశరథు డ య్యంతి అంతిపురికి.

భూతల స్వర్గ మచ్చట భూవిభుండు
కామపీడితుండు సతిని కైక గనక
తెలుపగా ప్రతీహారియు తెరవ నరయ
అతడు తిన్నగా కోపగృహాన కరిగె.

వ్యాకులేంద్రియు డగుచు భూపాలమౌళి
వట్టి నేల పరున్న ఆ వనిత గాంచి
అతిభయమ్మున నిమురుచు నామె మేను
కోపహేతువు వచియింప గోరె నంత.

మాటిమాటికి తను బతిమాలుచున్న
కామవిహ్వలుడైన భూకాంతు గాంచి
"తీర్చెద నటంచు నీవు ప్రతిజ్ఞ సేయ
అభిమతంబు నే దెలిపెద" ననియె మగువ.

కనగ నీ కంటె ప్రియురాలు కాంతలందు
లేదు నాకు; పురుషులందు లేదు ప్రియుడు
ప్రాణముల మించి హితుడైన రాముకంటె
చేతు నతనిపై శపథ మీప్సితము దీర్ప."

మిగుల నిపుణత మీరంగ మెలత పలికె
"పూర్వము సురాసుర రణాన మూర్ఛవోవ
ప్రాణములు నిల్పు కతన వరాలు రెండు
తివిరి యొసగితి విప్పుడు తీర్పు మవ్వి!

దాచితిని నీ కడనె నాడు ధర్మనిరత!
వలసి నప్పుడు కోరెదు బాసనంది
అధిప! దివిజులు శుచిముఖు లాలకింప
వరుస దెలిపెద నీ వీయవలయు సుమ్ము.

ప్రథమ వరమున ముద్దుల పట్టి భరతు
సురుచిరము లిపుడున్న వస్తువులతోడ
రామచంద్రుని అభిషేకలగ్న మందె
యౌవరాజ్యాభిషిక్తు జేయంగ వలయు.

రెండవ వరమ్ముగా రాము డుండవలయు
వరుసగా పదునాలుగు వత్సరాలు
దండకావనాంతరసీమ తపసివోలె
అజిన చీర జటాధారి యగుచు నచట."

నాతి కోరిన వరములు భీతి గొలుప
చింత నందుచు మూర్ఛిల్లి కొంత వడికి
తెలివి గాంచి కైకేయితో పలికె నృపుడు
స్వీయ దృక్కులు కోపాగ్ని శిఖలు చిమ్మ.

"ఓసి! రాక్షసి! రామవియోగ మిట్టె
తలచి నంతనె హృదయంబు తల్లడిల్లె
నీ నికృష్టాభిలాషను మాను మింక
ఇంతకంటెను దురదృష్ట మేమి కలదు?

ప్రణతు లిడుచు లోకంబున ప్రాణికోటి
పొగడుచుండ శ్రీరాముని సుగుణ గణము
అతని జడదారిగా జేసి అడవి కంప
ఏల కలిగె నీ కీ కోర్కి ఎరుగ నయితి.

రాఘవుడు నిన్ను గొలిచి కార్యాలు చేయు
నీవు చెప్ప ప్రకారము; కావు మీవు
ప్రార్థనలు విని న న్నధర్మంబు నుండి
మగువ! నీ పాదములకు నమస్కరింతు."

తోక త్రొక్కిన త్రాచుగా కైక లేచి
"ప్రథిత యశుడగు ప్రభుడవు ప్రతిన వీడి
రాజ్యమునకు జేతువె రాము రాజుగాగ
కోరి క్రీడలు కౌసల్యగూడి యాడ?

రాము బంపక ఈ వేగుజాము లోన
విపిన సీమకు, రాజు గావింతువేని
మహిప! నిశ్చయంబుగ నీ సమక్షమందె
విసము గొనియైన ప్రాణాలు విడుతు నేను."

పాపమతి కైక పలుకంగ పట్టు విడక
తనదు శపథమ్ము మతిచెడ తలచుకొనుచు
సారెసారెకు రాముని స్మరణ జేసి
నృపుడు శోకసంతప్తుడై నేల కొరగె.

కైకతో ననె దీనవాక్యాల నతడు
"చేటు కాలము వచ్చె నీ శీలము చెడె
గాము పట్టిన శశివోలె రాముమోము
చిన్న వోవంగ నేను వీక్షింప గలనె?

ఏమని వచింతు ప్రశ్నింప రాము గూర్చి
వివిధ దేశాగతుల మధ్య విభుల నడుమ
నిలుపు కొనుటెట్లు మాటను నిండు సభను
నవ్వి పోవరె నల్వురు నన్ను జూచి.

పరమహితు సుతు నటవికి బంపె ననగ
చెనటిగా నెంచి నన్ను దూషింప రాక్కొ?
వీడునే నిన్ను మాత్రము విశ్వమెల్ల
ప్రాప్త మయ్యె శోకంబు ప్రారబ్ధవశత.

చనగనాత డవశ్యము చత్తు నేను
రాముడు విశుద్ధచిత్తు డరణ్యమందు
కావులు ధరించి శయనింప కటికనేల
చేయగూడని ఏ యెగ్గు చేసె చెపుమ!

రామచంద్రుని కాదని రాజ్యమేల
భరతు డాతని నడవికి పంపెనేని
చావ సలిల కర్మలు నాకు సలుప దగడు
రామునే మించు రాజధర్మజ్ఞు డతడు.

ఎదురు చెప్పడు శ్రీరాము డెన్నడేని
ఉత్తమశ్లోకు డా పురుషోత్తముండు
కాను మొసగెద రాజ్యంబు నీ కోర్కి దీర్ప
అవల రాముని కిడుమ విఖ్యాతి గొనుము."

ప్రభువు సుతవిరహార్తితో పలుక నట్లు
భీతి లేక కైక దెలిపె పృథ్వి పతికి
సత్యసంధుడ నే నంచు నిత్య మీవు
పొంగిపోవుదు స్వయముగ పొగడుకొనుచు.

ధర్మవిదులెల్ల వచియించు దాని బట్టి
సత్యమును మించు ధర్మంబు జగతి లేదు
ఆడి తప్ప నీ రీతి మర్యాద కాదు
భూతలేంద్ర! విఖ్యాతి గోల్పోకు మయ్య!

నిశ గతింపగ నట్టులు నిపుణవచన
కైక వాదించె పతితోడ కఠినరీతి
పట్టభద్రుని జేయుచు భరతపుత్రు
విపినసీమకు రాముని వెడల నంప.

లలిత కదళికా కేతనా లంకృతమ్ము
చందనాగరు ధూప ప్రశస్త మగుచు
అమరపురిని బోలుచు నయోధ్యాపురంబు
వరలె వర్ణనాతీతోత్సవాలతోడ.

పావనం బగు నాటి ప్రభాతవేళ
ఇద్ధగుణుడు వసిష్ఠమునీంద్రు గూడి
వేద వేదాంగ పారీణ విప్రజనులు
సభను జేసిరి విధులెల్ల సలుప దలచి.

పొంగ మంగళ సమయ మాపన్న మయ్యె
క్ష్మాతలేశులు సచివులు జానపదులు
పుణ్యపురుషు లాచార్యులు భూమిసురులు
చేరి రచట రాము శుభాభిషేక మరయ.

సర్వ సన్నాహ కలిత మా సమయమందు
గురుడు "రాజును వేగిర పరుపు" డనుచు
ఆజ్ఞ నొసగ మంత్రి సుమంత్రు డంతిపురిని
ప్రభు నవస్థ యెరుంగక ప్రస్తుతించె.

"చాలు నయ్య సుమంత! నీ సంస్తవాలు"
అనుచు శోక తామ్రాక్షుడై అవనివిభుడు
మారు మాటాడ దయ్యె ఆ మంత్రి వరసి,
తెలిపె కైక యిటులు గడిదేరు నుడిని.

"పరమ రామాభిషేక శుభంబు దలచి
నిదుర పోవని విభు డిదే నిదుర గాంచు
రేడు సుతుని శ్రీరాముని చూడగోరె
పిలుచుకొని రమ్ము శ్రేయమ్ము కలుగు నీకు"

రాము దేరగ చనుచు ద్వారంబు చెంత
రమ్యకాంతుల మెరయుచు రంగమెల్ల
సిద్ధమైయుండ రామాభిషేకమునకు
మరల వెడలె రాజు కడకు మంత్రి వరుడు.

మంత్ర తంత్రజ్ఞుడైన సుమంత్రు డపుడు
"క్షితిపతి! సభకు వేగ విచ్చేయు" డనగ
అట్లుకు గానితేర దశరథుం డాజ్ఞ చేసె
రాజ్ఞితెలిపిన చందాన రామభద్రు.

రామసౌధంబు నయన పర్వముగ దరిసి
విమల తేజోమయుం డయి వెలయునట్టి
దశరథేశు కుమారుని కుశల మడిగి
మధుర భాషణంబులను సుమంత్రు డనియె.

"శ్రేయ మొనగూడు నీకు రాజీవనేత్ర!
దేవి కైకయు నీ తండ్రి భూవిభుండు
దశరథుండును నినుజూడ దలచినారు
రమ్ము రయమున నాతోడ రామచంద్ర".

అమిత తేజు డా మాటల నాలకించి
జానకిని బిల్చి "తండ్రియు జనని కైక
అభిలషించిరి ననుజూడ నగును మనకు
ప్రియ"మని వచించి మంత్రితో బయలుదేరె.

రాజవీథిని జనుచుండె రాఘవుండు
స్యందనమ్మున సౌమిత్రి చామరమ్ము
ఛత్రముంగొని సేవింప జనులు గనుచు
పలికి రిట్లు మధుర హిత భాషణములు.

ప్రజల భాగ్యంబు రాజుగా రాము డగుట
అతివ కౌసల్య తల్లి ధన్యాత్మ యయ్యె
అవనిసుత సీత పరమ పుణ్యాత్మురాలు
మనకు నిజముగ సర్వకామ్యములు వఱలు.

జనకుని గనంగ రాణి వాసమున కరిగి
రామచంద్రుండు పాదాల ప్రణతు డగుచు
తండ్రి కవల జననికి వందన మొనర్చ
అనుగుపుత్రుని గని తండ్రి వనట మునిగె.

తేజ మెంతయు సడలగ రాజు పిలిచె
సుతుని రామా యటంచును; చూడ డయ్యె
పలుకరింప డయ్యె మరల బాధతోడ;
వేడినిట్టూర్పు గాడ్పులు విడిచె నతడు.

అంత రామభద్రుడు వివర్ణాస్యుడైన
విభుని, జనకుని విహ్వాల వీక్షణములు
భీతి గొలుప నెన్నడు లేని రీతి కైక
గాంచి ప్రశ్నించె పరితాప కారణంబు.

స్వార్థ తత్పరయై సిగ్గు జంకు లేక
కైక "లేనికి కినుకయు కష్టమేని
లేవు; తన కోర్కి నెరిగింపలేక అటులు
నీళ్లు నమలుచు నున్నాడు నిక్కువముగ.

మేలుకీడులు వీడి నృపాలు వాజ్ఞ
పాలన మొనర్తు నే నని బాస సేయు
అతని పక్షంబు వహియించి అప్రియంబు
వినిచెదను నీకు శ్రీరామ! విన గదయ్య!

"చెప్పు మా మాట చెచ్చెర చేయువాడ
అగ్నిలో జొర, జలనిధినైన దూక
విషము నేనియు ద్రావంగ వెరవ నేను
శపథ మొనరింతు నా తండ్రి సంతసింప."

సత్యవచనుండు శ్రీరామచంద్రు డట్లు
ప్రతిన బూన నుబ్బుచు అనార్యయగు కైక
"దేవ దానవ రణవేళ తివిరి నాకు
రెండు వరములు నీ జనకుం డొసంగె.

రామ! కోరితి నేడా వరద్వయంబు
తండ్రి నిలుపుము నీవు సత్యప్రతిజ్ఞ
పట్టభద్రుని జేయంగ భరతు నిపుడె
సలుప దండ కారణ్యా వాసంబు నీవు.

వల్క లాజినములు దాల్చి వనములందు
తపసివై పదునాల్గు వత్సరము లీవు
మన వలయు" నంచు వచియింప మనుజవిభుడు
సుతవియోగార్తితో గాఢ శోక మందె.

"నృపతి నాకు గురుండును హితుడు జనని!
వల్కల జటా ధరుండనై వరము దీర్ప
కాన కేగెద కనుము సుఖంబు నీవు!
పరమధర్మము పితృవాక్య పాలనమ్ము.

తల్లి! ఏల నా జనకుండు తల్లడిల్ల
భరతు రాజ్యాభిషేక శుభంబు దెలుప?"
అనుచు వెలిపుచ్చె సంశయు మినకులుండు
దుఃఖవిహ్వ మేమాత్రము తోపదయ్యె.

చెప్పె నప్రియము కఠినచిత్త కైక
"అరిగెదరు దూత లిప్పుడే భరతుదేర
తండ్రి యాజ్ఞానుసారమ్ము తరలు మిపుడె
నలుప దండకారణ్య వాసమ్ము నీవు.

శ్రీ లలితుడు సత్యవ్రతశీలు డతడు
చేష్ట లుడిగిన తండ్రికి చేసి నతులు
ప్రణతి యొనరించి కైకకు పాపమతికి
మమత విడనాడి మాతృధామమున కరిగె.

రాము డటులేగ అంతఃపురంబునందు
రక్షకుని ఆతని దలంచి రమణు లెల్ల
ఘోర మొదవె నటంచును గొల్లు మనిరి
కుములుచు నృపుండు తల్పాన కూలబడియె.

జననియగు పట్టమహిషి కౌసల్యగాంచి
అనుగుసుతుడు రాముండు వందన మొనర్ప
చిన్నికొమరుని ఆమె ఆశీర్వదించె
ఆయురారోగ్యయశముల నందు మనుచు.

జననికా రఘురాముండు వినిచె తనదు
విపిన వాస వృత్తాంతము విప్రియంబు
"దేవి! యౌవరాజ్యమునకు భూవిభుండు
భరతు నభిషిక్తు గావించు పరగ నిపుడె.

దండకారణ్య సీమలో తపసి నగుచు
మూల ఫలములు దిని పదునాలుగేండ్లు
జీవనము సల్ప జనకుండు చేసె నాజ్ఞ
ఆనతి యొసంగి నీవు న న్నంపు మమ్మ!"

భయద దుఃఖవార్తను మందభాగ్యురాలు
తల్లి వినినంత వికలచేతస్క యగుచు
పుడమి బడ లేవగా దీసి యొడలు నిమిరె
సత్యావకుడైన శ్రీరామచంద్రమూర్తి.

మాత రాముతో పలికె లక్ష్మణుడు వినగ
"శోకకారకు డయితివి నాకు నీవు;
పుత్రుగా నాదు గర్భాన పుట్టకున్న
ఒక్క గొడ్రాలిగా దుఃఖ మొందియుందు.

అన్ని సంపదలున్న మహాత్ము డయ్యు
త్రోసి మాటాడు నాపతితోడ కాని
ఆడిపోసెదు సవతులతోడ కాని
స్వప్న మందైన ఎరుగను సౌఖ్య మెపుడు.

కుప్పగా ఆశ లన్నియు కూలిపోయె
రామ! నా బ్రదుకింక దుర్భరము సుమ్మి
కైక పోరు సహింప శక్యమ్ము గాదు
వనికి నీ వెంట నేనును వత్తునయ్య!"

రామమాతను కౌసల్య రాజ్ఞిగాంచి
ఆమె నోదార్ప లక్ష్మణుం డనియె నిట్లు
"'దోస మన్నది లేకుండ వీసమేని
త్రోయ రాఘవు నడవికి న్యాయ మగునె?"

పరమశత్రు వైనను రామభద్రు నెపుడు
దోషిగా నెంచి జగతిలో దూర లేదు
వృద్ధుడగు విభుడు విషయవిహ్వలుండు
తెలుప నొప్పెదు రాజనీతిజ్ఞు డెవడు?

పురిని భూపతి యానతి పొక్కకుండ
అన్న చేపట్ట యౌవరాజ్యంబు నిపుడె
ప్రక్కను ధనుర్ధరుండనై పరువు నిలుప
దండన మొనర్తు నే నిదే తండ్రి నైన.

సుత వియోగ విషాద సంక్షుభిత యగుచు
కోసలేంద్రనందన మది గుంది యేడ్చి
"తండ్రి! నన్ను పూజింపగా తగును నీకు
అనుజుమాటలు పాటింపు" మని వచించె.

రాము డనియెను సాధువర్తనము మెరయు
"దాటగా జాల నెన్నడు తండ్రి యాజ్ఞ
ప్రాజ్ఞు లనుమతించిన బాట పట్టినాడ
మాత! సత్యంబు పరమధర్మంబుగాదె?

లక్ష్మణా! నీ వఖిల శుభలక్షణుడవు
వీర విక్రమ సాహస ధీరమతివి;
నే నెరుంగుదు నాపైని నీదు ప్రేమ
తగును త్యజియింపగా క్షాత్ర ధర్మమిందు".

సహజ మృదులంబుగ అని దాశరథి యట్లు
"మారు చెప్పక శుభము చేకూరనాకు
దీవనలు సల్పు మో తల్లి! తీర్చి రాగ
వనమునందు చతుర్దశ వత్సరములు.

తమ్ముడా! గురువు ప్రభువు తండ్రి మనకు
కామమో క్రోధమో ప్రియమో మరేదొ
పావనుం డావిభుని వాక్యపాలనమ్మె
పరమకర్తవ్య; మింకేమి పలుక వలదు.

అనుగుతమ్ముడ! నామాట వినుము నీవు
మది తిరస్కారభావంబు మరచిపోయి
ఆగ్రహము వీడి చూపుము విగ్రహంబు
కార్యముల నెల్ల దీర్పుము ధైర్యమూని.

వత్స! నా అభిషేకోత్సవముల కొరకు
సహజముగ నీవు చూపు నుత్సాహమెల్ల
వనుల కేగెడు నాదగు పనుల పైని
చూపు మెంతయు నుచితంబు చూడ నీకు.

అసత్యదోషభీతిని తండ్రి అడలకుండు
సంతసించె, కైక వాత్సల్య మలర
కాన కేగెద నిప్పుడే కాన నేను
పరులు గారు కారణము దైవమ్మె గాని.

అతిపరాక్రమవంతుడ వైన నీవు
భూమి పతిన వ్వానరింప బూనవలదు
విధిని బలమి మంచు భావింపకయ్యు
మేలు వనవా మెంచ సుమి- శమాతి!

లోకనిందను గూర్చు ఆలోచనమ్ము
మగని వీడుట, నీ కది తగదు తల్లి!
కాన కేనేగ బుత్రశోకమున మ్రగ్గ
విభుని సద్భక్తి యుక్తి సేవించు కొనుము."

పుత్రు డట్లు సలుప ధర్మబోధనమ్ము
అశ్రు లొలుకంగ కనుదోయి అనియె జనని
"వనుల కేగుచు నుంటి వెవ్వారి కేని
రామ! కాలంబు దుర్నివారంబు గాదె?

సత్య ధర్మ దీక్షిత రామ! సతము నేను
పరమభక్తి పూజించు దైవత గణంబు
నీకు నిత్యంబు తోడును నీడ యగుచు
కరుణతో బ్రోచుచుండును గాత వనిని.

ప్రతిన దీర్చి అయోధ్యా పురమ్ము జేరి
రాజపీఠమ్ము పైన చిరము వసించి
మాత నగు నాకు సాధ్వికి సీత కేవు
వేడ్క లొదవింపగా రమ్ము వేగిరమ్ము.

జనని శుభ మంగళాశీర్వచనము లిడగ
మాతృదేవత పాదపద్మముల నంటి
రామచంద్రుండు పలుమారు ప్రణతి సల్పి
సీత నగరువ కేతెంచె శీఘ్రగతిని.

అచటి వార్త నెరుంగని అవనిజాత
విపులశోకతప్త నరసి వేగ లేచి
"నాథ! నీలోన దుఃఖ మెన్నడును నేను
కాన నైతి; ఇదేటికి కలిగె నిపుడు?

ఈ మహోత్సవ శుభవేళ ఏలనీదు
వదనము వివర్ణ మయ్యెనో హృదయనాథ!"
అనుచు భీతిల్లి వడకుచు అనినయంత
వ్యాకులాత్ముండు రాముండు పలికె నిట్లు.

సీత! కైక కిడ్డవరాలు క్షితివిభుండు
రెండు; ఒక్క వరము చేత దండకవని
బ్రతుకగా పదునాల్గు వర్షాలు నేను;
వరము వేరొంట రాజుగా భరతు జేయు.

వనికి జనియెద నిప్పుడే జనకునాజ్ఞ
నిత్యసత్యవ్రతవు ధర్మనిరత వీవు
అలుక నృపతికి మఱదికి కలుగకుండ
ఉచితమగు రీతి వసియింపు మిచట దేవి!

దైవతంబుల గొలుచుచు ధర్మవిధిని
ప్రతిదినంబు నా తండ్రికి ప్రణతి సలిపి
మూడు మాతల నెల్ల సమానరీతి
భక్తి పూజించు చుండుమా భద్రచరిత!

జనకతనయ ఆత్మవిభుని గని వచించెగ:
"పూరుషోత్తమ! రాజకుమారు నోట
వింతగ లఘూక్తి నే డిట్లు వినగ వచ్చె
పరిహసింపరె దీనిని పరులు విన్న.

చెప్పియున్నారు పితరులు చిన్నవాడె
భర్తృ సేవా నిరంతర భవ్య విధులు;
పతి యొకండె సద్గతి యౌను పతికి సతము
అరయ నిహపరములలోన ఆర్యపుత్ర!

ప్రాణనాయక! నీవెంట వచ్చుదాన
నేను విపినాలలో వ్రతనిరత నగుచు
భార మే మాత్రమును గాక భయమువీడి
ప్రీతి నిత్యమ్ము నిన్ను సేవించు చుందు."

"ఘోర దుర్గమ విపిన సంచారమందు
కాలి బాటల నడ్డును కంటకాలు;
విహగ మృగ వృశ్చికాదులు వెతలఁగూర్చు
సుక మొకింతయు నుండదు సకియ! నీకు

వనిత! నీకు వలదు వనవాస వాంఛ
చెప్పుచున్నాడ తావకశ్రేయ మెంచి
క్రోధలోభమ్ములను వీడి బాధపడక
తపము సలుపంగ నీకు సాధ్యంబుగాదు."

అపుడు కన్నీటితో సీత అనియె నిట్లు
"నాదు యౌవనంబున కొన్ని నాళ్లు వనిని
వాస మొనరింతు నంచు దైవజ్ఞు లెపుడొ
చెప్పగా వింటి; నయ్యది తప్ప దెపుడు.

నీడవలె వీడకుండగ కీడు గోడు
కలుగునే నీ సతికి నాకు కానలందు?
నిన్ను విడిచి నే మనజాల నిమిషమైన
పయన మగుదము నిర్భీతి ప్రాణనాథ!"

రామచంద్రుండు వచియించె రమణి గాంచి
"శాస్త్ర సమ్మతమైన నిశ్చయము నీది
మన కులంబులు రెండును మహితకీర్తి
నీ వలన పొందు నిక్కమ్ము నిఖిలజగతి.

సంశయించితి నాదిలో శక్తి గలిగి
నేరకుండుట నీదు మనోరథమ్ము;
స్వర్గ సుఖమేని కాంక్షింప సాధ్వి నీవు
సరస లేకుండ నెన్నడు జనకతనయ!

ధన కనక వస్త్ర వస్తు వాహనచయమ్ము
దాన మొనరింపు మిప్పుడే తనివిదీర
ఎవ్వరేది అర్థించిన ఇచ్చివేసి
వనికి నాతోడ నిప్పుడే పయన మగుము.

అఖిలవస్తువు లా రీతి అవనిజాత
సీత ప్రీతితో దానమ్ము చేయదొడగె;
అపుడు దైన్యమ్ము దుఃఖమ్ము నాపలేక
అగ్రజునితోడ సౌమిత్రి అనియె నిట్లు.

"పక్షి మృగ యూథముల మహాభయము గొలుపు
ఘోరకాంతారముల కేగ మీర లిపుడు
చనెద మీముందు నిర్భీతి ధనువు దాల్చి
అన్న! నిను వీడి స్వర్లోకమైన గోర!"

వారి వెనువెంట వనులకు వత్తు ననగ
వల దనుచు అన్న వారింప పట్టు విడక
లక్ష్మణుండు మహాగుణ లక్షితుండు
రామభద్రునితోడ మరల వచించె.

"రామ! భవదీయ విక్రమక్రమము నెరుగు
భరతుడు జనములను గాచు భక్తితోడ
మాత కౌసల్య పరమవిఖ్యాతచరిత
అనుజను సుమిత్ర నన్యల నాదరించు.

కనుక నిన్ను సేవింప గైకొనుము నన్ను
వనుల ననిశము దీర్తు నీ పనుల నెల్ల
అంత శ్రీరామచంద్రుండు సంతసించి
అనుగుల అనుమతి గొని ర"మ్మనుచు దెలిపె.

అంతియే కాక శ్రీరాము డాజ్ఞచేసె
తాను పూజల నొనరించి దాచినట్టి
ఆయుధములు వసిష్ఠగృహమ్మునుండి
తీసికొని అచిరంబున తిరిగిరాగ.

తమ్ము డనుగుల సెలవంది తగినరీతి
ఆయుధమ్ములతో నట కరుగుదేర
"దాన ధర్మాలు చేయుంగ తలచినాడ
నిర్వహింపు మీ కార్యము నీవు వత్స!

వేగ గొనిరమ్ము వాసిష్ఠ నాగమజ్ఞు
భూమిసురులకు నతనికి పూజచేసి
అభిమతార్థమ్ముల నొసంగి ఆశ్రితులకు
విపినసీమల కేగెద విమలమతిని."

శ్రీమహితుడు రాఘవుడు వాంఛింప నట్లు
వేగ లక్ష్మణుండు వినయవినమితుండు
ఆ సుయజ్ఞుని గొనివచ్చె నమితభక్తి
గురుసుతుని మ్రొక్కె రాముండు కూడిసతిని.

స్వర్ణ మణిమయామూల్య భూషణము లొసగి
సత్కరించెను శ్రీరామచంద్రుం డతని;
ఇట్లె 'నీ సతీమణి కోస' మిందు మనుచు
అవనిపుత్రిక కనక సూత్రాదు లిచ్చె.

దంతులను గూడ వేయింటి దాన మిడగ
పరమ ధర్మాత్ముడగు రామభద్రు డపుడు
కురిపె మేలి యాశీస్సులు గురుసుతుండు
పయనమయ్యేదు వారికి ప్రమద మంది.

లక్ష్మణుండును ధర్మ ఫలంబు లంద
రాము డాతని చేత హర్షంబు మెరయ
భూరిదానాలు చేయించె భూసురులకు
భృత్యులకు బీదజనులకు భిక్షుతతికి.

ధన కనక ధేను వస్తు వాహనము లిచ్చు
మహిత ధర్మాత్ముడైన రామప్రభుండు
జానకీసమేతముగాగ జనకు జూడ
వేగ మేగెను సౌమిత్రి వెంటరాగ.

పాదచారియై ఆ రామభద్రుడంత
అవనిజాతయు లక్ష్మణుం డనుసరింప
రాజపథమున చనుచుండ ప్రజలు చేరి
చెప్పి కొనిరిట్లు సంతప్తచిత్తు లగుచు.

"కోపమును హింస ఎరుగడే కోశమందు
దయయు శీలంబు గలిగిన ధర్మమూర్తి
భవ్యు డారాము డేగెడు బాటలోన
లక్ష్మణుని వోలె పోద మెల్లరము మనము.

ధర్మ వీరుండు దశరథ తనయు డితడు
తండ్రి యానతి సత్యంబు తప్ప డయ్యె
గగన సంచారులకు గూడ కంటబడని
జనకజాత నడచునదె జనులు చూడ.

ప్రజల ప్రజలుగా జూచెడు ప్రథితగుణుని
తనుజు కానల కిటు పంపు దశరథుండు;
నిజకుమారు డెంతటి దుర్వినీతుడేని
సాగనంపగ నే తండ్రి సాహసించు?

ప్రజలు వనికేగ సకల సంపదలు వీడి
చూడగా పాడువడి జనశూన్యమైన
ఈ అయోధ్యను కైకమ్మ యేలుగాక!
వనము భవన మ్మగుత రామభద్రు డుండ.

ప్రజల వాక్కులను వినియు రాఘవుండు
ఇంచుకంత చలింపక ఎడదలోన
జనకు ప్రాసాదమున ప్రవేశం బొనర్ప
మూర్ఛ మునిగెను దశరథ భూవిభుండు.

రాజు రావింప ముందె దేవీజనంబు
చేరి రచ్చట రాము వీక్షించి నంత
రాణి వాసపు చెలు లేడ్వ రాజగృహము
తీవ్ర దుఃఖారవముల ప్రతిధ్వనించె.

భూమినాథుండు ఘనదుఃఖ మూర్ఛనుండి
తేరుకొనగ శ్రీరాముండె కోరె నతని
జనకసుతకు, తనకు, లక్ష్మణునకు గూడ
అడవి కేగ చింతను వీడి ఆజ్ఞ నొసగ.

తండ్రి దుర్భర శోక సంతప్తు డగుచు
త న్నయోధ్య పాలింపుచు తనరు మనగ
జనకునకు పల్కె రాముండు వినయ మొనయ
"తండ్రి!. దండక కేగెద తావకాజ్ఞ.

భరతునకు ధన ధాన్య సంభరిత మగుచు
సిరుల వరలెడు జనగణసేవితంబు
ధరణిరాజ్య మిడుట నాకు పరమహితము
కాంక్ష లే దాత్మసుఖమందు కన్నతండ్రి!"

దాని నద్భుతంబుగ నెంచి దశరథుండు
"వెడల నిశ్చయించితి వీవు విజనవనికి
తనయ! నాకిది మది సమ్మతంబు గాదు
నీకె చెల్లెను తీర్పంగ నైక కోర్కె."

బాష్పధారలతో నట్లు పలికి నృపుడు
పుత్రు నాలింగన మొనర్చి మూర్ఛ మునిగె;
కాంత లెల్లరు నేడ్చిరి నైక దప్ప
మ్రానుపడియెను మంత్రి సుమంత్రు డేడ్చె.

తెలివి నంది సుమంత్రుడు పలుక దొడగె
"కీర్తిమంతుని దశరథ క్షితితలేశు
మోస మొనరించితివి కైక! మోహపెట్టి
ప్రజల బ్రోవు మిపుడు దుష్టపథము వదలి.

రామచంద్రుని జేయుము రాజు కాగ
లేనిచో నింద నీ నెత్తి పైని బడును;
అనఘు డతడు విపినసీమ కరిగెనేని
ఒక్క జీవియు నుండ డయోధ్యలోన."

కరగ దాయెను శిలవోలె కైక గుండె
అపుడు సచివసత్తమునితో నృపతి పలికె
"వనికి రాముతో సిరులను జనుల బంపు
నగరశోభ చెలంగ కాననము లోన.

తనదు కోరిక వమ్మగునని తలంచి
పలికె విహ్వాలమతి కైక పతిని గాంచి
"సంపదలు లేని సిరిలేని జనులు లేని
పురిని పాలింప భరతుండు పూనుకొనునె?"

అచటి వార లొక్కుమ్మడి ఆగ్రహించి
సిగ్గువీడిన కైకను ఛీత్కరింప
సచివవరుడు సిద్ధార్థుడు జంకులేక
తెలిపె లోకనిందను పొందవల దటంచు.

అట్టి స్వాంతన పరుష వాక్యాల కేని
దుష్టురాలు వదల దయ్యె దుష్పథంబు;
అంతట భరతునకు రాజ్య మప్పగించి
కానలకు వత్తు ననె రాజు తాను కూడ."

రాముడు ప్రకట సుగుణాభిరాము డనియె
"లతల తరుల వాహినుల శైలముల గనుచు
లలితములు వివిధ ఫలమూలములు తినుచు
వనుల బ్రదికెడు నాకేల వైభవాలు?"

నారచీరలు గొని తెచ్చి నారి కైక
కట్టుకొమ్మనె రాముని కరుణవీడి
ఆత డట్టులు చేయంగ అన్నవోలె
లలితవసనాలు త్యజియించె లక్ష్మణుండు.

నిర్మలచరిత్ర పావని ధర్మశీల
సీత వల్కలముల గాంచి భీతిలంగ
తన్వికిని దాల్పగా జేసె తనకు బోలె
రామచంద్రుండు ధర్మగౌరవమువలన.

పూతచరితుడు రాముడు సీత కటులు
పుట్టమున వల్కలమ్ములు పొందు పఱచ
కాంచి మదిలోన కలగుచు కైక నరసి
కినుక ధర్మిష్ఠుడు వసిష్ఠు డనియె నిట్లు.

"నారలం గట్టి వనికేగ కోరి నావె
దారుణంబుగ సీతను ధాత్రిసుతను?
ఆమె గైకొని భర్తృసింహాసనంబు
ధరణిరాజ్యము నేలు నందరును మెచ్చ.

రామ విభునాత్మ సీతాంగనామతల్లి
కాన కేగిన ఏగెద నేనుకూడ
వనికి రాముని వెంటనే భరతు డరుగు
నిన్ను జనయిత్రిగాగ గణింప డతడు.

కనుక రాముని సేవింప వనములోన
ప్రియసుతున కొనగూడదు నప్రియము తుదకు
కైక! తగునె జానకికి వల్కలము లీయ
ఆభరణ దివ్య వసనాల నామె కిమ్ము."

కైక గాంచి దశరథు డైక్ష్వాకు డపుడు
పట్టరాని కోపంబుతో పలికె నిటులు
"జనకనృపవరేణ్యుని ఆత్మజయగు సీత
ఎగ్గు లేమేని చేసెనే ఎవరికేని?

దుష్టచారిణి! చేసితె ద్రోహచింత
అనఘశీల సాధ్వి మహీజ నడవి కనుప?
వల్కలమ్ములు వైదేహి వదలివేసి
సకల సంపత్సమృద్ధయై చనెడుగాత!

చెడ్డకాలము చేరువై చేసితీవు
ఇటు లకార్యము కైకేయి! కుటిలబుద్ధి
కనగ వచ్చినే రాముని కానకేగ
చెప్పితివె కాని ఎత్తితే సీతపేరు?"

అంత వచియించె శ్రీరాము డంజలించి
తలను వంచి శోకించెడు తండ్రిగాంచి
"ధర్మచరిత! నా ముదుసలి తల్లి మునిగె
ఏకపుత్రుని విడలేక శోకజలధి."

ఒక్కమారు రామా యని ఉచ్చరించి
మరల మాటాడ లేడయ్యె నరవిభుండు;
తెలివి గని జవనాశ్వాల తేరు తేగ
ఆ సుమంత్ర ప్రధానికి ఆజ్ఞ నొసగె.

అటులె సూతుండు గొనివచ్చె అధిపునాజ్ఞ
జవనహయముల బూన్చిన స్వర్ణరథము
అతడు జనపదసీమల కవల దాక
సాధుశీలుని రాముని సాగనంప.

భూపు నానతి వివిధ విభూషణములు
మృదులవస్త్రాలు వర్షాలు పదియునాల్గు
సీత ధరియించు కొనుటకై ప్రీతిదెచ్చె
సర్వకోశాధికారి తా సత్వరముగ.

వనికి జనగ పయనమైన జనకతనయ
భూషణములు దివ్యాంబరములు ధరించె
కాంతు లీనగ; అంతట కౌగిలించి
అత్త కౌసల్య చేసె ధర్మార్థ బోధ.

"అమితమగు ప్రేమ ఎన్ని సౌఖ్యాల నేని
పతు లొసంగ గ్రహించియు వసుధలోన
సీత! కష్టకాలంబున సిరులు తొలగ
మగల నావల ద్రోతురు మగువ లెపుడు.

కుటిలశీల లెంతయు వారు కుల ముపకృతి
ధనము విద్య గౌరవమును దలప బోరు;
చూడ సాధ్వుల కన్ని వస్తువుల కంటె
పరమ గతి ఈ జగతి నొక్క పతియె సుమ్మి!

కాన కాంతార మందుండు కాంతు నెపుడు
చులకనగ నెంత మాత్రము చూడవలదు;
పెద్ద ధనవంతు డైనను పేదయైన
మగడె ప్రత్యక్షదైవత మగుత నీకు."

పలికె మైథిలి యిట్టు లంజలి ఘటించి
"సుతులు తలిదండ్రు లొసగని సుఖము లిచ్చు
పతిని సేవింపలేని అసతిగ నన్ను
తలపకుము; నేను తప్పను ధర్మ పథము."

సత్యశీల కౌసల్య హర్షమ్ము నందె;
జనములను రామచంద్రుండు వినయ మెనయ
వీడుకొలుపంగ నంతట వేడుకొనగ
ధామ మెల్లను శోకసంతప్త మయ్యె."

విహ్వలాత్మలు రాణులు వీడుకొలుప
రామలక్ష్మణు లిరువురు రమణి సీత
దశరథనృపాలు సెలవొంద తనయు గాంచి
ఇట్టులు వచియించె సుమిత్ర హితముగోరి.

"రాము డనఘుడు నీకు శరణ్యు డెపుడు
విపినమున తండ్రి వోలె సేవింపు మతని
సీత గొల్వుము పుత్ర! నీ మాత గాగ
దండక వని నయోధ్యగ తలపు మయ్య!"

సారథి సుమంత్రుడు తెలుప తేరు జేరి
శ్రీయుతులు రామలక్ష్మణుల్ సీతతోడ
ఆయుధాలతో దానిపై నధివసింప
కదలెను రథమ్ము మ్రాన్పడ కనెడు సేన.

అయ్యె దుఃఖపీడిత మయోధ్యాపురంబు
ప్రభుని మోమును గాంచంగ భక్తితోడ
స్యందనము వెన్క నేగుచు సకలజనులు
పలికి రీ రీతి నశ్రువు లొలుకుచుండ.

"మేము మరల చూచు టెపుడొ రాము మోము
నీడవలె నిజవిభుని వెన్నాడి చనుచు
స్వీయధర్మము వీడని సీత ధన్య
అగ్రజుని గొల్చు సౌమిత్రి అమలయశుడు."

రామచంద్రునితోడ ఘోరవని కేగ
పరమసిద్ధి శ్రేయంబు దైవారు ననుచు
వెంట నాబాల గోపాల మంటినంత
దశరథవిభు డయ్యెను రహిత స్పృహుండు.

ఆర్తనాదాలు మినుముట్ట నంతిపురిని
సత్త్వహీనుండునైన దశరథనృపుడు
సుతుని జేర బయలుదేరె సతుల గూడి;
సంచలితు డయ్యె శ్రీరామచంద్రు డంత.

తల్లిదండ్రుల స్థితి గాంచి తల్లడిల్లి
రథము తోలజేయుగ వేగ రామవిభుడు
అనుసరింపగ దగ దంచు నవనిపాలు
సమ్మతింపగ జేసిరి సచివు లెల్ల.

రామజనకుండు శోకనిర్మగ్ను డయ్యె;
రామభద్ర వియోగ వారాశి మునిగి
అఖిలజనములు దుఃఖోపహతులు కాగ
ఆకులిత మయ్యె నా అయోధ్యాపురంబు.

దశరథేంద్రుడు రాము నుదారచరితు
అనఘు కనుపట్టు మేరకు నట్టెచూచి
నిస్పృహుం డయి ఏడ్చుచు నేలబడగ
ప్రాణవిభు లేవనెత్తెను రామజనని.

భరతమాత కైక విభుని పట్టబోవ
వ్యథితహృదయుం డగుచు నృపుం డనియె నిట్లు
"తాకకుము నన్ను ధర్మబంధమ్ము నేను
వీడినాడను నీ తోడ నేడు చెనటి!"

భరతు డెలమి రాజ్యమ్ము చేపట్టునేని
తర్పణమ్ములు పితృదేవతలకు నాకు
దక్కకుండును గా"కంచు తాను బలికి
శాంతికి విభుండు చేరె కౌసల్య గృహము.

దీనుడై దుఃఖవశత నిస్తేజు డైన
దశరథుని గాంచి కౌసల్య తల్పమందు
పలికె నిట్టులు "నట్టింటి పాము పగిది
తివిరి కైక నన్నింక బాధింపకున్నె?"

సిగ్గు మాలిన కైకేయి చెప్పినంత
ధర్మరతు పుత్రు నడవికి తరిమినావు
భోగ భాగ్యాలు ప్రాయాన పొందకుండ;
బ్రదుక నేర్తునే క్షణమేని రాముబాసి?"

ఊరటం గూర్ప వచియించె చారుశీల
సతి సుమిత్ర కౌసల్యకు సాంత్వనోక్తి
"పరమపురుషు రాఘవు గన్న భాగ్యవతివి
పొంద దగునె దుఃఖము పుత్రమోహవశత."

పదమల చరిత్ర! నానాస్త్ర శస్త్ర ధరుడు
కొలుచు చుండగ సౌమిత్రి నిలిచి ముందు
ప్రతిన దీర్చి రాముడు వచ్చు సతిని గూడి
శీఘ్రమే నీదు చరణాబ్జ సేవ సలుప."

ప్రేమధాముని శ్రీరాము వెంబడించు
ధరణిపతి పరివారము మరలి చనగ
జనులు వెనుకంజ వేయక సాగుచుండ
కనికరంబున రఘురాము డనియె నిట్లు.

జ్ఞానవృద్ధుడు భరతుండు సాధుగుణుడు
ప్రభుడు నిలిపె నాతని యువరాజుగాగ;
మిమ్ము పాలించు చల్లగా మేటి బలుడు
మీరలు భరతు ప్రేమ దైవార గనుడు."

వెంట వెడలుచు వినిచిరి వేదవిదులు
"ఆతపత్రాలు వాజపేయాలు సలుప
మాకు లభియించె; వీనిని నీకు బట్ట
ఎండ తగులదు విపినమం దేగువేళ.."

ప్రకృతిరమణీయ మగు రఘురామమూర్తి
చేరి తమసాతరంగిణీ తీరసీమ
దిటవు గలిగింప జానకీదేవి గాంచి
భ్రాతయైన సౌమిత్రితో పలికె నిటులు.

"ఇది అరణ్యావాసంబున మొదటి రజని
కాన మోపితి మిప్పుడే కాలు మనము;
వదలుము గృహాదిచింతల మదిని నీవు
తమ్ముడ! తనర్చు గాత భద్రంబు నీకు.

కలుగు దుఃఖమ్ము మా తల్లి దలచుకొనిన
భరతు శిరమున పితృమాతృభరము నిలిపి
చింతవీడంగ నేను; వచ్చితివి నీవు
అవనిజాత రక్షింప; మేలగుత నీకు.

ప్రేమధాముండు రాముండు విడిసె నచట
తనను వెంబడించిన పౌరజనుల గూడి;
నిశను--సడిలేని సమయాన నిదురలేచి
అనుగుదమ్మునితో నాత డనియె నిటులు.

"లక్ష్మణా చూడు! ఇండ్ల నిల్లాండ్ర నెల్ల
వీడి అనురక్తితో మన వెంటవచ్చి
పౌరు లెట్లు నిద్రించుచున్నారొ కనుము
చెట్ల క్రింద; వారి నటులు చేయదగదు.

వీరి దీక్షను వీరల ప్రేమ నరయ
వెనుదిరుగ రంచు నేను భావింతు నిపుడు
కనుక నీ జనులెల్ల మేల్కొనక మునుపె
మెల్లగా సాగి పోవుట మేలు మనకు."

సదమలచరిత్రు డా రామచంద్రమూర్తి
కాంత వైదేహితోడ లక్ష్మణునితోడ
రథముపై నది కవలి తీరంబు జేరి
తాపసాశ్రమ శ్రేణుల దారి జనియె.

నిశ గతింపగ పౌరులు నిదురలేచి
రామచంద్రుండు కానంగ రామి నచట
తల్లడిల్లుచు నవశులై తమ్ముతామె
నిదుర జెందుట కెంతొ నిందించుకొనిరి.

దుఃఖ విహ్వలాత్ములు దిక్కుతోచనట్టి
పౌరజనులు నిరాశతో చేరి కనగ
రామరహిత మా సాకేత రాజధాని
ప్రాభవము దక్కి మిక్కిలి పాడుపడియె.

వనుల కభిముఖముగ రామభద్రు రథము
సాగుచుండ తోచె నుదయసంధ్య; అంత
గ్రామ సంవాసి జనములు రాముగూర్చి
అనుకొనెడు మాట లిట్టులు వినగ వచ్చె.

"ధర్మపరు రాము నంపెను దశరథుండు
కానలకు వృద్ధు డయ్యును కామవశత;
క్రూర ఘోరకృత్యాలకు పేరు గన్న
కైక మూలాన నింత యాగడము వచ్చె.

తరుణి నిత్యసుఖోచిత ధరణిజాత
సీత ఆ దుర్గమారణ్య సీమలందు
సంచరింప నిర్భయముగ శక్య మగునె?
జనుల గావించె కైక కష్టాల పాలు."

ఆడిపోసెడు జనుల వాక్యాలు వినుచు
భూరితేజోనిధి పురుషపుంగవుండు
తనదు కోసలసీమ సత్వరము దాటి
విశ్రుతంబగు వేణి వేదశ్రుతి గనె.

గోయుతము గోమతీనది గూడ జూడ
స్యందకా స్రవంతిని దాటె స్యందనమ్ము;
రఘుకులోత్తంసుడైన శ్రీరాము డపుడు
తెలిపె సీత కది విశాలదేశ మనుచు.

రామమూర్తి కోసలదేశసీమ దాటి
రాజధాని కయోధ్యకు ప్రాంజలించి
పల్లె పయనమ్ము నచ్చటి జానపదులు
కానగా సంభ్రమాశ్చర్య కలితు లగుచు.

అడవి జనియెడు రాముని కంతలోన
కానవచ్చెను తల్లి గంగాభవాని;
స్వాదుసమ్మోహనాదము స్వాంతమందు
హ్లాదమును నింపె; చేసె నూహల జరింప.

చారు గుల్మోప శోభిత తీర మగుచు
దివ్యమై మాన్య మునిజన సేవ్యమైన
స్వాదు నిర్మల సలిల ప్రశస్త మైన
జాహ్నవీ పుణ్యవాహిని జాలువారు.

కలుషము లడంచి తొలగించి క్షామభయము
ఎన్నొ లీలాగతుల ప్రవహించు చుండు
సుకృతభాసిని నా రఘుసూతి గాంచె
శృంగిబేరపురము జేరి గంగనంత.

జాహ్నవీనది సన్నుతసత్ప్రభావ
పొంగి పొరలుచు నుండగ ముదము నంది
ఇంగుదీ వృక్ష మూలమం దిచ్చ విడిసె
భ్రాతృభార్యాసమేతుడై రామమూర్తి.

అంతట నిషాదవిభుడు మహాబలుండు
జానకీరమణుని ఆత్మసఖుడు గుహుడు
రామభద్రునాగమన వార్త విని వచ్చె
సచివ సామంతులను వృద్ధజనుల గూడి.

రాము గని బహుమాన పురస్సరముగ
గుహుడు దుఃఖార్తితో నిట్లు కోరి పలికె
"రామ! నాకు ప్రియాతిథి వేమి యాజ్ఞ
పుడమి నిది నా పురాకృత పుణ్యఫలము.

అర్ఘ్యపాద్యాలు భక్ష్య భోజ్యమ్ము లివియె
ఇవియె శయ్యాసనంబులు; ఎల్లయపుడు
అస్మదీయ రాజ్యంబు నీ యదియ సుమ్మి
రామ! మమ్మేలు కొనుమయ్య! ప్రభుడ వగుచు."

చెలిమి మీరంగ కౌగిట జేర్చిపట్టి
భక్తగుహునకు శ్రీరామభద్రు డనియె
"పాదచారివై వచ్చి మ మ్మాదరింప
సఖుడ! సత్కరించుటకాదె సకలవిధుల.

బంధు మిత్ర సంయుతు నిన్ను భాగ్యవశత
గంటి సకల జనాళికి సౌఖ్యమె గద!
నారచీరలు గట్టి కానలకు నేగు
నేను గ్రహియింప నేదియు, నీవ గొనుమ.

మిత్రమా! తురంగములకు మేపుగూర్పు
అదియె పదివేలు; పూజించినట్లె నన్ను;
నాదు జనకుండు దశరథనాథు డెపుడు
అమితమగు ప్రీతి జూచు నీ అశ్వరాజి.

ఆ నిషాదవిభుండు హయాళి దనిపి
శరశరాసన ధారియై అరయుచుండ
రామచంద్రుండు పవళింప రమణితోడ
ఘనుడు సౌమిత్రి మేల్కని కాచుచుండె.

అపుడు గుహుడు లక్ష్మణునితో అనియె నిట్లు
"నాయనా! దారయుతు రాము రేయి నిచట
కాచెదము మేము; ఆతని కంటె నెవడు
అవనిలో లేడు నాకు ప్రేమాస్పదుండు.

అదియె సుఖశయ్య పవళింపు" మనుచు బలుక
లక్ష్మణుడు "దాశరథియె నేల శయనింప
కలదె నా కిక నిద్రాసుఖం" బటంచు
కబురులాడుచు గుహునితో గడపె రేయి.

రాత్రి గడచి ప్రొద్దుపొడువ రామవిభుడు
కోరె భాగీరథిని దాట; గుహుడు నిలిపి
రాజయోగ్యమౌ నావను, ప్రాంజలించి
ప్రభుని ప్రార్థించె నవలికార్యంబు దెలుప.

"కడు కృతార్థుడ" నంచు రాముడు వచించి
సారథిని గాంచి జాహ్నవీ తీరమందు
"పాదచారినై వెడలెద వనుల కింక
ఓ సుమంత! నీవు చను మయోధ్య కిపుడు."

అనఘుడు సుమంత్రు డంతట ఆర్తి చెంది
విన్నవించె రాముని గని వినయ మొప్ప
"గడపి సీతతో భ్రాతతో అడవిలోన"
ఘన విజయమంది కీర్తిని గాంతు వీవు.

వృద్ధ సారథి సూతుండు శుద్ధు డతడు
దుఃఖపరత బల్కుచు నేడ్వదొడగి నంత
గారవించి మాటల నర్థగతిని, తెలిపె
మంత్రితో రామభద్రుండు మధురఫణితి.

"మత్కుల హితంబు వాంఛించు మంత్రి వీవు
సుగుణఖనిని సుశ్లోకుని క్షోణిపతిని
వగపు మానిపి సతము కాపాడు మయ్య!
కరము భక్తి పాలింపుము కైకయాజ్ఞ.

సీతకును, తమ్మునకు, నాకు క్షేమ మనుచు
మా జననులకు -- కైకకు మనవిచేసి
మరచిపోవంగ చింతలు భరతు బిలిచి
క్షితిపతిగ జేయ విభునకు చెప్పు మయ్య!

"తండ్రిని భజించు కైవడి తప్పకుండ
ఎల్ల వారల సేవింప జెల్లునంచు
జనకు కోర్కిదీర్ప యువరాజ్య పదమంద
భరతునకు తెలుపుమీ నాదు పలుకుగాగ"

వినయమున సూతుడు విషాద విహ్వలుండు
పలికె నిట్టులు శ్రీరామభద్రు గాంచి
"ప్రజకు రామరహితమైన రథము జూప
ఎటులు నిన్ను వీడి అయోధ్య కేగువాడ?"

"అడవిలో నిన్ను గొలువంగ నభిలషింతు
తురగములు కూడ పొందును పరమగతిని
కలుగ జేయుము నాకు సౌఖ్యంబు కరుణ
లేనిచో త్యజియింతును మేను నేను."

రాము డాతని నిట్టు లూరడిల జేసె
"కైక నీ వరుదెంచుట కాంచినంత
విపినగతుడను నే నని విశ్వసించు
ఆమె సంతోషపడుట నా అభిమతమ్ము.

ప్రియము గూర్పంగ నాకును పృథివిపతికి
నగరమున కేగి తెలుపుము నాదునుడులు"
గుహుడు తెప్పించె రాముండు కోర నపుడు
మఱ్ఱిపాలను జడలుగా మలచ జుట్టు.

జనవిభుండు లక్ష్మణునకు జటలు కట్టి
జడలు దాల్చెను తానును సాధుశీలి
గుహుని రాజ్యంబు రక్షించు కొనగ గోరి
చేరె రాముండు జాహ్నవీ తీరభూమి.

లలన సీతయు రాముండు లక్ష్మణుండు
సంస్పృశించిరి జాహ్నవీ సలిలములను;
నావ అల్లన నీటిపై నడచుచుండ
పూత గంగాభవానిని సీత పొగడె.

విష్ణు పాదోద్భవంబును విశ్రుతంబు
చిత్రచిత్ర ప్రవాహ విచిత్ర గంగ
అవలిగట్టున దిగి రాము డరుగు నపుడు
వనట జిక్కె సుమంత్రుడు కనగ లేక.

నదికి దక్షిణ తీరాన నావ డిగ్గి
దారి జనుచు శ్రీరాముండు తమ్ము గాంచి
"జానకీరక్షణ మ్మీవు సలుప వలయు
వనుల జాగరూకుండవై" యనుచు బలికె.

అగ్రజునిమాట తలదాల్చి అడవిదారి
అగ్రగామియై సౌమిత్రి అరుగుచుండ
అనుగమింపగ మైథిలి యతని, నామె
వెనుక జనుచుండె రాముండు వింటితోడ.

పాదచారులై చేరిరి వత్ససీమ
చీకటి పడంగ, వేకువ దాక రేయి
విశ్రమింపగ వారట విడిసినారు
అవని శయనించి శ్రీరాము డనియె నిట్లు.

కైక కైవసమై పోయి కామవశత
నన్ను వీడిన కోసలనాథుకరణి
సుతు త్యజించిన అజ్ఞాని క్షితిని కలడె?
అనుజ! పురుషార్థముల కామ మధికబలము

కారణం బేదొ చూపించి కాంతు కలచి
ముని యటులు నన్ను కాంతారములకు బంపి
భరత పుత్రుని రాజ్యాధిపతిని జేయ
దురితమతి కైక మనయింట దూరె నయ్యు!

భయరహిత వృత్తిగూర్పు సౌభాగ్యమదము,
సుదతి కౌసల్యను సుమిత్ర క్షోభ పెట్టు
కైక నిజముగ లక్ష్మణా! కాన నీవు
పురమునకును రే పుదయమే మరలి పొమ్ము.

కన్నతల్లిని చేసి దుఃఖాలపాలు
చేర వనులకు నాదేటి జీవనమ్ము?
పగర జీల్చి సాధింపనే జగతినెల్ల?
ధరణిరాజ్యంబు వీడితి ధర్మనిరతి."

బాష్పవదనుని శ్రీరామభద్రు నరసి
సాంత్వనోక్తి నీ రీతి లక్ష్మణుడు నుడివె
"నే డయోధ్య నిస్తేజము నీవు లేక
తగునె ప్రాజ్ఞడవీ విట్లు తల్లడిల్ల?

నిన్ను విడిచి సీతయు నేను నిముస మేని
నిలువ జాలము; పొమ్మన్న నీవు, విడుతు
ప్రాణముల నన్న" పదపడి రాఘవుండు
గడప దలచెను వారితో నడవిలోన.

వారు నడక మొదలిడి ప్రభాతమందు
కడు మనోజ్ఞ ప్రదేశాలు కనుచు చనుచు
చీకటి పడెదు వేళకు చేరుకొనిరి
గంగ యమునయు కలియు సంగమతలమ్ము.

అచట తీర్థవరమ్ము ప్రయాగమందు
ఆశ్రమస్థలి కేగి శిష్యగణయుతుని
సువ్రతుని భరద్వాజుని చూచి నిండు
భక్తితో మ్రొక్కి రాముండు పలికె నిట్లు.

"కోసలేంద్రుని సుతులము కూర్మితండ్రి
వనిని వసియింప బంపగా వచ్చినాము;
రాముడను నేను లక్ష్మణనాము డితడు
ధారుణీజాత ఈమె అర్ధాంగి నాకు."

మాన్యుడైన భరద్వాజ మౌనివరుడు
స్వాగత మొసంగి రామునర్చనము చేసి
కందమూలాదులం బ్రేమ కాన్క లొసగి
పలికె మృదులోక్తి భక్తి తాత్పర్య మెసగ.

"వింటి నీ గాథ నిను గాంచ వేచియుంటి;
విమల వాహినీ సంగమ విపులసీమ
పుణ్యదము తాపసోచిత భూతల మిది
కాన రాఘవా! సుఖముగ గడపు మిచట."

అనియె నంతట రాముండు మునిని గాంచి
జానపదులు మ మ్మిచ్చట కానరాగ
లోప మొదవు మీ శాంతికి; చూపు డయ్య!
జనకజకు మాకు వేరొండు శాంతవనము."

అపుడు ముని పల్కె "మానసాహ్లాదకరము
పక్షి మృగ సుమ ఫల వృక్ష భాసితమ్ము
చిత్రకూటాచలము ఋషి సేవితమ్ము
వాసయోగ్యంబు నీకు ప్రవాస మందు.

రాము డచ్చట సుఖముగ రజని గడపి
మునివరుండు భరద్వాజు ముదల నంది
చిత్రకూటనగంబును చేర దలచి
బయలు దేరెను సుగమమౌ పథము బట్టి.

మౌని చంద్రుడు తెలిపిన మార్గమందు
నడక సాగించి కాళింది నదిని దాట
నిర్మితి నొనర్చి తరణిని, నేర్పుమీర
దక్షిణ తటంబు జేరిరి దానిమీద.

చనుచు న వ్వని చేరిరి శ్యామవటము;
సీత శ్రీ భరద్వాజుడు చెప్పినట్లు
కొలిచె సకల శుభంబులు కోరి మ్రొక్కి
ఆ హరితదళ వృక్షంబు నరసినంత.

జానకి వెనుక రాముండు శస్త్రధారి
చనుచు నుడివెను ప్రీతితో అనుజుతోడ
"సుమధురఫలంబు సుందరసుమము నీవు
కోసి యొసగుము సీతకు కోరెనేని"

ప్రకృతి రమణీయకతకును పరవశించి
యామినిని శయనించిరి యమున దరిని;
మరుసటి దివసంబున వార లరిగి యరిగి
చిత్రకూట శైలంబును చేరుకొనిరి.

"సుందరమ్ము లతాతరు శోభితమ్ము
సకల ఫల మూల సంచయ సంభృతమ్ము
మధురతోయ ప్రపూర్ణము మంజులమ్ము
చిత్రకూటమ్ము; మనము వసింప వచ్చు."

అనుకొనుచు చేర వాల్మీకి ఆశ్రమంబు
వారలను భగవానుండు స్వాగతించి
అర్ఘ్యపాద్యాది విధులచే నాదరించి
మంగళాశీస్సు లొసగెను మహితరీతి.

ఆ సమీపాన సౌమిత్రి అందమైన
పర్ణశాలను గూర్చెను ప్రభుడు మెచ్చ;
శాస్త్ర సమ్మతంబుగ వాస్తుశాంతి నంత
జరపె శ్రీరామభద్రుండు సతినిగూడి.

రాఘవుడు చిత్రకూట పర్ణకుటినుండి
జానకీదేవితోడ లక్ష్మణునితోడ
పూత మాల్యవతీ నదీమాత గనుచు
మరచె తన అయోధ్యాపుర విరహబాధ.

నావ బిరబిర సాగంగ నావలిదరి
జేరి, రాముండు కనుపించు మేరగాంచి,
మరలిపోయిరి గుహుడు సుమంత్రు డపుడు
శృంగిబేరపురికి శోకచిత్తు లగుచు.

గుహుని చారులు, శ్రీ చిత్రకూట గిరిని
చేరి నవకుటీరాన వసించు వరకు
దాశరథుల సమగ్రవృత్తంబు దెలుప
దీనుడై సుమంత్రుడు రాజధాని కరిగె.

అపుడు మంత్రి కయోధ్య శూన్యముగ తోచె;
శోకభరితులౌ పౌరుల చూచి యతడు
ఇనకులులు జాహ్నవిని దాటి రని వచించి
అంతిపురి కేగె ధారుణీకాంతు కనగ.

ఆ మహాసచివు సుమంత్రు నరసినంత
భూవిభుండు దశరథుండు మూర్ఛవోయె;
కోసలాత్మజ కూర్మితో గొలిచియుండు
తరుణు లెల్లరు శోకసంతప్తలైరి

రామ శోకాభితప్తహృద్ధాముడైన
ధారుణీపతి తెలివంది దారిలోన
వారి భోజన శయనాలు, వారి కష్ట
సుఖము లెరిగింపు మనుచును సూతు నడిగె.

"అమల ధర్మజ్ఞుడు మహాత్ముడైన నాదు
జనకు చరణాబ్జములకు వందనశతమ్ము
భక్తితో సల్పితి నటంచు పలుకు మనియె
రవికులాభరణుండు శ్రీరామమూర్తి.

దేవి కౌసల్య కొసగె సందేశ మిట్లు,
పతిని సేవింపు మమ్మ! దైవముగ నెంచి
రాణులను గాంచదగు ననురాగ మొప్ప
భరతు జూడుము రాజను భవ్యదృష్టి.

ఇంక భరతునకు తెలుపు మిట్టు లనియె
పదవి తండ్రి యానతిని చేపట్ట వలయు
నన్నుగన్న తల్లిని నిన్నుగన్న తల్లి
నైవడి విభేద మెంచక కాంచు మయ్య!

క్రోధియై లక్ష్మణుడు చెప్ప కోరె నిట్లు
కాంత కైకేయి రక్కసి కాంక్ష దీర్ప
జనవిరుద్ధంబుగా రాము సాగనంపె
తండ్రిగా దశరథు నింక తలపబోను.

ప్రభుదు, జనకుందు, బంధుదు, భ్రాత నాకు
ప్రేమధాముదు సర్వమ్ము రాము డనగ"
కాంచి లక్ష్మణు, సీత నిర్ఘాంత పోయె,
ననుచు వచియించి నృపునితో ననియె మంత్రి.

అధిప! శబర రాజు గుహుని హర్మ్యమ్ము నందు
అతిథిగా నుంటి కొన్నినా ళ్ళాశతోడ
రమ్మను నటంచు నన్నును రాఘవుందు;
తరలి వచ్చితి మరియొక దారిలేక

దారి నేయెడ గాంచిన దారుణంపు
దృశ్యములె దక్క సుఖము శాంతియును లేవు
ప్రజలు శోకించుచున్నారు బ్రదుకు రోసి
పాడుపడె పల్లెపట్టులు పత్తనములు."

అపుదు భూపతి దశరథు డనియె-నిట్లు.
"సాహసించి చేసితి నపచారమేను
సచివ! గొనిపొమ్ము నను రామచంద్రు కడకు
తనయు నేనియు నిటకు దోడ్కొనుచు రమ్ము."

రామలక్ష్మణ సీతల రాజు దలచి
గోడుగోడున ఏడ్చుచు కుమిలి పోయి
సతిని కౌసల్యగని "నేను సుతుని రాము
జన్మలో గాంతునే" యంచు శయ్య బడియె.

"లేక లేక కల్గినయట్టి ఏకపుత్రు
రాము గనకుండ ఇచట నే బ్రదుక లేను
దండకకు గొనిపొమ్ము రథమున నన్ను
సచివసత్తమా!" అనుచు కౌసల్య యేడ్చె.

అనునయమున మంత్రి సుమంత్రు డనియె నంత
"మాత! కౌసల్య! నీ వెంతమాత్రమిపుడు
శోకమందకు మమ్మ నీ సుతుని కొరకు;
క్షేమముగ నుండిరి విపినసీమ వారు."

ప్రభునితో కోసలాత్మజ పలికె నిట్లు
"నాథ! దుష్కృతి నొనరింప న్యాయ మగునె?
శక్య మగునె భరింప కష్టాల నెల్ల
సీత సుకుమారి అ వ్వన సీమలోన.

ఆమె నుదులకు దుఃఖించి భూమివిభుడు
పూర్వదుష్కర్మము దలంచి మూర్ఛనందె;
దీర్ఘకాలంబునకు జేదు తెలివి గాంచి
జాలిగదురంగ నిట్లు కౌసల్య కనియె.

"మంచి చెడ్డల నెంచక మానవుండు
సలుపు పనుల కనుభవించు ఫలము లెపుడు;
బాల్యమున నే నొనర్చిన పాప మొండు
సుతవియోగాకులితమైన బ్రతుకు గూర్చె."

"దేవి! కన్నియ వప్పటి కీవు నేను
శబ్దవేధిగా క్షితిని యశమ్ము గాంచి
సాగి సరయూతటికి వేట సలుపు కొఱకు
పొంచి కాంచితి రేయి ఎక్కించి ధనువు.

ముంత బుడబుడ ధ్వనులతో మునుగ నీట
దంతి నీ రాను రవళిగా దాకె చెవికి
శరము విడిచితి గజమును చంప నెంచి;
హావిధి యటంచు వినవచ్చె ఆర్తరవము.

కారుచీకటిలో నన్ను కాంచినంత
పలికె నీ రీతి క్రుద్ధుడై బాణహతుడు
"దీను లంధులు వృద్ధులు మౌను లయిన
దంపతుల నిప్పు డోరాజ! చంపినావు.

తల్లిదండ్రులు కోర నుదకము దేర
వేకువను రాగ వింతగా వేచియుండి
సాధుశీలు సన్మునిబాలు సంహరింప
జనవరా! కీడు నీ కేమి సలిపినాడ?

ప్రాణములు వీడ నే నిట బాణహతిని
ఎదురు చూచునా పితరులు బ్రదుక గలరె?
శాప మిడకుండ అదియె ఆశ్రమము వడిగ
వెడలి నా కన్న తండ్రిని వేడుకొనుము."

తనువు బాణఘాతమునకు తల్లడిల్ల
మునికుమారుడు దుఃఖాబ్ధి మునిగిపోవ
శంక మది నింక విడనాడి శరము నేను
తీసివేయంగ నసువుల బాసె నతడు.

పాపభీతితో జన మునివాటి కేను
కానుపించిరి గతిలేక కదలలేక
పక్షములు తెగనరికిన పక్షులట్లు
తాపసకుమారు మాతా పితరులు నాకు.

తనయునిగ నన్ను తలచిన తాపసుండు
త్వరితముగ దీర్ప దుస్సహ దాహబాధ
జలము కోసమై అడుగ నే తెలిపినాడ
విప్రియంబగు వార్తను విధివశాన.

తనయ విరహ విషాద సంతప్తు డగుచు
కనికరము వీడి కినుకతో తన విధాన
నేను సుతశోకమున మరణించునట్లు
శాపము నొసంగె ఆ వృద్ధ తాపసుండు.

సుతశవము చెంత దీనదంపతుల జేర్చ
వార లొనరించి రగ్నిసంస్కార మపుడు;
చివగలేని దుఃఖమ్ముతో చితిని దూకి
ధర్మపత్నితో దివికేగె తాపసుండు.

సంయమీంద్రుని వృద్ధుని శాప మిపుడు
పొందె న న్నిదె! కనుచూపు పోవుచుండె;
తప్పుచున్నది స్మృతికూడ; తగును కాదె
తనయు డా రాము డుండ ని త్తరిని దరిని?

ప్రతినదీర్చి రాముడు వనవాటి నుండి
రాజధాని కయోధ్యకు రాగ కనెడు
జనులు ధన్యులు పుణ్యులీ జగతిలోన;
నీవు శ్రీరామ! ఎక్కడున్నావు తండ్రి!

ఓ మహాబాహు! రాఘవ! ఓ మహాత్మ!
అయ్యొ దేవేరి కౌసల్య! హా సుమిత్ర!
పాపమతి కైక! శ్రీరామభద్ర!" అనుచు
తనువు వీడెను క్షితిపతి దశరథుండు.

తెల్లవారినంత ఎరిగి రెల్లవారు
మందిరాన, దశరథుని మరణవార్త;
కోసలాత్మజయు సుమిత్ర క్షోణినాథు
చుట్టుముట్టి ఏడ్చిరి జాలియుట్టి పడగ.

రాజధాని అపుడు దుఃఖభాజనంబు
తనయు లొక్కరు లేమి ప్రధాను లపుడు
దశరథునిదేహ ముంచిరి తైలపాత్ర;
గడచి పోయె శోకమున ఆ కాళరాత్రి.

"రాజు క్రుంగి కృశించి స్వర్గమ్ము చేరె
కాన కేగిరి రామలక్ష్మణులు కలసి
తాత యింట భరతు డుండె తమ్ముగూడి
నేత లేని రాజ్యంబున నీతి చెడును.

కొమరు నున్నతు ఇక్ష్వాకుకులజు నొకని
అవనివిభునిగా నిపుడు చేయంగవలయు"
మనవి చేసిరట్లు వశిష్ఠమౌని గాంచి
మంత్రివర్యులు మునులు బ్రాహ్మణులు హితులు.

అలసింపక రాజగృహాఖ్య పురికి
గురుదు రాజదూతలను వేగరుల బంపె;
మనవి చేయుక భూపతి మరణవార్త
భరతశత్రుఘ్నుల నయోధ్య పురికి దేర.

అచట, అందరును సుఖులే యని వచింప
దూతలును, రాచకొమరులు తాత ముదల
పొంది పయనమ్ము సాగించి పురికి చేరి
నారు సప్తరాత్రంబులు దారి గడపి.

దారుణములగు దుర్నిమిత్తములు తోచె
కాంతిపుంజవిహీనమై కానవచ్చె
పావనేక్ష్వాకు కులవిభు పాలితంబు
రాజధాని భరతున కరణ్యమట్లు.

తనయు గాంచిన తోడనే జనని కైక
సంతసంబందె; తేజస్వి సహనశీలి
తండ్రి మరణ వార్తవిని రోదనమొనర్చె
పరమధర్మాత్ముడైన ఆ భరతు డపుడు.

"గురుడు వార్తను పంపగా మరలినాడ
భ్రాతృ పట్టాభిషేక శుభంబు దలచి
కాని భరియింప గలనె దుఃఖంబు దీని?
రామచంద్రుడే ఇంక సర్వమ్ము నాకు."

అట్లు విలపించు భరతుతో అనియె కైక
"తనయ! యీ రీతి శోకింప తగదు నీకు
ధారుణీసుత సీతతో తమ్ముతోడ
దండకకు రాము డేగెను తండ్రియాజ్ఞ.

తనయు రామచంద్రుని ఘోరవనికి బంపె
రాజ్య మొసగెను నీకు వరప్రదాత
నిత్యసత్యరతుం డగు నీదుతండ్రి;
దీక్షబూని నీ హితము సాధించి నాను.

కనులుమూసెను రాముని పనవి పనవి
దశరథవిభుండు పరితాపదగ్ధు డగుచు;
ప్రియజనకుని అనంతర క్రియల నెరపి
మేలు చేకూరగా రాజ్య మేలుకొనుము."

"పాపహృదయ! నీ పతిని భూపతిని జంపి
పరమధర్మాత్ము రాముని వనికి బంపి
తివిరి కులమున కపకీర్తి తెచ్చినావు
రాజ్యమేల? నా బ్రదుకె భారంబుకాగ!

సోదరిగ జూచు కౌసల్య ఆదరమ్ము
ఎట్లు విస్మరించితి వీవు? ఎరుగ వొక్కొ?
రామునియెడ నా కెంతటి ప్రేమ కలదొ?
పగతురాలవు మాతృరూపాన నాకు.

జ్యేష్ఠతనయుని పట్టాభిషిక్తు జేయు
మహిత మగు వంశధర్మంబు మంటగలుపు
పాడుకోర్కిని నేను తీర్పంగ లేను
రామునికె చెల్లు రాజ్యభారమ్ము దాల్ప.

అన్న రాముని జేసి రాజ్యాభిషిక్తు
విపినమున కేనె చనియెద తపసి నగుచు
క్రూరమతి కైక!" అనుచు ఆక్రోశ మందె
అనఘచరితుండు భరతుండు జనని గాంచి.

కనుల నశ్రులు దొలుక రోదనము సేయు
భరతు గాంచి రామజనని పలికె నిట్లు
"తల్లి కరుణతో రాజ్యంబు దక్కె నీకు
నన్ను చేర్పుము నా రాము డున్న వనికి.

భూరి దుఃఖార్ణవమ్మున మునిగి నట్టి
భరతు డనియె కౌసల్యతో బాధపడుచు
"నిశ్చలంబగు భక్తిని నిత్య మేను
కొలుచువాడ రాముని, నీకు తెలియదొక్కొ?"

మాత! నిజము నే నెరుగ నే మాత్రమేని
పూజ్యుడగు రాము డడవికి పోవుమాట
రఘువరేణ్య వివాసానురంజనుండు
పాపఫలమంది జగతిలో పతన మగుత!"

ప్రేమతో గారవించుచు రామమాత
తనయు శోకాకులాత్ము నోదార్చె నపుడు;
పితకు విభునకు భరతుండు ప్రేతకృతులు
జరిపె శాస్త్ర సమ్మతముగ గురునియాజ్ఞ.

పదియు మూడవసాటి దౌ ఉదయవేళ
తోడబుట్టులు భరత శత్రుఘ్ను లెట్లొ
అపరకార్యమ్ము లన్నియు ఆచరించి
తండ్రి దలచుచు శోకసంతప్తు లైరి.

ఒక్క పెట్టున శత్రుఘ్ను డుగ్రు డగుచు
పలికె రాము జూడ దలంచు భరతుతోడ
"పడతి పనుపుచే రాము డాపదల కోప
ఆపలే డయ్యె లక్ష్మణు డనుజు డుండి?"

అంత మరుగుజ్జు మంథర అరుగుదేర
అఖిల భూషణ భూషిత యగుచు నటకు
చేటు చేకూర్చె పురికి ఈ చెనటి యంచు
సేవకాళి కుతంత్రము చెప్పి చూపె.

క్రోధవశుదు శత్రుఘ్నుదు కుబ్జ బట్టి
ఈడ్వ సాధుశీలి భరతు డిట్టు లనియె;
"క్రూరురాలు పాపహృదయ కుమతి కైక
చావకున్నె నే నన్నకు జడియకున్న?

మంథరయు గూడ ఇచ్చట మడిసె నేని
రామచంద్రుండు మరి మన మోము గనునె?"
పడసె శత్రుఘ్నుచేతను బంధముక్తి
క్రూరకుటిలవృత్త యగు ఆ కుబ్జ యపుడు.

పదియు నాల్గవనాటి ప్రభాత వేళ
రాజ్యమేల సకల పదార్థములు గూర్చి
రాజు, మంత్రులు భరతుని వ్రతనిరతుని
చేరి కోరిరి పట్టాభిషేక మంద.

"జ్యేష్ఠపుత్రునే భూవిభు జేయుచుంట
సదమలంబగు మా కులాచార సరణి;
వనులలో నేను పదునాల్గు వత్సరాలు
మునివిధాన వసింతు రామునికి మారు.

వేడి అభిషిక్తు గావించి విపిన మందె
రాజధానికి గొనివత్తు రామవిభుని;
వేగ చతురంగబలముతో నేగ దలతు
అడవిదారులు బాగు సేయంగ వలయు."

భరతు డన నట్టు లానందభరితు లగుచు
కార్యవిదులు రాముని గను కౌతుకమున
మార్గనిర్మాణ సర్వసమర్థు లైన
వారిని పరికరాలతో పంపి రంత.

కులగురుండు వశిష్ఠుడు కొలువుగూర్చె
కోసలాధిపు వరియించు కోర్కెతోడ;
మాన్యజను లున్న సభలోన మౌనివరుడు
భరతు గాంచి మృదూక్తుల పలికె నిట్లు.

"ధర్మవిదుడు మహాత్ముండు దశరథుండు
అవనినాథుని నిను జేసి దివికి చనియె
వేరె రామచంద్రుండు కాంతారసీమ
రాజ్యమేలుము నీవు నేటినుండి ప్రజలు మెచ్చ."

"జ్యేష్ఠుడే కాక రాముండు శ్రేష్ఠగుణుడు;
అట్టి ధర్మాత్ము రాజ్యంబు నపహరించి
చెనటి నగుదునె కులమును చెరుప బూని?
ఉర్వి నలుపుదు నాతని కూడిగంబు."

రాజధర్మజ్ఞుడు యశోవిరాజితుండు
భరతు డంతట విలపించి పలికె నిట్లు
"మౌనివర్య! మానిత సభా మధ్యమందు
నలుప దగునె ఈ రీతి నసాధుబోధ?

మంత్రకోవిదుడైన సుమంత్రు డపుడు
భటులతో వివిధ దళాధిపతుల గురుల
బంధువుల పురముఖ్యుల పరమహితుల
పయన మొనరించె నటవికి భరతునాజ్ఞ.

భరతు వెంట నాసక్తితో పరిజనమ్ము
అరుగసాగిరి ప్రభుదర్శనార్థు లగుచు;
దూరమేగిన భరతుండు కోరి విడిసె
శృంగిబేర పురంబున గంగదరిని.

జాహ్నవీనది దరిగని సైన్యతతిని
రామునెచ్చెలి గుహుడు విభ్రాంతు డయ్యె;
తలచె నతడు భరతుండు తరలివచ్చె
రాజ్యకాంక్షతో జంపంగ రాము ననుచు.

రామచంద్రుని సఖునిగా ప్రభునిగాగ
తలచు గుహుడు శ్రీరాముహిత మొనరింప
దళములను గూర్చె గంగను దాటకుండ
భరతసైన్యంబు; రేవు కావంగ జేసె.

భ్రాతృభక్తిని జాటంగ భరతు డచట
శబరవిభుని రామసఖుని శంక తీరె;
ప్రభుకుమారుదు సుఖముగ రాత్రి గడప
సత్కృతుల నెల్ల జరపె నిషాదరాజు.

నావ లేర్పరచె శబర నాయకుండు
పదిలముగ పరివారము నదిని దాట;
భరతుబృంద మందె ప్రయాగ వనము జేరి
అల భరద్వాజునాశ్రమ మందు విందు.

వింతగ వినూత్నలోక మావిర్భవించె
పిలువ మునిమౌళి విచ్చేసి విశ్వకర్మ
సృష్టి చేసిన చిత్రాతిచిత్రమైన
విందు చెన్నొందె కన్నుల విందుకాగ.

అతిథిమర్యాదలకు భక్తి వ్యక్తపరచి
భరతు డర్థింప నా భరద్వాజు సెలవు
చిత్రకూటనగమ్మును చేరు పథము
చెప్పె నతనికి మునికులశేఖరుండు.

కరి తురంగ భటాళితో కాన నేగు
భరతుని అనంతవాహిని పరుగు లిడుచు
చిత్రకూట శైలమ్మును చేరినంత
కనియె రాముండు బెదరిన వనమృగాల.

రామచంద్రుండు శైలవరంబు చూపి
తెలుపుచుండె వైభవము వైదేహి కపుడు
రాజ్యభంగ మేని హితవిభ్రంశ మేని
దివ్యసీమానిరీక్ష బాధింప వనుచు.

"అల్లదే చూడు! చిత్రకూటాద్రి దరిని
పరుగు లిడెడు మృగాలను పక్షితతుల
తెలిసికొను మది ఏమియో తేరి చూచి
అనుజ!" యనియె రాముండు లక్ష్మణునితోడ.

కారణ మెరుంగ సాలవృక్షమ్ము నెక్కి
లక్ష్మణుడు పరికించి కోలాహలమ్ము
రథముపై గని కోవిదారధ్వజమ్ము
తెలిపె నిట్టులు రాముతో తీవ్రఫణితి.

"రాజ్య మెల్లను గొనియు భరతుడు వనికి
సేనతో నేడు శత్రునిశ్శేషకృతికి
పూని తానిదె వచ్చెను; కాన రామ!
కదనరంగాన హతమార్తు కైకసుతుని.

శీఘ్రమే దేవి సీతను చేర్చి గుహను
ధనువు ధరియింపు మనఘ! యుద్ధమ్ము సలుప
పటుధనుర్ముక్త శరముల పగర జీల్చి
రక్తసిక్త మొనర్తు నరణ్యభూమి.

"ప్రాణసముడు నా కాభ్రాతృవత్సలుండు
వంశధర్మకర్మ రతుడు భరతు డనగ;
శస్త్రమును ముట్టి ఎట్టి రాజ్యంబు నైన
కోర నా కోస మేను మీ కొరకెకాని."

అని వచింపంగ రఘురాము డనుజు గాంచి
చిన్నితమ్ముడు సౌమిత్రి చిన్నవోయె;
తలపు కలిగెను తమ తండ్రి దశరథుండె
వచ్చెనేమొ చూడగ నంచు వారి కపుడు.

సేన చిత్రకూటవని వసింప జేసి
పాదచారులై శ్రీరామభద్రు వెదుక
భరతశత్రుఘ్నులు గుహుండు పరిజనమ్ము
చనిరి సానువనముల నాసక్తి దనర.

"విభుడు రఘురాము డక్కటా! విజనసీమ
కూరుచుండంగ నిందుకు కారణమ్ము
నేను కాదె? నా బ్రదుకెంత హీన మయ్యో"
యనుచు దుఃఖించె భరతు డట్లనుజు గాంచి.

భరతుడు విశుద్ధమతి శోక భరితుడగుచు
అన్న నరసెడు నాశతో అరిగి అరిగి
గురు భరధ్వాజు నుడుగుల గుర్తుపట్టె
రామమూర్తి వసించు ఆశ్రమము దారి.

భరతు డెట్టకేలకు చేరి పర్ణశాల
సురుచిరయశోవిశాలుని సుజనహితుని
ధర్మమహితుని భక్తవత్సలుని రాము
కాంచె నట కూరుచుండంగ కటికనేల.

ఆ జటావల్కలమ్ముల అలరువాని
జనకజా లక్ష్మణాన్వితు గనిన యంత
మోదఖేదమ్ము లొకపరి ముమ్మరింప
రాముని పవిత్ర పాదాల వ్రాలి మ్రొక్కె.

వనట జిక్కిన అనుజుని భరతు గాంచి
జనకు కులగురు మౌనిమండను వశిష్ఠు
మాతృబంధు మిత్రాదుల మంత్రివరుల
క్షేమవృత్తాంత మడిగె నా రామవిభుడు.

రాజనీతి శాస్త్రంపు మర్మములు తెలిసి
ప్రాజ్ఞుడగు పాలకుండు ధర్మమతి యగుచు
ప్రజ కభీప్సిత సౌఖ్యసంపదల నెల్ల
కలుగ జేయుంగ వలయు స్వర్గమ్ము నంద."

తాను భరతుని భ్రాతృవత్సలత నెరిగి
ప్రేమతో బోధసేయంగ రాముడట్లు
అనియె నీ రీతి అధికదుఃఖార్తు డగుచు
భరతు డీమాడ్కి శ్రీరామభద్రుతోడ.

"రాజుగా జ్యేష్ఠ జేయు ధర్మమ్ము మనది
రాజ్య మేలంగ నుండగా రామవిభుడు
రాజధర్మాలు నాకేల రామచంద్ర!
మన అయోధ్యకు నావెంట మరలి రమ్ము.

సుతవియోగార్తి దుఃఖ సంక్షుభితుడైన
మన పిత దశరథవిభుండు చనియె దివికి;
ఊర్ధ్వకర్మ లొనర్చితి నుచితరీతి
నీవు గావింపు తర్పణాన్వితము కర్మ."

ధర్మవిదుడు మహాత్ముడు దశరథుండు
పరమపద మందె నను దుఃఖవార్త వినిన
వెంటనే మూర్ఛితుం డయ్యె పృథివిపైని
రాఘవుడు పితృభక్తి పరాయణుండు.

తెలివి నంది మందాకినీ తీరమందు
భ్రాతృసహితుడై రాముండు భక్తియుక్తి
తీర్చి తండ్రికి సలిల సత్క్రియల నెల్ల
పర్వతము నెక్కి చేరెను పర్ణశాల.

జనవర్ధుండగు శ్రీరామచంద్రమూర్తి
భరత లక్ష్మణులను బట్టి పనవుచుండ
కుందుచుండెను వైదేహి కుమిలి కుమిలి;
అడవి మార్మ్రోగె వారి దుఃఖార్త రవము.

విభుని రాముని వీక్షించు వేడ్కతోడ
విబుధవరుడు వశిష్ఠుడు వెంటరాగ
దశరథేంద్రుని దారలు, దళపతులును
పరిజనంబులు చేరిరి పర్ణశాల.

రామచంద్రుండు ధరణి సామ్రాజ్యమందు
భాగ్యమును వీడి భోగానుభవము వీడి
విపిన మందు దీనుడయి జీవింప గాంచి
గొల్లుమని యేడ్చి నారలు తల్లు లెల్ల.

జనములను గాంచి శ్రీరామచంద్రవిభుడు
వరుసగా సల్పె పాదాభివందనాలు;
రాము వెనుకను సౌమిత్రి ప్రణతు డయ్యె
వగలు మిగులంగ తల్లుల పదములంటె.

దశరథేశు పత్నులు తమ ధర్మవిధిని
వారి శోకానలమ్ము చల్లార జేయ
అత్తలకు దుఃఖితాత్మయై అంజలించి
జాలి గదురంగ పలికెను జనకతనయ.

గురుడగు వశిష్ఠు చెంతను కూరుచున్న
అన్నతో భరతు డిటులు విన్నవించె
"రామ! మా అమ్మ కాంక్షించి రాజ్యపదము
దారుణ మొనర్ప జరిగె నీ ఘోరమెల్ల.

అంగనావశుడన్న దుర్యశము గాంచి
అనఘుడగు మన తండ్రి నిర్యాణమందె
స్వీయరాజ్య మగ్రజుడుగ స్వీకరింప
వేడుచుంటిని శ్రీరామవిభుని నిన్ను.

మంత్రులు సకల ప్రజలును మాతలెల్ల
వేడవచ్చిరి నిను మును వీడినట్టి
అవనిరాజ్యము గైకొన, అనుజు నన్ను
చింతితార్థసంధాతగా చేయుమయ్య!"

భరతు డట్టులు ప్రార్థింప మరల మరల
శిరము వంచి, శ్రీరాముండు చెప్పె నిటులు
"వత్స! మన జనకుడు రెండువరము లొసగె
వానిని విధిగ పాటింపవలయు మనము.

సత్యవాదియౌ మన తండ్రి శస్తగుణుడు
క్షితితలేశుడు నాడు కాంక్షించెనట్లు
కాన నేలుము రాజ్య మకంటకముగ
కాన నేలుదు నే నిట గౌరవమున."

రామచంద్రు ననుపమ ధర్మజ్ఞు నరసి
పలికె ధర్మంబు వీడి జాబాలి మౌని
"పరము కోసము భ్రాంతితో బాధపడక
అఖిలసామ్రాజ్యసుఖముల నందు మయ్య!"

"పరమధర్మము సత్యము ధరణిలోన
స్వర్గసాధనం బరయగ సత్యపథము
నీదు మాటలు పాటించి నీతి విడిచి
తప్పనేర్తునే జాబాలి! తండ్రి యాజ్ఞ."

చెప్పనట్లు రాముండు, వశిష్ఠమౌని
అనియె నతనిగని "కుమార! ముని వచించె
నీ మతిని మార్చ; జాబాలి నిక్క మరయ
ఇహపరమ్ముల శ్రేయమ్ము నెరుగు ఘనుడు.

జ్యేష్ఠసుతునకె పట్టాభిషేక మెపుడు
మీ కులాచారమన్నది నీకు తెలియు;
ప్రజల గావుము గైకొని రాజ్యలక్ష్మి
ఉర్వి నీ వుండ భరతు డర్హుండు కాడు.

జనని, జనకు, డాచార్యుడు జగతిలోన
గురువు లగుదు రెల్లరకు మువ్వురు నిజంబు;
పరమగురువుగా నే నిదే పలుకుచుంటి
పురజనుల నీ సదస్యుల బ్రోవుమయ్య!"

"ధర్మమూర్తి అమలకీర్తి దశరథుండు
ధారుణీపతి మజ్జన్మకారకుండు
ప్రభుని మాటదాట"ననియె రామమూర్తి
గురుజన సమర్చన క్రియాకోవిదుండు.

భరతు డంత అకుంఠిత భక్తితోడ
వేయివిధముల వేడియు విఫలు డగుచు
పరచి దర్భశయ్యను దుఃఖపరవశుండు
వికలమతి యౌచు ప్రాయోపవిష్టు డయ్యె.

"సోదరా! లెమ్ము ధారుణీసురుడె కాని
రజకులజు డిట్టు లొనరింప రాదు సుమ్మి
పట్టభద్రుండ వగుచు సత్వరము భరత!
ధరణిసామ్రాజ్య మేలుము ధర్మపరత."

సదయుడగు రాముడు వచింప సభ్యు లనిరి
"శ్రీలలితుడు సత్యవ్రతశీలుడైన
రాఘవుడు జనకాజ్ఞ దీర్పంగ బూన
వట్టిమాటల మాన్పింప వశమె మాకు?."

పలికెనిట్లు శ్రీరాముడు భరతు గాంచి
"ఆలకింపుము వీరి వాక్యాల ననుజ!"
అనియె భరతుండు "నేను రా జగుటగాని
వనిని నీ వుంట కాని నా వాంఛగాదు.

పౌరులును సుహృత్తులు జానపదులు ప్రియులు
వినగ వచియించె రాముడు విస్మితుండు
"తండ్రి ఆనతిచ్చెను నాకు ధర్మఫణితి
దాని నీవును నిలుపంగ తగుదు వత్స!"

నీకు మారుగా శ్రీరామ! నియతితోడ
వనమున పదియు నాల్గేండ్లు వాసముండి
అమితభక్తి తీర్చెదను పితృాజ్ఞ నేను
రాజ్యమేలు మయోధ్యను ప్రజలు మెచ్చ."

"ధరణి పాలించు గావుత భరతు డితడు
సత్యసంధుడు శాంతుడు సన్నుతుండు;
తీరినంత ప్రతిజ్ఞ, నే తిరిగి వచ్చి
ప్రజల నేలెద నితనితో ప్రమద మెసగ."

భ్రాత లట్లు సాగింప సంభాషణమ్ము
పరమహర్షంబుతో ధర్మపరులు వినిరి;
కంటబడకుండ అప్డు డాకసము నుండి
భవ్యమతులు దేవర్షులు పలికిరిట్లు.

"కైకఋణము చెల్లించిన కారణాన
భర్త! నీ తండ్రి కాంచె కైవల్యపదము
తండ్రి సద్గతు లరయంగ దలతువేని
ప్రాజ్ఞుడవు నీవు పాలింపు రామునాజ్ఞ."

భరతు డనె నంత "నీ హేమ పాదుకలను
అడుగులం దాల్చి యొసగుమీ అన్న! నాకు;
ప్రజల నయ్యవియె సలుపు పాలనమ్ము
త్రిభువనముల కిడు నవియె శుభము లెల్ల."

పాదుకల నట్లె రాము డామోద మొదవ
తమ్మున కొసంగ భరతు డందరును వినగ
పలికెనిట్లు "జడలు దాల్చి ఫలములు తిని
రామ! ఎదురు చూచెదను నీ రాక కొరకు.

అన్న! నీదు పాదుకలె రాజ్యమ్ము సేయ
ఉందు భక్తి నందిగ్రామ మందు నేను
గడుపు పదునాల్గు వర్షాలు గడచినంత
నీవు రాకున్న వహ్నిలో నేను జొత్తు."

రామపాదుకా యుగళి భరతుడు గొనుచు
అధికభక్తితో ప్రణతుల నాచరింప
భరత శత్రుఘ్నులను ప్రేమ పల్లవింప
కరయుగము సాచి రాముండు కౌగిలించె.

"అనుగుజనని కైకను దయగను"మటంచు
భరతునకు చెప్పి రఘురామ వల్లభుండు
మాతలను సన్మునీంద్రుల మంత్రివరుల
జనుల నర్హరీతి దనిపి జాలి ననిపె.

భక్తి నర్చించి, తాల్చి పావలను తలను
పొంకముగ నుంచి పురకరి మూర్ధమందు
చనియె భరతుండు శ్రీరాము డనుమతింప;
రామభద్రుండు చేరె నాశ్రమము నంత.

శీఘ్రగతి నయోధ్యాపురి చేరుకొన్న
భరతు డభిషేక మొనరించి పాదుకలకు
ప్రజల నేలు నందియునెడు పల్లెనుండి
రామపునరాగమాకాంక్ష రంజిలంగ.

గిరిని పుణ్యాశ్రమాలలో పరమమునులు
తన్ను జూపుచు నేమియో తలచుచుండ
సంశయించిన శ్రీరామచంద్రు డంత
కులపతిని గాంచి కేల్మోడ్చి పలికె నిట్లు.

"అనఘ! వనవాసులైన మహర్షు లిట్లు
చేరి నను గూర్చి మెల్లగ చెప్పుకొనగ
ఏమి కత" మన వచియించె రాము జూచి
మౌనిపతి కంపితగళుండు మనసు విప్పి.

"రామచంద్ర! నిన్ను గని ఓర్వంగ లేక
రావణానుజుడు ఖరుండు రక్కసుండు
మునుల బాధించుచుండె నీ వనములందు
నిర్విశంకుడై తిరుగుచు నిశలు పవలు.

దుర్జయుడు ముష్కరుండును ధూర్తు డతడు
పెట్టు బాధల కీ సీమ విడిచి పోవ
ఉద్యమింప తాపసులు, నే నొప్పుకొంటి
తరుణితో నిట నీవుండ తగదు వత్స!

రమ్ము రఘురామ! నీవును మమ్ము గూడి
రాక్షసాళి బాధలకు దూరముగ నేగ";
సమ్మతింపక శ్రీరామచంద్రవిభుడు
మునుల వీడుకొని ఉటజమునకు జనియె.

భరతుడు చనిన స్మృతులెల్ల పెరుగు ననుచు
తాపసులు వీడి వెడలిన స్థల మటంచు
చిత్రకూటాద్రిపై నివసింపలేక
రాము డేగెను అత్రి ఆశ్రమము చేర."

అత్రి జానకితోడ సౌమిత్రితోడ
ఏగుదెంచిన రాముని స్వాగతించి
రామవిభునకు పరమసాధ్వీమతల్లి
తన సతి అనసూయను జూపి అనియె నిట్లు.

"మహితచరిత తనదు తపోమహిమచేత
ధారుణిని మున్ను క్షామంబు పారద్రోలె
గంగను ఫలవంత మొనర్చి పొంగ జేసి
దశనిశల జేసె నేకరాత్రంబు కాగ.

తనయ! భావింపు మీమెను తల్లివోలె;
దేవతలకు మునులకు సంతృప్తి గూర్చు
పూజ్యమౌ అనసూయకు పుడమిజాత
సేవ యొనరించు గావుత చిత్త మలర."

అంతట విభుండు శ్రీరాము డానతీయ
అంచితగతిని దర్శించి అంజలించి
సీత వినతయై మునిపత్ని సేమ మడుగ
ప్రేమ ననియె కంపిత దేహ వృద్ధసాధ్వి."

"అమ్మ జానకీ! ఎంత ధన్యాత్మ వీవు
ఆత్మవిభు గూడి భోగభాగ్యాలు వీడి
విపినసీమల విహరింప వేడ్కమీర
ఏగుదెంచితి విట్లు; నీ కిదియె సుఖము.

మగని జీవనము వనినొ నగరమందొ
అగుణుడొ ఆత డరయంగ సుగుణమణియొ
ఖలుడొ కటికదరిద్రుండొ కాముకుండొ
వనిత కెప్పుడు పతియె దైవతము సుమ్మి.

సుదతి కొదవును కీర్తియు సుఖము జగతి
పావనంబగు పతిదేవు సేవజేయు;
మహిజ! నిక్కము నీవంటి మహితమతులు
బ్రహ్మలోకసుఖంబులు వడయ గలరు."

ఆ తపస్విని ముదమంద అనియె సీత
"దైవము పతియె సతికను ధర్మమేను
ఎరుగుదును దేవి! సుగుణుని పరమహితుని
విభుని శ్రీరాము నే నెట్లు విడువ దలతు?"

సీత మాటలకెంతొ సంప్రీతి నంది
సదమలచరిత అనసూయ సదయురాలు
అవనిజకు నంత ప్రేమతో అంగరాగ
కుసుమమాల్య భూషాతతి నొసగి పలికె.

"మేని కివియెల్ల తేజంబు, మేలు గూర్చు
తాల్పదగునమ్మ వీని నిత్యమ్ము నీవు;
మున్ను నీ స్వయంవరమును విన్నదాన
సీత! నీ పెండ్లి చరిత వచింపు మిపుడు."

విశదపరుప సీత వివాహవృత్త మెల్ల
ఘనతపోనిధాన అనియె కౌగిలించి
సీతతో నిట్లు "వింటి నీ పూతచరిత
రాత్రి యేతెంచె నదె అంబరమ్ము కనుము.

అతిమధురము అత్యంత శుభావహంబు
నీ స్వయంవర చరితమ్ము; నే నొసంగు
దివ్య భూషణములు దాల్చి దేవి! నాకు
సంతసమ్మును గూర్పు మీ సమయమందె.

అట్లె భూషణాలంకృతయైన సీత
భక్తితో అనసూయకు ప్రణతు లొసగి
సెలవు గైకొని శ్రీరాము చేరినంత
నగల గాంచి మెచ్చుకొనియె మిగుల నతడు.

అత్రిమున్యాశ్రమమున త్రియామ గడపి
మునులు వివరించి దండక వనికి పథము
సొగనంపంగ, శ్రీరామచంద్రమూర్తి
అనుజుతో సీతతోడను వనము జేరె.

* * *

# అరణ్యకాండము

శ్రీ రఘువరు డాత్మవిదుడు వీరమూర్తి
అనుగుపత్ని వైదేహితో అనుజుతోడ
చేరగా దండకారణ్యసీమ, కలిగె
తాపసాశ్రమ మండల దర్శనంబు.

వారి సుందర పుణ్యరూపాలు గాంచి
పరమవిజ్ఞాను లా దృఢవ్రతులు ఋషులు
విస్మయాధీను లగుచు దీవన లొసంగి
అతిథిపూజల దనియించి రాశ్రమాల.

రాత్రి అచ్చట కడపిన రామవిభుడు
విజనవని కేగె మౌనులు వీడుకొల్ప;
ధ్వస్త వృక్షతతి, బహువిధ మృగగణము
పెచ్చుపెరిగె నా భీకర విపినమందు.

రాము డట్టి అరణ్యమార్గమున చనుచు
వికట విషమోదరంబును వికృతమైన
ఆకృతి ధరించి తీవ్రభయంబు గొలుపు
రక్కసుని కట్టెదుట గాంచె ఒక్కపరిని.

శీఘ్రమే రాము లక్ష్మణు సీతనరసి
ధరణి గదల భీకర నినాదమ్ము జేసి
ధారుణీజాత సీతను దైత్యు డతడు
తొడను జేరిచికొని వారితోడ పలికె.

రాక్షసవరుండ నన్ను విరాధు డంద్రు
మునులవేషాన వనిలోన వనితతోడ
సంచరించెడు మిమ్ముల చంపివేసి
ఈ మనోహారిణి సతిగా ఏలుకొందు.

సీత నన్యుండు స్పృశియింప చింతనొంది
రాముడును లక్ష్మణుండు విరాధు జంప
యత్న మొనరింప పసిగట్టి అనియె నిట్లు
కోపఘూర్ణిత నేత్రు డా క్రూరు డంత.

"జయుని సుతుడ శతహ్రద జనని నాకు
బ్రహ్మ నా తపస్సును మెచ్చి వర మొసంగె
చావు లేకుండ నెట్టి శస్త్రమ్ము చేత
పరువుగా ఆమె నిటవీడి పరువు లిడుడు".

క్రోధి సాధువిరోధి విరాధు జీల్చ
ఆ మహాబాహుబలుడు శ్రీరాము డలిగి
విల్లు బిర బిర చేబూని విడిచిపెట్టె
రక్కసుని పైన నిశిత శరమ్ము లేడు.

భ్రాత లెంతగ కురిసిన బాణవృష్టి
భీతి చెందక వీడుచు సీత నటనె
వారి నెత్తుకొని ఖలుడు పరుగుదీసె
కనగ ధారుణీజాత నిర్ఘాంతపోయి.

వేగమే విరాధు కరాలు విరుగ గొట్టి
అన్నదమ్ములు కాళ్లతో తన్ని తన్ని
గోతిలో ముద్దగా జేసి పాతిపెట్టి
అవల చేరిరి శరభంగు నాశ్రమంబు.

మౌని ఆశ్రమోపాంత మా మహితధరణి
దేవతావిభుని రథమ్ము దీప్తి దోచె
అంతరిక్షాన శ్రీరాము డరసిచూప
అనుజున, కదృశ్య మయ్యె జంభారిరథము.

జానకీయుతు శ్రీరామచంద్రవిభుని
ఆదరించిన శరభంగు డనియె నిట్లు
"ఇంద్రుడు దివికి గొనిపోవ ఏగుదేర
తలచినాడను తొలుత మీ దర్శనమ్ము".

రామ! ధార్మికుండు సుతీక్ష్ణనాము డతడు
మెలగు ఈ దరి; శ్రేయంబు మీ కొసంగు"
అనుచు శరభంగమౌనీంద్రు డగ్నిజొచ్చి
అచ్చెరువు నంద వా, రేగె నమరపురికి.

ఆ మహాముని ఆశ్రమమందు మనెడు
తాపసులు శుద్ధయోగులు ధర్మవిదులు
బహువిధంబుల రాముని ప్రస్తుతించి
వేడుకొనినారు రాక్షస పీడమాన్ప.

"అనుజుతో శత్రువధ చేసి అట్లె నేను
తీర్తు మీ అభీష్ట" మటంచు తెలిపి విభుడు
సీతతో భ్రాతతోడ సంప్రీతి వచ్చు
ద్విజులతో చేరె మౌని సుతీక్ష్ణువనము.

పావనాశ్రమాన సుతీక్ష్ణు పరమవృద్ధు
వరమహర్షిని దర్శింప పలికె నతడు
"తపముతో దాశరథి! లోకతతిని గెల్చి
నిన్ను చూడ నిరీక్షించు చున్నవాడ.

ధారపోయుదును కొను డుత్తమజగాలు,
బహుళ ఫల వృక్ష సముదాయపరివృతంబు
శాంత సుందర బహుపక్షి సంయుతంబు
ఆశ్రమము నీకు వాసయోగ్యమ్ము రామ!"

పలికె నిట్లు రాముడు "మహాభాగ! మౌని!
ధర్మమూర్తి! చేకొనెద నుత్తమజగాలు
వనములోని నానామృగవధను జేయ
బాధయగు మీకు; తగదు మా వాస మిచట."

రామభద్రు డాశ్రమ మందు రాత్రి కడపి
ఆ సుతీక్ష్ణ మహామౌని అభ్యనుజ్ఞ
బయలుదేరంగ అందిచ్చె వనిత సీత
బాణతూణ ఖడ్గాలను వల్లభునకు.

బాటలో పల్కె వైదేహి భర్తృభక్తి
"అనృత మాడుట, కోరుట అన్యసతిని
అలుక గొనుట వైరము లేక, అనగ బరగు
మూడువ్యసనాలు కామాన పుట్టు రామ!

అనృత మెప్పుడు స్వామి! నీ వాడ బోవు
సోలసి పరసతి కన్నెత్తి చూడ వీవు
మౌని రక్షణకై చంప దానవులను
శపథ మొనరింప చివరిది సంభవించె."

ధర్మదీక్షితు డిడె సమాధాన మిట్లు
"స్నిగ్ధవచనాల హితమునే చెప్పి తీవు
సీత! ప్రాణాల నేని త్యజింతు కాని
ద్విజులకై ప్రతినచేసి నే తిరుగబోను."

భ్రాతతో సాధ్వి సీతతో రామవిభుడు
రమ్యపావన మునిజనాశ్రమములందు
చక్కగా పదియేండ్లు వాసమ్ము సలిపి
తిరిగి చేరె ధర్మజ్ఞు సుతీక్ష్ణు వనము.

అట మహాముని సన్నిధి కరిగినంత
అతడు ముదముతో వారల నాదరింప
రామచంద్రుండు సత్యవిక్రమునితోడ
వెల్లడించె అగస్త్యు సేవించు కోర్కి.

పరమమౌని సుతీక్ష్ణుడు పథము తెలుప
అటు లగస్త్యముని భ్రాత ఆశ్రమంబు
చేరి, ఆతని అతిథిసత్కారమంది
రామచంద్రుండు గడపె నా రాత్రి నచట.

యోగిపుంగవు నాన సూర్యోదయాన
శ్రీ కరంబగు వనిని సుశ్లోకు చూడ
చనియె, గాఢదీప్తి వెలుంగు ముని యొకండు
వహ్నితేజు డొసంగెను స్వాగతమ్ము.

అరుగుదేరక మున్నె ఆ ఆశ్రమంబు
అ య్యగస్త్యమహర్షి మహత్త్వ మెల్ల
విపిన సౌందర్య మరయుచు వెనుక వచ్చు
అనుజునకు జెప్పి శ్రీరాము డనియె నిట్లు.

"దీర్ఘజీవి అగస్త్యుడు దివ్యతేజు
డసదృశ తపోబలాధికు డతని వనిని
తప మొనర్ప శ్రేయములు సత్వరమె కలుగు
ప్రాప్తమగు ఆ మహాత్ము దర్శనము మనకు."

రాముడు సతీసమేతుడు భ్రాతృయుతుడు
బ్రహ్మఋషి పాదపద్మాల వ్రాలి మ్రొక్క
ఆ యగస్త్యుడు వారల నాదరించె
మూలకందాలు మధుర ఫలాల నొసగి.

సురలు గంధర్వులు ఋషులు పరమభక్తి
నిత్యసేవల, కొలుచు మౌనివరు డనియె
హేమరత్న విరాజిత మీ ధనుస్సు
విష్ణుదేవతాకము జేసె విశ్వకర్మ.

కమలజాతు డొసగె నమోఘంబు దీని
సూర్య తేజస్సమం బిది; చూడు రామ!
శక్రు డిచ్చిన సునిశితశరము లివిగొ
మండునగ్నివలె పొదుల నిండు సతము.

నిశితకరవాల మిది, ఇవె విశిఖతతులు
ఇదియె ధనువును, ప్రీతి చేకొనుము వీని;
పగర గెల్వుము శ్రీరామభద్ర! యనగ
విభుడు ముదముతో వానిని స్వీకరించె.

ఆ యగస్త్యమహాముని అనియె మరల
"ఓ మహాభుజ! జానకి ఈమె సాధ్వి
దోష మే మాత్ర మెరుగని తోయజాక్షి
సుఖము నందెడు రీతిని చూడవలయు."

నిశ గడచి అర్కు డుదయింప దశరథేశ
పుత్రుడగు రాముతోడ తపోధనుండు
"క్రూరకర్ములు దైత్యుల బారినుండి
కరుణతో మౌనిజనముల గావు మయ్య!

పూత గోదావరీ తీర పుణ్యభూమి
బహుళ కాంతార శోభా విభాసితమ్ము
పంచవటిగ ప్రసిద్ధమై పరగుచోట
ఆశ్రమము మీకు తగునయ్య! అమలహృదయ!"

అనియె పాదాభివందన మాచరింప
సెల వొసగి మౌని రాము నాశీర్వదించి,
పంచవటిని సలుప వనవాసదీక్ష
చనియె రాముడు సీతతో అనుజుతోడ.

మార్గమధ్యమ్ములో నొక మట్టిపైన
పితృసఖుని జటాయువు జూచి ప్రీతినందె;
పావనుండు గృధ్రకులుండు పంచవటిని
సీత గాచుచు సాయమ్ము సేతు ననియె.

భ్రాత సౌమిత్రి నిర్మించె పర్ణశాల
వృక్ష గుల్మలతలు, మృగపక్షి గణము
భవ్య గౌతమీసలిలమ్ము, పరమశోభ
రాము దివ్యాశ్రమ పరిసరాల కొసగె.

రాముడా సుందరము కుటీరంబు నరసి
కడు విశాల మయ్యది కూర్చ కనులవిందు
సుఖపరిష్వంగ మొసగెను సోదరునకు
ఇంతకంటెను చేయున దేదిలేక.

రమ్యము హృదయాహ్లాదకరమ్ము నైన
పర్ణశాలలో వారలు వరలు చుండ
కాలచక్రమ్ములో శరత్కాల మరుగ
మగుడవచ్చెను భవ్య హేమంత మంత.

ఉవిద సీతతో శ్రీరాము డొక్కనాడు
భూరి గోదావరీనదీ నీరమందు
స్నానకృత్యము సలుపంగ చనుచునుండె
అనుజుడు కలశహస్తుడై వెనుకరాగ.

మెల్లగ వచించెనిట్లు సుమిత్రపట్టి
"భర్త దశరథుండు పరమపావనుండు
సుతుడు భరతుండు సత్తపోవ్రతుడు హితుడు
ఎట్టు కలిగెనో కైకకు హీనబుద్ధి?"

రాము డది సహింపక ఈ కరణి వచించె
"తల్లి కైకేయి మాటనెత్తకుము సౌమ్య!
భరతశత్రుఘ్నుల దలంప కరగు మనసు
కాల మెపుడొ మీ మువ్వురితో కలసి గడుప?"

రామలక్ష్మణులును సీత రమ్యభంగి
పూతగౌతమిలో కృతస్నాతు లగుచు
పర్ణశాలను జేరిరి పరవశాన;
నీతికథలు రాముండు విన్పించుచుండె.

ప్రక్కగూర్చుండి వినుచును ప్రమద మెసగ
స్వీయభావమ్ము గూఢము చేసె సీత
అంతలో ఏగుదెంచెను వింతగొలుపు
రాక్షసి యొకర్తు; వరలు శూర్పణఖ యనగ.

ఆ సురూపు నిందీవరశ్యాము రాము
సోయగము సౌకుమార్యంబు చూచినంత
కామరూపిణి రాక్షసకాంత చెంత
స్థిరముగా నిలిచె, మనంబు దిటవు తొలగ.

ఆ వికార స్వరూపిణి అధమవాక్య
అతిభయంకరరవ విరూపాక్షి జరఠి
శూర్పణఖ అప్రియాకార సుందరి యయి
రాముని విశాలనేత్రు నరసి వచించె.

"మౌనివేషమ్ము దాల్చియు పూనితీవు
చాపము శరాలు, పనియేమి సతిని గూడి
సంచరింపంగ నిట్లు రాక్షసుల సీమ?"
రాము డప్పుడు పల్కె శూర్పణఖ గాంచి.

సత్యమే వచియింతును నిత్య మేను
రామనాముఁడ దశరథరాజసుతుఁడ
ఖ్యాతి గాంచిన నాపత్ని సీత ఈమె
అనుగుతమ్ముండు లక్ష్మణుం డందు రితని.

ధర్మనిరతితో చెల్లింప తల్లి కోర్కి
వాస మిచ్చుట సలుపంగ వచ్చినాము;
తోపదీవు రాక్షసిగ నీ రూప మరయ
ఎవతె వీవు? నీ రాకకు హేతు వేమి?

రామచంద్రునితో పల్కె భామ యిటులు
"రావణుడు దైత్యవిభుడు సురద్విషుండు
తలప నా కగ్రజుడు వనస్థలులయందు
రామ! నేను చరింతు నిరంతరమ్ము.

కామరూపిణి యైన రాక్షసిగ నేను
భువన మెల్లెడ విశ్రుతి పొందినాను;
సతము నిద్రపోయెడు శూరసత్తముండు
కుంభకర్ణుం డనెడువాడు కూడ భ్రాత.

పరమసుందరాకార! శూర్పణఖ నేనె
స్వేచ్ఛగా ఒంటి వర్తింతు స్వీయశక్తి;
అసురకృత్యవిముఖుడు ధర్మాత్ము డనుచు
పేరుగాంచె మా అన్న విభీషణుండు.

యుద్ధవీరులుగ జగత్ప్రసిద్ధి గన్న
ఖరుడు దూషణు డనుగుసోదరులు నాకు
నిరుపమ వినీల తనుడవౌ నిన్ను జూచి
వచ్చితిని మన్మథార్తనై వాంఛ దీర్పు.

వికృతయు విరూపయైన ఈ వెలది సీత
తగదు సతిగ నీ కెంతమాత్రమ్ము కూడ;
పూరుషోత్తమా! ఆలిగా పొంది నన్ను
అవ్యయసుఖంబు లెల్లప్డు డనుభవించు."

కామినిం జూచి ప్రహసించి రాము డనియె
"సన్నుతాంగివి నీకేల సవతి పోరు;
తరుణి దరిలేని సౌమిత్రి తరుణు డతడు;
పతిగ వరియింపు మనురూపు నతని తన్వి!"

కామమోహిత క్షణములో రామువీడి
అసమవీరు లక్ష్మణు గాంచి అనియె నిట్లు
"అందగత్తెను భార్యగా పొంది నన్ను
సుందరాకార! అందు మమందసుఖము."

మందహాసమ్ముతోడ లక్ష్మణుడు పలికె
"దాసుడను నేను నీవును దాసివౌదు
భర్తగా నన్ను పడసిన పడతి మిన్న!
ప్రేమ జూపుము రాముపై పెంపు గనుము."

రామచంద్రుని గాంచి శూర్పణఖ పలికె
"వృద్ధసతిని విరూపను విడువ నీకు
ఇచ్ఛ లేకున్న మ్రింగెద నిప్టె" యనుచు
శీఘ్రమే దూకె రాక్షసి సీతపయికి.

రామభద్రుడు సూచింప రాత్రిచరిని
వికృతరూపిణి గావించి విడువ నెంచి
ఖడ్గమును ఆమె నాసిక కర్ణయుగము
కోసె సౌమిత్రి మిక్కిలి కుపితు డగుచు.

కాననం బెల్ల నిండ భీకరరవంబు
పుడమి రక్తధారలు పాఱ వెడలె వెలది;
కర్ణనాసావిహీనను ఖరుడు కాంచె;
అంత చెప్పె శూర్పణఖ వృత్తాంత మెల్ల.

క్రోధసమ్మూర్ఛితుం డయి బాధపడుచు
చెలియలి మనోరథము దీర్ప శీఘ్రగతిని
పదియు నల్వుర రాక్షసవరుల బిలిచి
వారిపై మోపెను ఖరుండు భార మిట్లు.

"నరులు సోదర లిరువురు నారి గూడి
నారచీరలతో వచ్చినా రటంచు
తెలిసె, వారిని వధియించి తెందు; చెల్లి
త్రావ నెంచెను వారి రక్తమ్ము తాను."

రామునాశ్రమ సీమ శూర్పణఖ వెంట
ఆయుధమ్ములు తాల్చిన అసుర వితతి
కాంచి నంతనే చేబూని కార్ముకమ్ము
వారితో రామభద్రుండు పలికె నిటులు.

"మేము సుతులము దశరథ భూమిపతికి
దండకాటవి చరియించు తాపసులము
మునుల రక్షింప దైత్యుల దునుము వనిని
కనకభూషితం బైన ఈ కార్ముకంబు".

క్షుద్రరాక్షసు లప్పుడు క్రుద్ధు లగుచు
వాడిశూలాలు పదునాల్గు వైచి రంత;
వరుసగా తీక్ష్ణశరముల వారినెల్ల
కూల్చె రాముండు వ్రేల్మిడి ఘోరభంగి.

నేలగూలి వా రసువులు గోలుపోవ
అరిగె శూర్పణఖ ప్రకంపితాత్మ యగుచు
ఖరుడు సేనతో వచ్చె భీకరబలుండు
చెండ దాశరథుల మహోద్దండ శక్తి.

రాము డసురుల భీకరార్భటుల వినుచు
శీఘ్రమే గుహ కనుజుతో సీత బంప
నిలిచె యుద్ధసన్నద్ధుడౌ ఖలుడు ఖరుని
రథము కార్ముకహస్తుడౌ రాముముందు.

గుంపులై పైకి చనుదేర కోపమొంది
భీమకర్ముఁడౌ పదునాల్గువేలమంది
రక్కసుల జంపె ఘోరసంగ్రామమందు
రాముడు సహింపరాని శరాలతోడ.

ఆలమున రాఘవుండు బాణాలవాన
కురియు చున్నాడొ అనియెడు తెరగు దోచె
అశ్వ గజ రథ వాహిను లన్ని గూలి
వల్లకాడుగ దండకవనము మారె.

దూషణు డతండు సైనికభూషణుండు
ఖర పరాక్రమ డైనట్టి ఖరుడు కూడ
వీర రణమున ప్రాణాలు వీడినారు;
పుష్పవర్షమ్ము కురిసిరి మునులు సురలు.

మహితకోదండపాణి రామప్రభుండు
రాక్షసాళిని దునిమి ఆశ్రమము జేరి
సర్వమును దెల్ప సౌమిత్రి సంతసించె;
కౌగిలించెను కాంతుని కాంత సీత.

రావణుని పాలికేగి శూర్పణఖ కసిని
ఉసిగొలుప రాము పయికి దురుకుతులాడె
తాను చెందిన దుర్దశ ధాత్రిగూలి
చెప్పె గొంతెత్తి యేడ్చుచు చుప్పనాక".

పలికె అలుకతో అపుడు శూర్పణఖ యిట్లు
"రాముడు విశాలవక్షుడు రాజసుతుడు
దీర్ఘ బాహుండు వీరుండు ధీరుడైన
వరజటాజిన చీర భాస్వరు డతండు.

కంటి సర్వప్రశస్త రాక్షసకులమ్ము
నిశిత బాణాల నాతడు నేలగూల్చె
మహితుడగు లక్ష్మణుం డసమాన బలుడు
భ్రాత యగు రామునకు బహిఃప్రాణ మెపుడు.

రమ్యవదన విశాలాక్షి రామపత్ని
చెన్నెసంగును వైదేహి సీత యనగ
అపరలక్ష్మి భర్తృహితంబు నామెకోరు
ఆమె సరిపోలు సుందరి అవని లేదు.

అట్టి అందాల చిలుక భాగ్యమ్ము లొలుక
భార్య యగుటెల్ల దివ్యవైభవము నీకు
రామలక్ష్మణులను నీ శరాల గూల్చి
స్వీయపత్నిగ పొందుము సీత నిపుడె".

రావణుం డపు డపరంజి రథము నెక్కి
రయము మీర సముద్ర తీరమ్ము దాటి
అడవిలో రమ్యమగు ఒక ఆశ్రమాన
అనియె మారీచుని నియతాహారు గాంచి.

అనుగుమారీచ! నేడు నా ఆర్తి వినుము
చెప్పనేల శూర్పణఖ నా చెల్లె లనుచు
ఖరుని దూషణు నాదు సోదరు లటంచు
అడవి వసియింత్రు వారు నా ఆజ్ఞచేత.

సాధుజనులను హింసించి సంతసింప
అచట వారి కున్నారు సాయమ్ము నలుప
వీరదైత్యులు పదునాల్గువేలమంది;
చచ్చి రెల్లరును ఖరదూషణులతోడ.

రాము డొక పాదచారి యరణ్యవాసి
నరుడు వారల తీవ్రబాణాల జంపి
ముద్దుచెల్లి శూర్పణఖాఖ్య ముక్కుచెవులు
చెక్కి విడిచె ఇకేమందు చెలిమికాడ!

మాయలం దారితేరిన మంచి చెలివి
సాయ మర్థింతు నీ విట్లు చేయవలయు
చనుము బంగరులేడివై కనగ వారు
రమ్యభంగిని రాము నాశ్రమము కడకు.

మృగశరీరుని నినుజూచి మెలతసీత
పతిని మరదిని బంపును పట్టితేర
ఆమె నపు డవలీలగా అపహరింతు
స్రుక్కు రాము నావలగెల్తు సులభరీతి".

దశవదనుతోడ తాటకాత్మజుడు పలికె
"దాశరథిని జయింపంగ తరమె నీకు?
భీకరజ్వాల సీతను తాక గలవె?
మానుము భవత్ప్రియత్నమ్ము దానవేశ!.

మున్ను బాలకుడైన రాముండు నన్ను
కౌశికుని యజ్ఞవాటిక కడను గొట్ట
సంద్రమున బడి బ్రదికితి చావు తప్పి
అతని శరశక్తి నరసితి అటవి మరల.

రామమూర్తి సత్త్వగుణుండు ప్రథితబలుడు
కలిగెనేని పౌరుషము నిక్కముగ నీకు
రావణా! పోరు మతనితో రణము నందు
నేను మాత్రము నీతోడ రాను పొమ్ము."

రాక్షసాధిపుడైన ఆ రావణుండు
పరుషభంగి మారీచుతో పలికె నిటులు
"వ్యర్థము వచింప నీతివాక్యాలు నాకు
బ్రదుక దలచిన నా వెంటరమ్ము నీవు."

సీత గొనితేర రాక్షసజాతి యెల్ల
నాశనం బగు తప్పదు నమ్ము మయ్య!
అని వచించియు మారీచు డతని వెంట
రాఘవాశ్రమమునకేగె రథము మీద.

చుక్కలు శరీర మందెల్ల శోభిలంగ
క్షణములో రక్కసుం డయ్యె మణుల లేడి
రమ్యమౌ రఘురాము నాశ్రమపథాన
సంచరించె వైదేహి విస్మయము చెంద.

మేని పసిడివన్నెలు మిరుమిట్లు గొలుప
చెంగు చెంగున దూకు కురంగ మపుడు
వన్నె లొలుకుచు నుండ ఆ ప్రాంగణాన
స్నిగ్ధసుకుమార సుందరి సీత గాంచి.

ఇట్టులు వచించె సీత నిజేశు నరసి
"చిత్ర చిత్ర వర్ణాలతో చిత్తమెల్ల
హరిణము హరించుచున్న దే కరణి నైన
దీని జీవమ్ముతో పట్టి తెమ్ము దేవ!

కరము విస్మయకరముగా కానిపించు
వింతమృగముపై సీతోక్తి వినకమున్నె
అన్నతో లక్ష్మణుడు "సంశయమ్ము కలుగు
తనువు నటు దాల్చె మారీచు" డనుచు తెలిపె.

"ప్రీతి నింపె బంగరులేడి సీతయెదకు
క్షణములోన దెచ్చెద అనుక్షణము నీవు
అబల కావుము లక్ష్మణా!" యనుచు అన్న
తత్క్షణం బేగె కత్తితో ధనువుతోడ.

చిందు ద్రొక్కుచు సొబగులు చిందుచున్న
మాయలేడిని బట్టంగ ధీయుతుండు
చనియె శీఘ్రంబుగా పర్ణశాల నుండి
రామచంద్రుడు చాల దూరంబు వెడలి.

విసిగి వేసారి సారించి వింటనారి
బ్రహ్మనిర్మితమైన అస్త్రమ్ము విడిచె
రాము డంతట గాంచెను రక్తసిక్త
ఘోరదర్శన మారీచ భూరి తనువు.

ప్రాణములు వీడు నప్పుడు రాక్షసుండు
రామభద్రుని కంఠస్వరంబు తోప
అరచె "హా సీత! హా లక్ష్మణా" యటంచు
అభిమతార్థంబు సిద్ధింప అసురపతికి.

తొలుతనే తన తమ్ముడు తెలిపినట్లు
వంచనారూపి మారీచు స్వరము విన్న
సీతయును లక్ష్మణుండును భీతిచెంది
ఏ మగుదురోయని తలంచె రామవిభుడు.

కేకలో ఏదొ శంకించి కీడు తాను
చంపిన మరొక్క లేడి మాంసమ్ముతోడ
రాము డేగుచుండె తన ఆశ్రమము జేర
మదిని కొంందలమంది సామాన్యునట్లు.

చెవుల తాకంగ ఆ ఆర్తరవము సీత
మనసు చెదరి వచించె లక్ష్మణుని గాంచి
"రాము డందెను కష్ట మరణ్యమందు
వేగమే ఆతనిని బ్రోవ ఏగు" మనియె.

ఆమె మాటలు సౌమిత్రి ఆలకించి
మిన్నకుండె మది దలంచి అన్న ఆజ్ఞ;
ఎన్నడును లేనిరీతి మహీకుమారి
పలికె నతనితో కోపతాపమ్ము లంది.

మిత్రరూపాన భ్రాతకు శాత్రవుడవు
కానిచో లక్ష్మణకుమార! కదలవేమి
కన్ను నాపైని లేకున్న కావ జనుము
నేను బ్రతుకను రాముడు లేని యెడల.

అడలిపోయి కదుంగడు హరిణి కరణి
బాష్పనేత్రాల వైదేహి బాధపడగ
అధిక దుఃఖాకులాత్ముండు నగుచు పలికె
లక్ష్యపెట్టక నిందల లక్ష్మణుండు.

"అమ్మ! నమ్ము మీ భువనత్రయమ్ము లోన
రాము నెవరు గెలువలేరు రణము నందు
మనము విన్న రవంబు రామునిది కాదు;
వెడల నసురుల మాయికు విడిచి నిన్ను."

వనిత సీత క్రుద్ధ యగుచు పలుకసాగె
"పంపెనే మమ్ము వెంటాడ భరతు డిటులు?
నన్ను పొందెడు కాంక్షతో అన్న కీవు
కీడు సేతువె లక్ష్మణ! పాడుబుద్ధి.

వదినెవాక్యాల కమితకోపంబు నంది
"అతివలు చపలలు అధర్మమతులు జగతి
దేవతవు నిక్కముగ నాకు వేవిధాల
తిట్టగా జాలనమ్మ! వైదేహి! నిన్ను."

అనుచు ఆమెను రక్షింప వనములోని
దేవతాళిని ప్రార్థించి దీను డగుచు
మదిని లేకున్న ఇష్ట మేమాత్రమేని
కదలె నంత సౌమిత్రి అగ్రజుని జేర.

కావరమ్ముతో వేచిన రావణుండు
వేగ వచ్చెను భిక్షుకవేష మూని,
పర్ణశాలాంగణ స్థలి భర్త దలచు
సీతను విషణ్ణవదనను ప్రీతి గాంచె.

ఖలుడు దశకంఠు డుత్కటకౌతుకాన
తరుణి జానకీరమణి సౌందర్య మెల్ల
వర్ణన మొనర్చి "వనికేల వచ్చి తీవు
నీ వెవరి దాన" వంచు ప్రశ్నించె నెలమి.

అవనిజాత వాని కొసగి ఆసనమ్ము
అతిథిసత్కారము లొనర్చి యతిగ దలచి
తాను వచియించి స్వీయ వృత్తాంత మెల్ల
అడిగె నాతని గోత్రమ్ము నాహ్వయమ్ము.

అనియె వైదేహితో రాక్షసాధిపుండు
"లోకతతి కెల్ల నే నతిభీకరుండ
రావణుండ లంకాపురీ భూవరుండ
సుందరీ! ఉండు మీవు మన్మందిరాన.

నిజముగా భార్య వైనచో నీవు నాకు
ఇంతి! భార్యలం దగ్రమహిషి నొనర్తు
లీల నిను కొలుతు రయిదువేలమంది
హేమ భూషణాలంకృతభామ లెప్పుడు.

కోమలాంగి సీతపలికె కుపిత యగుచు
"శౌర్య వీర్య సంపన్నుడు ధైర్యశాలి
క్షితితలేశు సుతు డమోఘకీర్తిశాలి
సత్యసంధుడు శ్రీరామచంద్రమూర్తి.

సకలసద్గుణరాశి యశస్వి యతడు
అతడు జితేంద్రియుండు మహాత్ము డతడు;
పతిని సతతంబు కొలుచుట వ్రతము నాకు
క్షుద్రుడా! రాముసతి నన్ను కోరదగునె?"

ఉవిద సీత కొసంగె ప్రత్యుత్తరంబు
కుపితచిత్తుండు దైత్యుండు క్రూరు డతడు
"భరతునకు రాజ్యమిడి తండ్రి తరిమివేయ
వనులలో నుండె రాముండు మునులగూడి.

చాల డతడు నా కెందును సమరమందు
భర్తగా నే వలచుట నీ భాగ్యవశము
కాపురము సల్పి నీవు లంకాపురాన
తేలియాడుము దివ్యభోగాలలోన."

అనియె అతనితో పరుషవాక్యాల సీత
"సర్వరాక్షస భర్తగా చాటుకొనెదు
రావణా! నీకు జాతికి ప్రాణహాని
జరుగు శ్రీరామ భార్యాపహరణ కలన.

సౌమ్య భిక్షు రూపము వీడి క్షణములోన
ఘోరనిజరూపము ధరించి క్రూరు డగుచు
బాహుయుగళిని కుడిచేత బట్టి బలిమి
రథము నెక్కించె సీతను రావణుండు.

రావణుడు వినువీథి గోంపోవు చుండ
మూర్ఖు నతని దూషించి రాముని స్మరించి
మానినీ మణి సీత లక్ష్మణు దలంచి
భ్రాంతచిత్తయై సలిపె నాక్రందనమ్ము.

పూత గోదావరీ నదీమాత వేడి,
దైవతమ్ముల ప్రార్థించి, తరుల గిరుల
ఖగమృగాదుల కోరె శీఘ్రముగ రాజ
వరునకుం దెల్ప స్త్రీయాపహరణవార్త.

సీతకేక జటాయువు చెవిని సోక
వృక్షము పయి నిద్రించెడు పక్షిరాజు
దైత్యవరున కా కృత్య మధర్మ మనుచు
ఎరుగ జెప్పి స్వశక్తితో ఎదురుకొనియె.

పోరిలో రావణుండు కోల్పోయి రథము
అంకమున సీతతో చేరె నాకసమ్ము
వాడిముక్కుతో రెక్కలతోడ నంత
పంక్తిముఖుని పీడించెను పక్షిరాజు.

రాక్షసుడు దశకంఠుడు పక్షివిభుని
కాళ్లు రెక్కలు పార్శ్వాలు ఖడ్గమెత్తి
ఖండన మొనర్చి కూల్చెను భండనాన
చేతులను జటాయువు బట్టి సీత ఏడ్చె.

తనకు కలిగిన దుర్గతి తలచి సీత
రామచంద్రు నర్థించుచు రక్షణమ్ము
రోదనముసేయ దైత్యుడు ద్రోహచింత
వీడక మరల వినువీధి వెడల దొడగె.

రావణాంకము నందున్న రామపత్ని
భయముతోడ దుఃఖమ్ముతో పలికె నిట్లు
"చేసినాడవు విపరీతచేష్ట నీవు
కాన మృతి నీకు తప్పదు దానవేంద్ర!"

రోదసి నొనర్చు ఆమె ఆక్రోశమెల్ల
వ్యర్థ మయ్యెను, కాంచి కాపాడ డెవడు;
నగలమూటను విడిచె వానరులమధ్య
వారలైన భర్తకు చెప్పవచ్చు ననుచు.

అంకమున నున్న సీతతో లంకజేరి
అంతిపురిలోన రావణుం డామె నుంచి
సాయ మామె కే మాత్రము సలుపకుండ
ఆజ్ఞ చేసె నెవ్వరును మాటాడకుండ.

క్రూరరాక్షసు లెనమండ్రుగురను బిల్చి
రావణుడు చెప్పె వారి కర్తవ్య మిట్లు
రణములో హతుం డయ్యె మా భ్రాత ఖరుడు
రామచంద్రుని ఘోరశరాలచేత.

"దారుణ విరోధి రాముని పోరిలోన
మనము హతమార్చు విధమెల్ల ఘనులు మీరు
ఆ జన స్థానవాసులై అరయ వలయు
ఎరుక పరుపంగ వలయు ఆ సరణి నాకు."

కచ్చితముగ దైత్యుం డెంచి కార్యసిద్ధి
పుడమిపుత్త్రిని దుఃఖాశ్రుపూర్ణముఖిని
బలిమి గొనిపోయి దేవభవనము బోలు
తనదు గృహమును జూపించి అనియె నిట్లు.

"తిన్నగా వినుమిదె! లేడు నన్ను బోలు
భీకరుడు బలశాలి ఏ లోకమందు
సీత! భర్తగా నన్ను భజించి నీవు
పొందు మెల్ల సుఖమ్ము లీ పురమునందు.

రాముని౦ జేసు నీ మనోరథము దీర్ప
ఇచటి కేతేర తరముగా దెవ్వరికిని
పరమరమణీయమైన పుష్పకమునందు
స్వేచ్ఛగా విహరింతము సీత! మనము."

అనియె నంతట దీనురాలైన సీత
"సత్యసంధుడు ఘనుడు దశరథవిభుని
ఆత్మజాతుండు పరమధర్మాత్ముడైన
కోమలాంగుని రాముని కొలుచుదాన.

నన్ను పతినుండి విడదీసి నాశనంబు
కోరి అజ్ఞుడవై తెచ్చుకొంటి వీవు
మరల నిచటికి విభుడు లక్ష్మణునితోడ
వచ్చి రణమున నిను పొరిపుచ్చ గలడు.

అలరు నా ఆత్మ స్వాధీన మగుచు నాకు
నీచ! అవమాన మించుక నేనుపైప
అసువులందు దేహమునందు ఆశలేదు
తినగవచ్చు రాక్షసులు నాతనువు నీవు."

రక్తనేత్రుడై క్రూరుడు రావణుండు
శోకనిర్మగ్న నామె నశోకవనికి
దైత్యవనితలతో పంపె తగినరీతి
తనకు వశురాలు చేయు బోధనలు సలుప.

ప్రాణములు విడనాడుచు బాణహతికి
నీచుడగు రాక్షసుండు మారీచు డపుడు
దారుణంబుగ అరచిన తీరు దలచి
సంశయుంబందె శ్రీరామచంద్రమూర్తి.

పర్ణశాలకు రాముడు వచ్చుచుండ
ఖగమృగమ్ములు మిక్కిలి బెగడు వడుచు
తిరుగుచుండె నాతని చుట్టు దీనగతిని
దారిలో ఎన్నొ దుర్నిమిత్తములు తోచె.

కీడు వైదేహి కేదియో మూడె ననుచు
చింతతో వచ్చు చుండంగ శీఘ్రగతిని
ఘనవిషణ్ణుడు సౌమిత్రి కానరాగ
పరుషముగ మధురమ్ముగ పలికె విభుడు.

"చూడు లక్ష్మణా! ఒంటిగా శూన్యవనిని
మైథిలిని వీడి వచ్చుట మంచిపనియె
అఖిలదుఃఖాకరంబగు అడవి జేరి
ఆమె దుష్కర కార్యంబు నాచరించె.

శ్లాఘ్యచరిత పరమసాధ్వి జనకజాత
ఆమె ప్రాణాలకంటె ప్రియతమ నాకు;
అడవిలో సీత నట్టులు విడిచి వచ్చి
సందొసంగితి వీవు కష్టాలకెల్ల."

ఆశ్రమాన దిగులుతో భయమ్ముతోడ
కాంతకొరకు వెదకి ఆమె గానలేక
నీరసించి లక్ష్మణుని ప్రశ్నించె నిట్లు
"సీత నటు వీడి చనుదేర హేతువేమి?"

తీవ్రముగ విషాదమ్ము వేధింప మదిని
భ్రాతతో వచించె సుమిత్రసూతి యిట్లు
"అయ్యో! సీత! లక్ష్మణ! అను ఆర్తరవము
నిజముగా నెంచె వైదేహి నీ దటంచు."

విహ్వాలతతో భయంబుతో వెడలు మనుచు
శతవిధమ్ముల సీత దూషణము చేసె"
"కారణం బేది యైనను గాని నీవు
ఆజ్ఞ మీరకూడదు కద!" అనియె అన్న.

ఎంత వెదకిన కనరాక ఇంతిజాడ
చింత మునిగిన రఘువంశశేఖరుండు
పర్ణశాలా పరిసరాల పరుగు లెత్తి
జాలి గదురంగ విలపింపసాగె నిట్లు.

"కడిమిరో! సీత నెందైన కాంచి నావె?
తిలక వృక్షమ! సతిజాడ తెలుప గలవె?
కకుభమా! చూచితే నాదు కాంత నెందు
బిల్వ! సీత జీవించియే వెలయు గాదె?"

కానవచ్చిన వివిధవృక్షాల గాక
లతల జంతువుల నడిగి మతి చెదరగ
గిరుల వనుల నదుల దరి తిరుగ దొడగె
రామచంద్రుడు సీత దర్శనము కోరి.

విహ్వలాంగుడు రాముడు వివశు డనియె
"సీత గనరామి చేరంగ దివము నేను
వ్యర్థ మొనరించి నాడ శపథ మటంచు
దశరథుడు నిరసించును తప్పకుండ."

సుందరాంగి నెలతసీత ఎందుకూడ
కానవందున మూర్ఛలో క్షణము మునుగ
అన్న నోదార్చె సౌమిత్రి ఎన్ని గతుల;
రాము డేడ్చె దుఃఖమ్ముతో రమణి కొరకు.

మొదట సౌమిత్రి పిదప రాముండు కూడ
పూత గోదావరీ నదీమాత నడుగ
నంతయును చెప్పదా నది; అంతలోన
జంతువులు రాము జూచెను వింతరీతి.

అన్నదమ్ములు మృగముల ననుసరింప
నేలపై కాన వచ్చెను పూలు కొన్ని
పెద్ద పాదాల గురుతులు, పిదప సీత
అడుగు జాడలు, శిథిలమై పడిన రథము.

భవ్యముక్తామణీ మయంబు భగ్నధనువు
రమ్యతూణ శకలములు రాము డరసి
భామినీ దర్శనాకాంక్ష బడలిపోయి
భ్రాతగని విలపించెను రాము డిట్లు.

"సౌమ్య! కామరూపులగు రాక్షసులు పట్టి
గిట్ట జేసిరో, చేసిరో ఎట్టి హాని
తినిరొ జానకి లేక బంధించినారొ?
రాక్షసులతోడ కలిగె వైరమ్ము నాకు.

వనిత నెవ్వడు కూడ కాపాడ లేడ
ఆమె అపహృత మఱి మృతయైన గాని
సురలు నాకు మర్యాదగా చూపరేని
సర్వమును ధ్వంస మొనరింతు క్షణములోన."

దీను డగుచు లక్ష్మణుడు ప్రార్థించె నంత
"రామ! భూతాలకెల్ల శరణము నీవె
అరయ అనవరతము నీవె పరమగతియు
కాన చేయుదు సీతకు హాని యెవడు.

దశరథుడు పొందె నిను ఘనతపము చేసి
బద్ధుడై నీ గుణాల దేవత్వమందె
సంభవించిన వ్యథ నీవె సైపకున్న
ఆపదలను సామాన్యులు సైపగలరె?

కలిగె దుఃఖ మటంచు జగాల నెల్ల
స్వీయతేజాన భస్మము చేయదగదు
జ్ఞానబోధ నొనర్చితి మానకిట్లు
రామ! నే నెరుంగుదు నీ పరాక్రమంబు.

రాము డా సుభాషితము సారము గ్రహించి
ఎద విజృంభించు కోపమ్ము పదిలపరచి
ధనువు చిత్రముగా పట్టి తమ్ముతోడ
వెదుక సాగె తీవ్రశరమ్ము వింటగూర్చి.

దారిలోన జటాయువు తనకు తోచి
అవనిజాతను రావణుం డపహరింప
ఘోరముగ తాను పోరిన తీరు తెలుప
అతని కౌగిలించెను రాము డార్తు డగుచు.

"సతిని పొందెద వీవు రాక్షసుల జంపి"
అని పలికి పక్షి మడియంగ, పరమపురుషు
డగ్ని సంస్కార మొనరింప అమితభక్తి
పొందెను జటాయువు నితాంతపుణ్యగతిని.

చిత్తము ద్రవింప వెదకుచు సీత కొరకు
బహుళ పక్షి మృగ వ్యాళ భరితమైన
దుర్గమారణ్య సీమలో మార్గ మందు
వారు కనిరొక్క మొండెమ్ము దారుణమ్ము.

భ్రాజిలు కరాల పొడ వొకయోజనమ్ము
శిరము కంఠము లేక ఉదరమె కలిగి
రాక్షసుడు మహాకాయ విరాజితుండు
తనదు బాహులబట్టె రాట్తనయ యుగళి.

రాజసుతులు కబంధుకరాలు తునిమి
తనువు నొకచోట వైచి దహనము చేయ
అతడు చితినుండి ఉజ్జ్వల స్థితిని లేచి
కాంతు లొలుకుచు ఎగిరె ఆకసము పైకి.

పలికె నిట్లు కబంధు డంబరము నుండి
"వరలు రమ్య పంపాసరోవరము దరిని
ఋశ్యమూక నామకము గిరిని వసించు
వానరుండు, సుగ్రీవాభిధాను డతడు.

ధీవిశాలుడు నయశీలి దివ్యతనుడు
సత్యసంధుడు మేధావి సాయపడును
సీత వెదకుటలో మీకు భూతలాన
చేరుకొమ్ము సుగ్రీవుని శీఘ్రగతిని.

వాలి తన తమ్ము సుగ్రీవు ద్రోల నవల
భయముతో నాతడు చరించు పంపదరిని
అయుధాగ్ని సాక్షిగ నీవు చేయ మైత్రి
సీత నెటులైన నీదరి జేర్ప గలడు."

చేర పంపాసరస్సును దారిచెప్పి
"నందనమును హసించు వనమ్ము నందు
ఫలములు భుజించి పుష్పమ్ము లరయ కలుగు
ముద మటంచు కబంధుడు కదలిపోయె.

నడచి వెడలుచు శైలవనాలు దాటి
పంప పడమటి దరి నింపు సొంపు గూర్చు
ఆశ్రమంబును దర్శింప నచట శబరి
రామలక్ష్మణులను గాంచి వ్రాలె కాళ్ల."

అతిథిమర్యాదల నొనర్చి అమితభక్తి
కుశల మడిగిన ఇక్ష్వాకుకులజుతోడ
శ్రమణి సంశితవ్రతయైన శబరి పలికె
"ధన్యురాలైతి భవదీయ దర్శనాన.

దేవవర! నా వ్రతంబు సిద్ధించె నేడు
స్వర్గము వడయబోదు నీ సౌమ్యదృష్టి
సాటి లేనట్టి నీదు ప్రసాద మహిమ
కాంతు అక్షయ పుణ్యలోకమ్ము లిపుడె.

నేను సేవించు దివ్యులు మౌనివరులు
చిత్రకూటనగం బీవు చేరినపుడె
నీకు నాతిథ్య మొనరింప నాకు కలుగు
సద్గతి యటంచు నేగిరి స్వర్గమునకు.

మివుల వన్య పదార్థాలు మీకు గూర్చి
వేయి కన్నులతో దేవ! వేచియుంటి"
నని మతంగా శ్రమ మటంచు జనము పిలుచు
చోటు శోభను మహిమను చూపె నామె.

శబరి! భక్తి పూజలు నాకు సలిపినావు
ఏగవచ్చు సద్గతికి నిజేచ్ఛ నీవు"
అని వచింప రాముదు వృద్ధ అగ్ని దూకి
కాంతి జిమ్ముచు ఊర్ధ్వ లోకముల కరిగె.

అమిత సీతాపహరణార్తి నందియున్న
సోదరు లపుడు సుగ్రీవు సూర్యసూతి
తలచి వనముల సరసుల దాటుకొనుచు
వరలు దివ్య పంపాసరోవరము కనిరి.

సతిని గానక దీనుడై సర్వగతుల
వివిధ పాదప బహులతా విలసితమ్ము
పావనంబగు పంపాసరోవరాన
స్నానమాడె రాముడు మనశ్శాంతి కొరకు.

* * *

# కిష్కింధకాండము

పరమరమణీయమైన పంపాసరస్సు
సౌమ్య! బహువిధ మృగ పక్షి సంకులంబు
తమ్ముడా! సుందర సుమాల తరులు లతలు
శోభ లీన, వసంతుడు క్షోభపెట్టు.

వేచుచున్నాడు కాముడు వివిధగతుల
శోకమగ్నుడ కానక సుదతి సీత
బ్రతికి యున్నను భువి మీద ఫలము కలదె!
భ్రాత! నీవు సుఖింపుము భరతు జేరి.

ధీరుడగు రాముడు వచింప దీను భంగి
అతిహితముగ యుక్తంబుగ, అనుజు డనియె
"చింత మాని మది పరిత్యజింపు మీవు
కామ భావన; భద్రమ్ము కలుగు రామ!

కార్యదక్షుడు వీడడు ధైర్య మెపుడు
రామ! సుకృతాత్మ! మరచితివే మహాత్మ!
నిన్ను నీవె; రావణ డెక్కడున్న కూల్తు
సీత నీ కాళ్ల చెంతకు చేర్చుడేని."

తమ్ముడగు లక్ష్మణుండు హితమ్ము గూర్ప
సదృశబలులు నల్వురు సహచరులతోడ
కాపురంబుండు సుగ్రీవు కాంచ దలచి
రాముడు పురోగమించెను రయము మీర.

వాలిభీతి వర్తిల్లెడు వానరుండు
ఋశ్యమూక నగమున సుగ్రీవు డతడు
రామలక్ష్మణుల గని దూరమ్మునుండి
వేగముగ దూకె భీతితో వివిధగిరుల.

చింత మునిగిన సుగ్రీవు చెంత చేరి
ఆతని విషాదవేదన నణచి వేసి
పావని బయలుదేరెను ప్రభువునాజ్ఞ
రాఘవుల రాకకు గల కారణము నెరుగ.

వానరు డతండు భిక్షురూపమ్ము దాల్చి
తోయజాక్షుల గాంచి విధేయు డగుచు
"అర్కపుత్రుండు ధర్మవిఖ్యాతుడైన
వానరపతి సుగ్రీవుడు పంపె నన్ను.

ఖడ్గ కార్ముక పాణులు క్షాత్ర మొప్ప
శౌర్య గాంభీర్య ధైర్య సౌందర్యయుతులు
దివ్య తేజో విరాజిత భవ్యతనులు
క్షితిధరంబును భాసిల్ల జేయు మీరు.

ఎవరు మీరలు? విచ్చేయ హేతువేమి?
కామరూపుండను హనుమ న్నామధరుడ;
మైత్రి మీతోడ వాంఛించు మా విభుండు
కాన నా రాక" అని పల్కె గాడ్పుపట్టి.

భ్రాతయనుమతి సౌమిత్రి ప్రీతితోడ
వాక్యకోవిదు నారసి పలికె నిటులు
"విదితమే మాకు సుగ్రీవు విషయమెల్ల
ఆదరింతుము నీదు వాక్యాలు సచివ!"

ఆంజనేయుడు వీరి సఖ్యంబు కతన
జయము నందు సుగ్రీవుడు సర్వలబ్ధి
అని మది దలంచి, వారలు వనికి వచ్చు
కారణంబును రాముని గాంచి అడిగె.

సంగ్రహంబుగ శ్రీరామచంద్రు చరిత
చెప్పి అపహృతయైన ఆసీత వెదుక
వానరేంద్రుని సాయంబు పడయ వచ్చె
రాము డని పల్కె లక్ష్మణస్వామి యపుడు.

పవనపుత్రుడు రాజ్యవిభ్రష్టుడైన
సూర్యసుతుని సుగ్రీవుని భార్య నన్న
వాలి అపహరించె; తనదు బలముతోడ
అతడు సాయమ్ము సలుపు మీ"కని వచించె.

స్వ స్వరూపము ధరియించి వాయుసుతుడు
మిక్కిలిగ సంతసించి నెమ్మేను పెంచి
స్కంధముల సోదరుల దాల్చి చనియె నంత
మహితమగు ఋశ్యమూకస్థ మలయగిరికి.

పలికె నచట సుగ్రీవుతో పవనసుతుడు
"సఖ్య మొనరింప నీతో దశరథసుతుడు
రామచంద్రుడు బాహువిక్రముడు వచ్చె
సత్యకాముడు సౌమిత్రి సంయుతుండు.

వాలి పంపగ చంపగ వచ్చి రనెడు
భయము వీడి సుగ్రీవుడు పలికె నిటులు
"చెలిమి నాతోడ సలుప వాంఛింప నీవు
ప్లవగునకు నాకు శ్రీరామ! భాగ్యమబ్బె!"

రాముడు విని సంతోష పరవశు డగుచు
తన కరాన సుగ్రీవు హస్తంబు పట్టి
హత్తుకొని గుండె; కావల నగ్నిసాక్షి
మైత్రి నందిరి వారలు మహితభంగి.

రామచంద్రుని పరమధర్మజ్ఞు నరసి
"నేను హృతభార్యుడను వైరమూనె వాలి
కావు మీ" వని వేడ సుగ్రీవు డంత
"వాలి గూల్చెద" నని రామభద్రు డనియె.

రాము నిక్ష్వాకువంశవర్ధనుని గాంచి
అనియె సుగ్రీవు డుచితవాక్యాల నిట్లు
"హనుమ వచియించె సీతాపహరణగాథ
ఆమె ఎటనున్న తెచ్చి నీ కప్పగింతు.

రావణుడు కొనిచనుచుండ రామ రామ
లక్ష్మణా యను సీతా విలాప మేను
వింటి; ఆమెను కన్నారగంటి రామ!
ముగుద విడిచె ఆభరణాల మూట ఇదిగొ."

అతివ జానకి ఉత్తరీయంపు చెంగు
చించి కట్టిన మూట చూపించె నతడు
పచ్చగడ్డిపై పుడమిని పడిన నగలు
చెక్కుచెదర లేదంచు వచించె అన్న.

"వ్రాలి మ్రొక్కుట చేత పాదాల నున్న
అందియలు దక్క ఒడలిపై ఆమె తాల్చు
ఇతర భూషణంబులను నే నెరుగ" ననుచు
అన్నయగు రామవిభునితో అనుజు డనియె.

బాష్పనేత్రుని రాముని ప్రాంజలించి
పలికె కపిరాజు సఖుడుగా తెలుపుచుంటి
ఓర్చుకొనుచుంటి భార్యావియోగ బాధ
కాని ధైర్యము వీడను నే నొకింత.

రావణు వధించు సుకరమార్గమ్ము జూతు
పూరుషోత్తమా! ధైర్యము పూనుమయ్య"
"రాము డనె నంత నీదు కార్యంబు తీరు
ప్రతిన బూనితి నిజముగా వాలి జంప."

శ్రేయమగు నంచు భావించి వేయిగతుల
రామవిభుని సుగ్రీవుడు ప్రస్తుతించి
వాలి వీర్య ధైర్యంబులు పౌరుషంబు
చెప్పె భావికార్యంబును చేయ నిటులు.

"కలుగవలె గాక కినుక జగాల నెల్ల
దాశరథి! చేయగలవయ్య నాశనమ్ము;
తెల్లవారకయే వాలి తీర్చి వచ్చు
సర్వ దిక్సాగరాలలో స్నానవిధులు.

శైల శృంగాగ్రముల నెక్కు శ్రమము లేక
బంతులను వోలె విసరును పర్వతాలు
ఎట్టి భూమీజముల నేని ఇట్టె విఱుచు
అతని భుజశక్తి వర్ణింప అద్భుతమ్ము.

రాక్షసుండు ధూర్తుండు వీర్యవరగర్వి
మహిషరూపుండు దుందుభి, మహితబలుని
సాగరుని కోర సమరమ్ము, జలధి తెలిపె
"సముదు హిమవంతు కడకీవు చను" మటంచు.

వేగమే చేరి హిమగిరి శ్వేతశిలల
కొమ్ములం గ్రుమ్మి గర్జించు క్రూరు నరసి
స్వీయశిఖరమ్ము పైనుండి చెప్పె నతడు
పోరు కిష్కింధలో వాలి గోరు మనుచు.

అంత దుందుభి కిష్కింధ నంతిపురిని
కడు భయంకర తీక్ష్ణ శృంగాలతోడ
ద్వారమును గూల్చి దారుణ ధ్వనులు చేయ
వనితలంగూడి వచ్చిన వాలి కాంచె.

"వాలి! నీవు కామోపభోగాలు పొంది
కనుము కడసారి కిష్కింధ తనివితీర"
అనగ దుందుభి, కపిరాజు కినుక బూని
ఉద్ధతుండయి యుద్ధసన్నద్ధు డయ్యె.

క్రోధసంరంభు లిరువురు ఘోరభంగి
పోరు సాగింప దుందుభి నీరసిల్లె;
వాలి అతడు చావగ నేల గూల వేసి
విసరె వాని కాయమ్మును వింతరీతి.

చింద దుందుభి పృథు రక్త బిందు తతులు
తనదు ఆశ్రమ స్థలిని, మతంగమౌని
"వాలి ఋశ్యమూకగిరిని కాలు పెట్ట
ప్రాణములు వీడు" ననుచు శాపంబు నొసగె.

సంగరంబులలో శౌర్యశాలి వాలి
ఓటమిని పొందగా లేదు నేటివరకు
ఆశ్రయించితి ఋశ్యమూకాద్రి రామ!
నీదు శౌర్యంబు నెరుగ మన్నింపుమయ్య!"

తన బలమ్ము కపివిభుడు కనెదురీతి
అచట పడియున్న దుందుభి అస్థి గూడు
కాలివ్రేలితో రాముడు లీల మీట
అద్ది పదియామడల దూరమందు పడియె.

చాపనిర్ముక్త మౌ ఒక శరముచేత
సప్తసాలములను గూల్చె క్షణములోన,
బెంగవీడి సుగ్రీవుడు ప్రీతినంది
భ్రాత వాలిని జంపంగ రాము వేడె.

భ్రాతతో హనుమంతుతో బయలుదేరి
దాశరథి ధార్మికుండు కోదండధారి
అతులశౌర్యుడు వాలిపాలితపురమ్ము
చేరె కిష్కింధ కపిరాజు దారి చూప.

వృక్షముల మాటునను దాగి వేడ్కనంపె
రాఘవుండు సుగ్రీవుని రణ మొనర్ప
కోరి పోరాడి అన్నతో కొంతసేపు
పారిపోయె సుగ్రీవుడు భగ్ను డగుచు.

కాంచ రాముండు ఋశ్యమూకంబు నందు
ఖిన్నుడును దీనుడైన సుగ్రీవు డనియె
"రామ! చూపి అవక్ర పరాక్రమంబు
ఊరకుంటివి ధర్మమా పోరిలోన?"

రాముడు పలికె అతని ఆగ్రహము తొలగ
"రూపతుల్యులు మీర లిరువురు తలప
బాణము విడువ నైతిని వాలి జంప
గురుతు నెరుగమి పొరపాటు జరుగు" నంచు.

తమ్మునకు జెప్పి ఏన్గుపూదండ తోడ
గ్రీవ శోభితుగాగ సుగ్రీవు జేసె,
ప్రతిన నెరవేర్తునని చెప్పి రామవిభుడు
మరల పంపెను వాలిని మారుకొనగ.

ఘోషపెట్టె సుగ్రీవుడు ఘోర సరణి
రోష మందిన వాలి విరోధి దునుమ
భీషణరణోన్ముఖుం డయ్యె ప్రియము నరసి
భాషణ మొనర్చె నిట్టులు భార్య తార.

"తనదు తను వెల్ల రక్తసిక్తంబు కాగ
కాయమున గాయములతో పలాయనమ్ము
చిత్తగించి సుగ్రీవుడు సిద్ధపడియె
యుద్ధమునకు, సలుప దగు యోచనమ్ము.

చెప్ప నాప్తులు చారులు చెవులబడియె
రాము డతుల పరాక్రమ భ్రాజితుండు
అతని తమ్ముడు అగ్రజు నంతవాడు
వచ్చినారంట సుగ్రీవు పక్షమూని.

కనికరింపుము సుగ్రీవు ననుజు నింక
చేరగా దీసి యువరాజు చేయుమయ్య
సంతసింపగ రామలక్ష్మణులు నాథ!
మహితు లంతటి వారితో మైత్రి మేలు."

"భ్రాత కాదు నా కాతడు పరమవైరి
ఎట్లు సైతు సుగ్రీవుని హీన గుణుని?
కదనరంగంబులో వాని మద మడంచి
విదుతు నసువులతో" నని నుడివె వాలి.

వాలి సుగ్రీవు లన్యోన్య వైరబుద్ధి
దారుణ రణంబు సలిపెదు తరుణ మంద
రాము నిర్ముక్త తీక్ష్ణ శరంబు వెడలి
వాలి వక్షః స్థలంబును వ్రచ్చి వైచె.

ఇంద్రదత్తంబు ధరియింప హేమమాల
నేల గూలియు పటు శౌర్యశాలి వాలి
వీడడయ్యె ప్రాణాలను, విక్రమంబు
తరుగదయ్యె తేజంబు చిత్ర మ్మదేమొ!

కరుణ గలవాని రాముని గాంచి వాలి
పలికెనిట్లు "మీరలు ధర్మపరు లటంచు
రామ! వింటి నీ వంశ మర్యాద లెల్ల
ఏమి సాధించితివి వధియించి నన్ను?

మెలత వారించె; నీవు ధార్మికుడ వంచు
కీడు నే మాత్ర మేని శంకింప నైతి;
రామ! నీకును నాకు వైరమ్ము కలదె?
చెట్ల మాటున దాగి కూల్చితివి నన్ను.

రిపుని రావణు జంప సుగ్రీవ మైత్రి
కారణం బొక్కొ? నను గూల్చ గారవంబె?
ఘాతుకము దీని కెవరేని హేతువడుగ
ఉచితగతి నీయ గలవె ప్రత్యుత్తరంబు?

పరుషముగ తీవ్రముగ వాలి పలుక చెప్పె
ఇట్లు రాముండు ధర్మసహితము హితము
తరతరాలుగ వాంఛించి ధర్మవృద్ధి
మా ఇనకులంబు వెలయు భూమండలమున.

తమ్ముసతి గూడి ధర్మము తప్పినావు
కాముకతయే దురాత్మ! ముఖ్యమ్ము నీకు
సతికొరకు రాజ్యముకొరకు సఖ్యమంది
ప్రతిన బూని మరచుట ధర్మంబె నాకు?

శాస్త్ర విహితంబు మిత్రుని శత్రువు వధ
జంతువుల దాగి చంప దోషంబు లేదు;
నరులుగా సంచరింతురు సురలు భువిని
ధర్మమును నిల్ప; దూషింప తగదు నన్ను.

ఆత్మలోన పశ్చాత్తాపమంది పలికె
వాలి రామవిభునితో కరాలు మోడ్చి
"పరమధర్మజ్ఞ! పలికితి పరుష సరణి
నిండుదయతోడ నన్ను మన్నింప వలయు.

అభము శుభ మెరుగని సుతు డంగదుండు
కావు మాతని నీవు సుగ్రీవు బోలె;
దయను జూపించి నాభార్య తార గనుము
కీడు తలపెట్టకుండ సుగ్రీవు డెపుడు.

సామ వచనాల నిట్లు శ్రీరాము డనియె
"వాలి! ప్రారబ్ధ కర్మము పాయ దెపుడు
అనుభవింపక పరితాప మంద వలదు
శిక్ష పొందిన కతన నశించె నఘము.

పుణ్య మబ్బెను నీకు; నీ పుత్రుడైన
అంగదుని గాంచు సుగ్రీవు డాదరమున
అట్లె వర్తించు నతనితో అంగదుండు
భక్తిమీర భజింతురు వారు నన్ను.

దయితు దారుణమృతి వార్త తార ఎరిగి
వాలి కూలిన చోటికి వచ్చె నంత
పరమవీరుండు కోదండపాణి నరసి
పారిపోయెదు కపులతో పలికె నామె.

"వాలి పడిపోవ మీర లెవ్వారి శరణు
చొరగ పరుగులు తీయుట? పరమ భీతి"
అంగదకుమారు ననుచరులైన కపులు
కామరూపులు వచియించి రామె గాంచి.

వాలియంతటి బలశాలి నేల గూల
పురము నలముట సహజము భూరిభీతి
ఆక్రమింప అరికపీశు లక్రమాలు
చెలగు; అంగదు రాజుగా చేయు మిపుడె.

అసమ వానరలోక వీరాగ్రగణ్యు
పతిని గోల్పోతి; సుతునితో పనియె నాకు?"
అని వచించి మహాశోక మంది ఆమె
పతితనువు కౌగిటంబట్టి పరితపించె.

తార సాధ్వి విశుద్ధసత్త్వ పరితాప
మగ్నయై భ్రాంత చిత్తయై మరల మరల
మూర్ఛ మునుగుచు తేరి వాపోయె నిట్లు
టికనేలను పడియున్న కాంతు గాంచి.

"వానరేశ్వర! ఎరుగ వపజయ మెపుడు
చెవుల నిడవైతి వేను వచించు నుడులు
చొప్పడ వికి మే మందిన శుభ సుఖాలు"
తీసికొనగ ప్రాణము లామె దీక్షబూనె.

ఖిన్ను డయ్యె వారలను సుగ్రీవు డరసి
ప్రక్క నిలిచె సౌమిత్రితో రామవిభుడు;
ఊరడించెను హనుమంతు డువిదగాంచి
"శోక మందగ తగదమ్మ సుదతి! నీకు

మానవులు తా మొనర్చు కర్మముల బట్టి
పుణ్యపాప ఫలమ్ములు పొందు చుంద్రు;
జగతి నెవ్వని దేహంబు శాశ్వతంబు?
సత్కృతులు సల్ప కాంతురు జనులు మేలు.

వాలి కిప్పుడు ప్రేతకృత్యాలు జరుప
అంగదున కాజ్ఞ నొసగుమో అతివమిన్న!
చింతవిడనాడి కపికులశ్రేయ మెంచి
పట్టభద్రు కావింపుము వాలిసుతుని.

శ్రద్ధగా అనింద్యగుణ ప్రశస్త తార
ఆలకించి పలికె నిట్టు లతనితోడ
"వీరుడగు వాలితో పోయె విభవ మెల్ల
భారమెల్ల సుగ్రీవుపై బడియె నిపుడు."

వాలి నయనాలలోన ప్రాణాలు నిలిపి
వివరిదశను సుగ్రీవుతో చెప్పె నిటులు;
పిలిచి నిజసమీపమునకు ప్రేమమీర
"అంగదుడు పంచమప్రాణ మగును నాకు.

అరయగా అన్నదమ్ముల మయ్యు మనము
విధివిలాసాన కలసి జీవింప లేదు;
అనుజ! సుగ్రీవ! ఇతడు నా కౌరసుండు
ప్రాణసము డంగదుండు; కాపాడు మితని.

తార సూక్ష్మార్థము లెరుంగు ధర్మమందు
ఈమె కీడును ముందె గ్రహించి చెప్ప
అనఘుడగు రాముకార్యంబు నాచరింప
అఖిల సుఖముల శుభముల నందగలవు.

ఇదిగో దివ్యకాంతిమయంబు హేమమాల
కంఠమున దాల్పు మిప్పుడె; కాంతి వీడు
నేను మరణింప" అని పల్కి దాని నొసగ
దీను డగుచు సుగ్రీవుడు తీసికొనియె.

కాంచి సుతు నతుల కనకాంగదుని వాలి
"కాలగతి నెరింగి సహనశీలి వగుచు
కొలువు మీవు సుగ్రీవుని, కూర్మి నతడు
మంచిచెడ్డల నరసి రక్షించు" ననియె.

ప్రాణములు వీడగా వాలి బాణహతుడు
అకట! కిష్కింధ యెల్ల శూన్యముగ తోచె
కరము కాంతివిహీనులై కపులు చేరి
ఎవరు మా కిక దిక్కని ఏడ్చిరంత.

పరమదుఃఖభరిత తార పలికె నిట్లు
"వీరమరణ మీవు కనంగ విధివిధాన
దారుణంబగు రీతి వైధవ్యమంది
సాత్త్వికాభిజన ప్రియ! చావనైతి."

మతి చెడిన కాంత విలపింప మృతుని దరిని
రవిసుతుండు సుగ్రీవుడు ప్రథితయశుని
సర్వలక్షణు శ్రీరామచంద్రు గాంచి
చెప్పె నమితవ్యథాకుల చిత్తు డగుచు.

దేవ! భవదీయ సత్యప్రతిజ్ఞ కతన
కలిగె నున్నతరాజ్యభోగాలు నాకు
కాని మా అన్న మరణమ్ము కలుగ జేసె
దుఃఖ మాత్మకు నయ్యది దుర్భరంబు.

మేలు చేకూర దీరాజ్య మేల నాకు
ఘోరతరమైన పగయును క్రోధమూని
హేతు వైతి కూలగ వాలి భూతలాన
దుష్టుడను కంటె దుస్సహదుఃఖబాధ.

అరయ నత డనిందితుడు మహాగుణుండు
భ్రాతృవధకు పూనక నన్ను పట్టి విడిచె;
అనుమతింపుము మరణింతు నగ్ని జొచ్చి
సీతను వెదుక వానరవ్రాత మేగు."

రామచంద్రుడు సుగుణాభిరాము డంత
సాంత్వనములు వచించి విషాదమందు
తార నూరడింపగ చెంత జేర ఆమె
నేరిమిని పల్కె; ఓరిమి నిస్తులంబు.

"ప్రవిమల వర బాణాసన బాణపాణి!
తాల్చి దివ్య సుందరమగు తనువు నీవు
శిష్ట రక్షణంబును దుష్ట శిక్షణంబు
సలిపెదవు; మహత్త్వంబన్న కలదె వేరు?

పతివియోగజనితదుఃఖ భారమేను
ఇనకులాంబుధిసోమ! వహింపజాల;
కరుణ దొలకంగ నను గూల్చి శరముతోడ
శీఘ్రముగ పతి చెంతకు జేర్చుమయ్య!

విదితమే నీకు శ్రీరామ! విరహబాధ
దేవ! దోషముకాదు వధింప నన్ను
దార దానము మేలు; వేదాలు తెలుపు;
వీరు జంపిన దోషంబు వెడలు నీకు."

వీర సతిని తారను రాము దూరడించె
"కనగ సృష్టించె ధాత లోకాలనెల్ల
ప్రాణుల సుఖము దుఃఖమ్ము బ్రహ్మవశము
ముదము గాంచుము రాజ్య మంగదుడు చేయు."

రాముడు వచించె నచటి వారలను గాంచి
"కాల మేతేర వాలి స్వర్గస్థు డయ్యె
మృతునకు మనదు శోకమ్ము మేలుకాదు
చేయుగా ప్రేతకార్యమ్ము శ్రేష్ఠ మింక.

పరమదుఃఖభరాన వానరగణమ్ము
జరిపె దహనసంస్కారము శాస్త్రవిధిని
ప్రథితు లక్ష్మణాన్వితు రఘురాము నరసి
అంజనాపుత్రు డనె భక్తి నంజలించి.

"దేవ! నీ దయచేత సుగ్రీవు డిపుడు
వానరుల రాజ్య మేలెడు భాగ్యమందె,
బహువిధోద్యాన సౌందర్య భాసురమ్ము
రామచంద్ర! కిష్కింధకు రమ్ము కరుణ."

క్షోణి విభుడు రాముండు సుశ్లోకు డనియె
పితృవచన పాలనాదృఢ వ్రతుడ నైతి
గడువు పదునాలుగబ్దాలు గడచువరకు
చొర దలంప గ్రామము కాని, పురము కాని.

సుందరంబగు కిష్కింధ జొచ్చి మీరు
శీఘ్ర మభిషిక్తు సుగ్రీవు జేయు డనుచు
వీరు సుగ్రీవు కనుగొని వేదవేత్త
సకలధర్మవిదుడు రామచంద్రు డనియె.

"అంగదుని నిల్పు యౌవరాజ్యంబు నందు;
వానకారు యుద్ధమునకు పనికిరాదు
స్వీయకపిరాజ్యపదవిని స్వీకరించి
నాల్గునెల లేగ చనుదెమ్ము నన్ను చూడ."

రమ్యమైన కిష్కింధకు రామునాజ్ఞ
అరిగి హర్షాన వెంట వానరులు రాగ
వేడ్కలొదవ సుగ్రీవుడు విభుత దాల్చి
అంగదుని జేసె యౌవరాజ్యాభిషిక్తు.

ప్రస్రవణ మను గిరిశిఖరమ్మునందు
రమ్యతరమైన గుహలోన రాము డుండె;
బహువిధంబులు సెలయేళ్ళు పక్షితతులు
సరసలతలు వృక్షంబులు వరలు నచట.

శైలశిఖరాన వెలయు విశాలగుహను
కాపురం బుండియును గూడ కలుగదయ్యె
రామునకు సుదుఃఖితునకు రాత్రులందు
సీత జ్ఞప్తికి వచ్చుటచేత సుఖము.

అగ్రజుని గని లక్ష్మణుం డనియె నిట్లు
"ధర్మ పరత నధికుడవు కర్మఠుడవు
రావణుడు లెక్కయే నీకు రణములోన
తీవ్రదుఃఖము తగదు సాధింప జయము?

త్వరితగతి శరత్కాలము వచ్చినంత
దక్షుడవు నీవు తీవ్రయత్నమ్ము సలిపి
పడయ గలవు జానకిని రావణుని దునిమి
రామ! మేలుకొల్పుచు నీ పరాక్రమమ్ము."

సంతసము కలిగింప ఆ సరసవాక్కు
రాముడు వచియించె శుభకరంబు హితము
"తమ్ముడా! నీవు మిగుల ప్రోత్సాహ మొసగ
కంటి విపులతేజంబు శోకమ్ము విడిచి.

వేచియుందు శరత్తుకై; ఆచరించు
ప్రత్యుపకృతి సుగ్రీవుడు పరమభక్తి"
అనుజు డనియె: "తీర్చునతండు తనదు బాస
ధృతిని నాల్గుమాసాలు ప్రతీక్ష సేయు."

అచట కిష్కింధ సుగ్రీవు డలరుచుండె
ప్రమదలను కూడి యాడుచు ప్రత్యహంబు
చిత్తముల బట్టి చేయు సచివుల దయకు
రాజకార్యాలు విడిచి మర్కటవిభుండు

అహరహంబును సుగ్రీవు డర్కజుండు
కామభోగమ్ములందు మగ్నమతి కాగ
ధర్మవేత్తయు అర్థతత్త్వజ్ఞుడైన
ఆంజనేయుడు విహిత వాక్యాల ననియె.

ప్రాప్త మయ్యెను రాజ్యము భవ్యభంగి
మిత్రునకు సల్పు సాయమే మిగిలి పోయె;
దాటె దాని నొనర్చెడు తరుణ మిపుడు
కీడు కలుగ దేరికి మిత్రకృతులు చేయ.

కార్య మొనరింప వేడ డా కాలవేత్త
రామచంద్రుండు, నీవె తీర్పంగ వలయు;
అఖిలవానరకోటి కీ వాజ్ఞ నొసగ
వెదుక గలరయ్య వైదేహి వివిధదిశల.

శాసన మిడి సుగ్రీవుడు శౌర్యశాలి
వెంటనే సర్వసైన్యము బిలువ నంపి
సంతసిల్లుచు తనదు నాజ్ఞలకు తానె
కాంచనేగెను కామసుఖమ్ము మరల.

మొయిలు మృగవిహంగాదులు పూలు లతలు
సలిలపూరాలు శైలదృశ్యాలు కనుచు
కామశోకకర్శితుడైన రామవిభుడు
చింతనందె నీ రీతిని సీత దలచి.

"తనివి తీరంగ విరులను తరుల గనుచు
పక్షిజాతుల మధుర రవాలు వినుచు
మున్ను పొందెడిదానవు ముదము సీత!
ఈ వియోగ మే గతి భరియింతు వీవు?"

భ్రాత సౌమిత్రి జాలితో పలికె నిట్లు
"దైన్యమును చేరగానీక ధైర్య మొప్ప
స్వీయబలమున కార్యము చేయదగును
వశపరచుకొన సీత నెవ్వాని వశము?"

అనియె రాముడు తమ్ముని కప్పు డిట్లు
చల్లచల్లగ నెల్లెడ జలము గురిపి
సశ్యములశ్యామల మొనర్చి సర్వధరణి
అరిగె మేఘంబు లెటకొ అంబరము వీడి.

ఏగుదెంచె శరత్కాల మిపుడు సౌమ్య!
కదనతలమున కురుకంగ కాల మిదియె
కాముకుందు సుగ్రీవుదు కానరాడు
చెప్పు మతనితో నీవు కిష్కింధ కేగి.

పనులు దీరంగ చేసిన బాస తప్పి
తేలియాడుచు భోగాల, దీను నన్ను
మరచితివి; నీదు ధర్మము నెరపకున్న
అగ్రజుం డేగు దారినే యరుగ గలవు."

రామవిభుక్రోధమునకు సంభ్రమము నొంది
రాజపుత్రుడు సౌమిత్రి తేజమలర
పలికె "సుగ్రీవు గావింతు బాణహతుని
అవనిజాన్వేషణ యొనర్చు నంగదుండు."

"నీవు పరమకృతఘ్ను సుగ్రీవు జంపు
పాపకృత్యమొనర్పంగ పాలుపడకు;
ధీయుతుండవై లక్ష్మణా! తెలియ జెప్పు
సౌమ్యగతి" నంచు శ్రీరామచంద్రు డనియె.

కాముకుండైన క్రోధను రామవిభుని
అతులకోపంబు లక్ష్మణుం డంది చనియె
వనచరపురంబునకు మేటిధనువు దాల్చి
అతని గని కపులెల్ల భీతాత్ము లైరి.

భీషణంబుగ వచియించె రోష మంది
మిత్రు నంగదు గాంచి సుమిత్రసూతి
వానరాధిపతికి తాను వచ్చె ననుచు
శీఘ్రమే లోనికిం జని చెప్పు మంచు.

స్వీయ పత్నియౌ రుమను విశేషసక్తి
చూపు తారను జతగూడి సుప్తిగాంచు
విభుడు రయమున మేల్కాంచె వికలమతులు
కపులు చేసెడు ధ్వనికి లక్ష్మణుని ముందు.

తనదు తల్లి తారకు పినతల్లి రుమకు
వాలిసుతుడు లక్ష్మణు రాక వడిగతెలిపె
విభుడు లేవంగ సచివులు వేడుకొనిరి
సరససన్మిత్రు సౌమిత్రి శాంతపరుప.

కోపహేతువు నూహింప గోర విభుడు
హనుమ సచివమధ్యంబున అనియె నిట్లు
"లభ్య మీ శరత్కాలము; లక్ష్మణుండు
కినుక బూనియుండు వెడలకునికి నీవు.

ప్రతిన విస్మరించిన అపరాధి వీవు
సముచితంబు కుపితుని ప్రసన్నుజేయు
ఇంద్రసమతేజు శ్రీరామచంద్రుశక్తి
ఎరుగవే మున్ను? దాటకు మితని ఆజ్ఞ."

భూతలస్వర్గముగ దోచు భూరిపురిని
దివ్యమైన సుగ్రీవు మందిరము చేరి
వీర సౌమిత్రి మ్రోగింప వింటినారి
శౌర్యశాలి కపీంద్రుడు సంచలించె.

తత్క్షణంబె సుగ్రీవుడు తార నంపె
సాంత్వనోక్తుల ఆతని శాంతపరుప
చూడ నిజము మహాత్ములు చూప రెపుడు
కోమలుల పట్ల దారుణ క్రోధ మనుచు.

"ఎవరు గావించి రపచార మిపుడు మీకు?
ఎవ్వని తరంబు మీమాట కెదురుచెప్ప"
వనిత యిటు పల్కి సౌమిత్రి వ్రతపరుండు
అతిమనోజ్ఞ ధర్మయుత వాక్యంబు లనియె.

"మదనమోహితుండైన నీ మరది మగడు
పానలోలుండు చేసిన ప్రతిన మరచె;
తరుణి! వీడంగ మిత్రుని ధర్మపరుని
అర్థ కామ ధర్మములతో నంతరించు.

తోడనే తార సౌమిత్రితో వచించె
"లక్ష్మణా! ఆగ్రహింప కాలమ్ముకాదు
మీదుమిక్కిలి నమ్రుడౌ మిత్రుపైన
దోషమయము, సత్త్వమ్మును దొలచు కినుక.

కాంచితిని నేను దేహజకామబాధ
తీవ్ర మర్కజుకామము తెలియు నాకు
నే నెరుగుదు నీ ఇంద్రియనిగ్రహమ్ము
కామము నెరుంగ కోపము కలుగ దింత.

కామవశుడు వివేకము గాంచలేడు
పరమబుుషు లెందలో కామవశులుకాగ
నీవు భ్రాతను కపిని మన్నింప లేవె?
సహజచపలు డొనర్చె దుష్కర్మ మనుచు.

కాముకుం డయ్యు పంపెను కపుల బిలువ
సీతకోస మన్వేషణ చేయ దలచి;
రమ్ము లోనికి, మిత్రదారలను జూడ
తప్పుగా దుత్తమచరిత్ర! తలపబోకు.”

అచట ఆభ్యంతరగృహాన అరసె నతడు
స్వర్ణపీఠిని సుందరీసహితు డగుచు
కూరుచుండ సుగ్రీవుడు కొమరుమిగుల
ఆగ్రహవశుండు లక్ష్మణుం డనియె నిట్లు.

“రాజ్య సుఖమొంది గుణశాలి రామువలన
బాస మదిలో దలంపని పాతకుడవు
మూర్ఖతను వాలిమార్గాన పోదలంప
నిశితశరమున నీల్గుదు నిమున మందె.”

త్రాస సంభ్రాంత చిత్తయై తార పలికె
“పురుషపుంగవ! మీ మేలు మరువలేదు
దీర్ఘకాలము కామసంతృప్తి కనక
దేహధర్మము నాతండు తీర్చుకొనియె.”

రాజ్యరమను రుమను వన్ను రాముకొరకు
వీడు సుగ్రీవుడు నిజంబు; నేడె వచ్చు
కదన రంగమ్మునం దూక కపిగణంబు
వాలి తెలిపెను రావణువార్త లెన్నొ.”

మహిత మృదుల మానసుని లక్ష్మణుని గాంచి
ప్లవగపతి పల్కె నిట్టులు భయము గదుర
పృథ్వి శైలసహితము కంపింప జేసె
విభుని శ్రీరామచంద్రుని వింటిమ్రోత.

రామచంద్రుండు సత్యపరాక్రముండు
రావణాసురు వధియించి రణమునందు
సీత బడయు; సాయము నేను చేయు టెంత?
అతని వెనువెంట చనుటె భాగ్యమ్ము నాకు."

లక్ష్మణుడు శుభలక్షణలక్షితుండు
"విజయ మందును మా భ్రాత వీర్యశాలి
సాయ మొనరింప నీవు నిస్సంశయముగ
నే ననిన మాటలన్ని మన్నింపు" మనియె.

వానరపతి సుగ్రీవుడు పజ్జ నున్న
సచివు హనుమంతు నరసి శాసనము చేయ
వనగిరి సముద్ర పర్యంత వసుధ వెలయు
క్రోతు లెల్లరు వచ్చిరి కోట్లకొలది.

మిత్రులగు అర్కజుండు సుమిత్రసూతి
బయలుదేరగ శిబికపై వానరాళి
కదలె ప్రస్రవణంబను గ్రావమునకు
రాము జేరంగ నతని కార్యంబుకొరకు.

రామచంద్రుడు పరమధర్మజ్ఞు డపుడు
చరణముల వ్రాలు సుగ్రీవు శిరము నెత్తి
కౌగిటను బట్టి మిక్కిలి కరుణ జూపి
కూరుచుండగ జేసి వాక్రుచ్చె నిట్లు.

కాల మెరిగి ధర్మార్థ కామాల నెవడు
తగినరీతి చరించు నతండె రాజు
కామలోలుపు బ్రదుకు వృక్షంపుకొనను
నిదురజెంది మేల్కొనుటయే నేలబడగ.

శాత్రవుల జంపి సఖులను సంగ్రహించు
ప్రభుడు నిజధర్మ మొనరించు రమ్యయశుడు
అదను వచ్చెను సీతను వెదుక నిదిగో
శత్రుసూదన! కపులతో సంప్రదించు."

"నీ యపారకృపను నాకు శ్రీ యు గీర్తి
పరగ వానరరాజ్యసంప్రాప్తి గలిగె
నీదు పదపద్మసన్నిధి నిలుపగలరు
కామరూపులు సీతను రామచంద్ర!"

ప్రాంజలించి సుగ్రీవుడు పలుకనట్లు
రాము డనుపమకరుణాంతరంగు డగుచు
వానరేంద్రుని కౌగిట పట్టి పలికె
కదనమున గూల్తు రావణు ఖలు" నటంచు

వానరులు లక్షలును కోట్లు వచ్చిరంత
ధీరవర్యులు పెనుధూళి దిశల గ్రమ్మ
ప్రార్థన మొనర్చె కపిరాజు రాము నరసి
ప్రాఙ్జలగు వారికి తగిన ఆజ్ఞ నొసగ.

భీమవిక్రము డతనితో రాము డనియె
"తెరవ బ్రతికియున్నదొ లేదొ తెలియవలయు
రావణుని దేశ మెరిగి కర్తవ్య మవల
చేయుదము వీర! యోచనచేసి మనము."

"వివిధదేశాల గ్రుమ్మరి విశదభంగి
తెలిసికోదగు దేవి వైదేహి జాడ
తిరిగి రండు మీ రొక నెల తిరుగకుండ"
అనుచు కపులకు సుగ్రీవు డాజ్ఞ నిచ్చె.

ఆంజనేయుని సుగ్రీవు డరసి అతని
ప్రతిభయును విక్రమము మెచ్చ రాము డిచ్చె
స్వీయనామాంకిత మ్మంగుళీయకమ్ము
ఆనవాలుగ జూపింప అవనిసుతకు.

దిశల కేగిరి వానరాధిపులు వేగ
రామకార్యార్థసిద్ధి కారాటపడుచు
రాము డడిగె "సఖా! వివరాలు చెప్పు
తెలిపె నెట్టులు నీ కుర్వితల మదెల్ల!"

ఆతనికి మ్రొక్కి సుగ్రీవు డనియె నిట్లు
"వినుము చెప్పెద రామ! తద్వృత్త మెల్ల
కలిగె దుందుభి అనెడు రాక్షసునితోడ
మున్ను వాలికి వైరమ్ము ముదిత కతన.

వారి కొకనాడు జరిగిన పోరిలోన
రాక్షసుడు పారి మలయపర్వతము దరిని
దూరె గుహను; అన్న నిలుప ద్వారముకడ
కనులు కాయలు కాయగ కాచియుంటి.

రక్తమయమయ్యె గుహ వత్సరమ్ము గడువ
భ్రాతృమరణ మూహించి విభ్రాంతి నంది
చేరి కిష్కింధ రాజ్యముచేయుచుంటి
దోషమనుమాట లేక మిత్రులను గూడి.

దుందుభి దునిమి విజయదుందుభిని చఱచి
వచ్చి వ్రాలెను మా అన్న వాలి పురికి
తరిమి కొట్టెను దుష్టు డాతండు నన్ను
ఎంత చెప్పిన వాస్తవ మెరుగ డయ్యె.

వేగమున పారు మమ్ముల వెంబడించి
వివిధదిశలను తిరిగిన వీడకున్న
వాలికి మతంగు డిడిన శాపంబు హనుమ
చెప్పగా ఋశ్యమూకము చేరినాము.

కాన ధరణిమండల మెల్ల కాంచినాడ
అట్టి లుపయోగపడెను స్వీయానుభవము;
జనకజాన్వేషణార్థము చనిన కపులు
రాదొడంగిరి శ్రమలు వ్యర్థములు కాగ.

వానరేశుడు సుగ్రీవు డానతీయ
కాలవిజ్ఞుడు ప్రాజ్ఞుడు కపివరుండు
హనుమ అమితబలుండేగె జనకదుహిత
వెదుక తారాంగదాదులు వెంటరాగ.

వేళ్లు దుంపలు ఫలములు నీళ్లు లేని
విపినసీమల నెల్లను వెదకి వెదకి
వీరు లావల నేగిరి వింధ్యగిరికి
నిర్భయులు వారి శ్రమము వర్ణింపదరమె?

అలసిన కపుల నోదార్చె నంగదుండు
"గహన వీథుల సెలయేళ్ల గుహల గిరుల
కలయ వెదుకంగ కాలమ్ము గడచిపోయె
విడిచి నిద్ర యాహారంబు వెదకుటొప్ప."

జానకీదర్శనాకాంక్ష సందడింప
ఆంజనేయాది కపులు వింధ్యాద్రి నెల్ల
వెదక జొచ్చిరి, దాహమ్మై బిలము గాంచి
దుర్గమంబగు దాని ముందునకు చనిరి.

కటిక చీకటి నచ్చట కదల లేక
కోలు పోయిరి ఆశ ప్రాణాలపైన
అంత కనబడె నొక కాంతిమంత మడవి
తపము సాగించు చుండెను తన్వి యొకతె.

ఆ తపస్విని గని యనె హనుమ యిట్లు
"చొరగ దాహమై సలిలంబుకొరకు మేము
భీతియొదవించె తిమిర సంవృత బిలంబు
పొదలు నద్భుతదృశ్య సంపదల నిద్ది.

పురమిది సమస్త వస్తు సమ్మోహకమ్ము
తపమున ఘటిల్ల జేసిన ధన్యు లెవరొ
తెలియ జెప్పుము మాకు సాధ్వీమతల్లి!"
అనిన న త్తపస్విని వారి కనియె నిట్లు.

"మయుడు దానవశ్రేష్ఠుడు మాయచేత
దీని నిర్మించి వసియించె దివిజవనిత
హేమయనుదానితోడ ననేకసమలు
ఆమె సఖిని స్వయంప్రభ యనెడు దాన.

కాంచన వనంబు హర్మ్యంబు కాంచు డదిగొ
నిర్మలోదకములు గ్రోలి నిర్భయముగ
ఫలములును మూలములు తిని పలుకుడయ్య
ఎందులకు వచ్చినారొ మీ రెల్ల రిపుడు."

"తల్లి సీతమ్మ వెదకు యత్నమ్ములోన
తిరిగి తిరిగి దగంగొని తీర్చుకొనగ
వచ్చినార మిచ్చటికి మీ పరమకరుణ
తీరె ఆకలి దప్పు లాతిథ్య కలన."

అట్లు వచియించి హనుమంతు డామె కనియె
"కాంత! సుగ్రీవు డిచ్చిన గడువు ముగిసె
దుర్గమంబగు గుహలోన దూరి నంత
మమ్ము దాటించు బిలము నీ మహిమచేత."

ముదిత చెప్పగ కన్నులు మూసికొనిరి
ఎటులు బయలు చేర్చెనో ఆమె ఎరుగ రెవరు
చింత నొందిరి వింధ్యకు చేరివారు
అంగదుడు తాల్తు ననె నిరాహారదీక్ష.

సలుప నెంచ ప్రాయోపవేశంబు నతడు
వానరవరుండు తారుడు పలికె నిట్లు
"భీతివీడి ప్లవగులార! బిలము చేర
జీవనమ్ములు సాగును స్వేచ్ఛమీర.

ఆంజనేయుడు ధర్మవాక్య మిటు పల్కె
"మనకు సుగ్రీవు వీడ క్షేమంబు కాదు
బిలమునం దాగి ప్రాణాల వెలయ గలమె?
బిలము భేదించు సౌమిత్రి సులభ గతిని."

"అన్న జీవింపగా కూడె నతని సతిని
రామకార్యము మరచెను కామవశత
అట్టి సుగ్రీవు నమ్మ శక్యమ్ము కాదు
అరయ ప్రాయంబు శ్రేయ" మం చంగదు డనె.

సర్వకపులు దీక్ష వహించు సమయమందు
సంతసంబున గృధ్రరాజంబు వచ్చి
కడుపు నిండంగ భక్షింతు కపుల ననగ
అంగలార్చె నీ తీరున అంగదుండు.

"కాలుడే సీత సాకున కపుల జేరె
ఆమె కొరకె జటాయువు అసువు వీడ
స్వర్గము లభించె; మనకేల భయపడంగ
విధివశమ్ములు బాధలు వేయునేల?"

అనుజుడగు జటాయువు గూర్చి అటులు విన్న
భవ్యుడగు గృధ్రరాజు సంపాతి వేడె
కరుణతో దింప శిఖరిశృంగంబు నుండి;
అంగదుడు వృద్ధు కోరిక నపుడు తీర్చె.

వానరుల నోట సంపాతి పక్షిరాజు
భ్రాతృమరణవార్తను విని వ్యథను చెంది
తన అనుగుతమ్ముడె జటాయు వనుచు నుడివి
కనుల బాష్పాలు రాలగ అనియె నిట్లు.

"వృత్రు వధకు వైళమ నభోవీథి కేగ
సూర్యకిరణాల కెంతయు గ్రుక్కి కూడ
కప్పితి జటాయువు పయి రెక్కలను నేను
పక్షములు దగ్ధములు కాగ పడితి గిరిని.

కూలి యిటులుంటి ఈ వింధ్య కుధరమందె
ఎరుగ నా జటాయువు జాడ నింతవరకు
రావణుని, భ్రాతృమరణకారకుని నేను
ప్రాణములు తీయ ముదిమి భారమున తగను."

ఆలకించి ఆ సంపాతి జాలి గాథ
అనియె నిట్లు మహాప్రాజ్ఞు డంగదుండు,
"దయను రావణ రాక్షస స్థావరంబు
ఎచట నున్నదొ సంపాతి! ఎరుగ చెపుము."

పలికె నీ భంగి సంపాతి భవ్య బుద్ధి
"అతివ వైదేహి హరణ మే నరసినాడ
అధిక శోకాకులమనస్క అంబరాన
ఆమె "రామ! లక్ష్మణ!" అని అరచె నపుడు.

ధనపతి యగు కుబేరుని తమ్ము డతడు
కాపురము రావణునకు లంకాపురమ్ము
సంద్రమును యోజనశతమ్ము దాట వలయు
వెలయు నద్దాని నిర్మించె విశ్వకర్మ.

దివ్యదృష్టి కంటిని సీత దీనురాలి
యత్న మొనరింప, రాగల రామొ జూచి
వానరులు మీరు దాటుడు వార్ధి నెట్లొ
ప్రతికృతి జరుగగా నాదు భ్రాతృవధకు."

వేగిరమె సాగరము చేర వీరకపులు
పలికె నర్థ భరితముగ వాలిసుతుడు
"కార్యసిద్ధికి వార్ధిని క్షణములోన
దాట నర్హు డెవండొ ముందరకు రండు."

వారి వారి గమనశక్తి బలుక కపులు
జాంబవంతు డనె కని అంజనసుపుత్రు
"ప్రాకటగుణాఢ్య! వానరలోకవీర!-
ఊరకుంటివి నీ వేమి కారణమ్ము?

వాయుసుతుడవు నీవ కాపాడవలయు
దుముకుటయు దాటుటయు మహాత్మునకు నీకు
జన్మసిద్ధగుణంబులు సత్త్వమూర్తి!
విక్రమ విజృంభణము చూపి వేగ చనుము."

జాంబవంతు డా రీతి నుత్సాహ మొసగ
కాయ మెల్లను పెంచుచు కపులు పొగడ
భీమవిక్రమమున విజృంభించి హనుమ
వాలమును ఛక్క ద్రిప్పుచు పలికె నిట్లు.

"చూడ అనిలున కౌరససుతుడ నేను
ప్లవన మందున సాటిలే డెవడు నాకు
మేరుగిరి చుట్టి వత్తు వేమారు లేని
నేల సాగరజలముల నింప నెంతు.

వాయు వైనతేయులు దక్క వాస్తవముగ
శక్తి నేడు లోకాల నా సముడు లేడు
నిక్కముగ లంక నా కొక లెక్కగాదు
తలప లిప్తలో తేగల దాని నిటకు.

కపులు తమ విషాదము వీడి కాంచుచుండ
జాంబవంతుడు హనుమ తేజస్వి కనియె
"ఘోరవార్ధి లంఘింపుడు గురుల కరుణ
వేచి చూచెద మిచటనే వేగ రమ్ము.

నాదువేగము సైచగాలేదు ధరణి
ఈ తరుణమందు" అని వచియించి హనుమ
శీఘ్రమా మహేంద్ర గిరీంద్ర శిఖర మెక్క
అచలము చలించె అతని పాదాభిహతికి.

గమనవేగ తేజముల లాఘవము నందు
మతిని సముని గనని హనుమంతు డంత
క్షణములో చేరి లంకకు కన దలంచె
కాంచి నట్లెంచె సిద్ధసంకల్పు డతడు

* * *

# సుందరకాండము

పూతచరిత మహీజాత సీతవెదకు
పరమదుష్కర మైనట్టి పనికి పూనె
ఊర్జితానంద కంద రూపోజ్జ్వలుండు
హనుమ తరియించి లవణ మహార్ణవంబు.

దేవతలు కామరూపాన తిరుగునట్టి
ఆ మహేంద్రమహాగిరి నతుల గతుల
శాద్వలముల విహారమ్ము సలిపె నతడు
విహగములు వన్యమృగములు భీతిచెంద.

రవిని దేవేంద్రు పవనుని బ్రహ్మ దలచి
రామచంద్రు, లక్ష్మణుని వారాశి గొలిచి
భూతముల కెల్ల భక్తితో మ్రొక్కి పిదప
హనుమ జ్ఞాతిచయమ్మున కంజలించె.

దక్షిణాంభోధి లంఘింప తనువు పెంచె
పర్వదినముల పొంగెడు వార్ధివోలె;
పర్వతమునుండి కుప్పింప పరువులెత్తె
భూతగణము; యోగిజనంబు భీతినొందె.

రామకార్యంబు గావింప శ్రద్ధతోడ
రవ మొనర్చె భీకరము పర్జన్యు డట్లు;
ఉన్నతబలుండు హనుమంతు డూర్ధ్వదృష్టి
చారణాచరి తాధ్వసంచార వాంఛ.

"రాము శరమట్లు లంకను వ్రాలి యిపుడె
సీత నట నేను కనకున్న శీఘ్రగతిని
చొచ్చి స్వర్గాది లోకాల సుదతి గొనుచు
వత్తు; పెకలించి తెత్తు రావణుని లంక."

అని వచించి కపుల కంజనాత్మజుండు
సంశయమ్ము నందక మహోత్సాహ మెసగ
తన్ను వినతాసుతుగాగ దలచికొనుచు
వెంటనే రివ్వుమని వినువీథి కెగసె.

మేదురంబుగ వాలంబు మెడను దాల్చి
సకల భువ నాద్భుతా ఖర్వ శౌర్యశాలి
ఖచర సంఘమ్ము మివుల దిగ్భ్రాంతి నొంద
లంక కున్ముఖు డగుచు నిశ్శంక వెడలె.

వాయుసుతు డేగుచుండ విహాయసాన
సాయ మొనరింప మది నెంచె సాగరుండు
సగరు డనియెడు పావనేక్ష్వాకు విభుడు
తనదు వృద్ధికి మూలకారణము గాన.

ఆంజనేయుడు చనుచుండె అంబరాన;
రామభూవిభు కార్యనిర్మగ్ను డతని
బడలికలు వాప మనము తోడ్పడగ వలయు
త్వరితగతి రమ్ము పైపైకి తనువు పెంచి.''

అనుచు జలధి మైనాకున కాజ్ఞ నొసగ
క్షణములో నిల్చె శైల మాకాశవీథి
తరులతా శ్యామ సుందర తనువు దాల్చి;
రామదూతను గాంచి పర్వతము పలికె.

నన్ను మార్గనిరోధిగా నెన్నకయ్య!
ఘనుడు కృతమెంచువాడు సాగరుడు పనుప
సేద దేర్పంగ నిలుచుంటి; స్వీకరింపు
మాతిథేయ సత్కారమ్ము నాంజనేయ!

కరువలి సుతుండు మైనాకు నరసి అనియె
"చీకటి పడకమును పె నే చేరవలయు
రావణుని లంక రామకార్యమ్ము పైని;
వానరుల కట్టు లిడితి వాగ్దాన మేను."

చనగ హనుమంతుడు గమించి సాగరమ్ము
సురలు సిద్ధగంధర్వులు పరమఋషులు
సూర్యనిభ నాగమాతను సురస నరసి
విఘ్న మతనికి సుంత కావింపు మనిరి.

కామరూపిణి సురస రాక్షసిగ మారి
భయద వక్త్రింబు తెరచి నభస్స్థలంబు,
ఆంజనేయునితో ననె నడ్డగించి
"యేటి వానర! ని న్నిదే మ్రింగివైతు."

పలికె సురసతో అంజలిబద్ధు డతడు
"రామపత్ని నపహరించి రావణుండు
లంకలో నుంచె సాధ్వీలలామ జూడ
రామునకు తెల్పి నీ వక్త్రసీమ జొత్తు."

అందులకు సమ్మతింపక అనియె సురస
వరమహిమ నన్ను మీరంగ తరముగాదు;
అరుగు మవల మదాస్య కందరము సొచ్చి;"
కోరె హనుమంతు డద్దాని నోరు తెరువ.

అప్రమేయ మహాశక్తి నడరు హనుమ
తన శరీర మంగుష్ఠమాత్రమ్ము చేసి
సురస భీకర వదన గహ్వరము సొచ్చి
బయలు వెరపె; దాక్షాయణి వరము నిల్పె.

స్వస్వరూపమ్ము గైకొని వనిత సురస
ఆంజనేయునకు ఘటిల్ల అర్థసిద్ధి
స్థిరతరయశంబు గలుగ నాశీర్వదింప
వాయువేగాన సాగించె పయన మతడు.

వాయుసుతు డాంజనేయుని ఛాయబట్టి
వేగమె భుజింప సింహిక లాగ సాగె;
సంద్రమున నున్న ఆ నిశాచరిని ద్రుంచె
మర్మములు త్రెంచి శ్రీరామ మహిత దూత.

జలధి సింహిక కూలు దృశ్యమ్ము నరసి
దేవతలు హనుమంతుని ధృతిని మతిని
దక్షతను మెచ్చి కార్యసాధకు డనంగ
సాగరముమీ దనేగె నా శౌర్యధనుడు.

నూరు యోజనములు దాటి చేరె నతడు
వృక్షతతుల విరాజిలు ద్వీప మొకటి;
అచలమునుబోలు తనదు దేహమ్ము నంత
కోరి పవమానసుతుడు సంకోచపరచె.

వార్ధితీరము దాటి రూపాలు మార్చి
అంజనాపుత్రు డురికె మహాద్రిపైకి;
స్వీయకార్యము సాగ విచిత్ర సరణి
సుందరంబు లంకాపురి చూచె నతడు.

మది దలంచె వీరుడు హనుమంతు డిట్లు
"అబ్ధి దాటితి శతయోజనాయతమ్ము
దీనికిని నూరురెట్లు దవ్వైనగాని
దాటగల నవలీల సంద్రమ్ము నింక."

కారణము చెప్పకుండగ క్రూరబుద్ధి
అసురనాథుడు రావణుం డాజ్ఞసేయ
సిద్ధమయ్యె యుద్ధమునకు సేనలెల్ల;
వేచియుండె నాతండు దోర్వీర్యశాలి.

శోకభారాన కృశియింప సుదతి సీత
సకియ సరమ యిట్లు మృదుభాషణము సలిపె
"వీరరాఘవు జంపంగ వీని తరమె?
విశ్రుతసుఖంబు గాంతువు విభునితోడ."

దైత్యవిభు నిశ్చయ మెరుంగ ధరణితనయ
సరమ నర్థింప రావణు దరికి బోయి
తిరిగి వచ్చిన ఆమె ఈ సరణి బలికె
"సమరమందు దశగ్రీవు చావు నిజము.

మాతయు నవిద్ధుడా వృద్ధమంత్రి కూడ
వీడు మన నిన్ను, వినడయ్యె వాడు ఖలుడు;
రాము డసురుల నిశితశరాల గూల్చి
సీత! నీ తోడ జేరు సాకేతపురము."

క్షణములో కపిసేన భీకరరవాలు
దిక్కు లెల్లెడ వ్యాపింప దీనులైరి
స్వీయతేజము శక్తి నశించిపోవ
చావు తప్ప దటంచు రాక్షసులు తలచి.

వృద్ధుడు మహామహుండు సద్బుద్ధిశాలి
దనుజనాథు సవిత్రికి తండ్రి యైన
మాల్యవంతుడు నీతినిర్మలుడు కోరి
చేరి రావణు కడకు, వచించె నిట్లు.

"సములతో అధికులతోడ సంధి మేలు
రామునకు సీత నర్పించి రమ్యబుద్ధి
ఆశ్రయింపు మా మహనీయు నహరహమ్ము
భావమందున సద్భక్తి పరిమళింప.

అసురపతి పల్కె క్రోధతామ్రాక్షు డగుచు
"సురలగెల్చిన నేనేడ? సుదతికొరకు
కపుల జేరిన మనుజుండు కృపణు డేడ?
చాలు నీ బోధ; నాచేత చచ్చు నతడు."

చెప్పె రఘురామునకు శత్రుసేన గూర్చి
విపులగతి విన్న వార్త విభీషణుండు
"రావణుండు దక్షుండు దుర్వారబలుడు
ఉత్తరద్వారమందున నుండె వేచి.

రహి ప్రహస్తుడు తూర్పుద్వారంబు నందు
దక్షిణద్వారమున మహోదరునితోడ
రాక్షసుల మహాపార్శ్వుడు రక్షసేయ
పశ్చిమద్వారమందు రావణియు నిలిచె."

రాము డనియె నిట్లు పగర ప్రతిఘటింప
"పోరు నీలుదు తూరుపు ద్వారమందు
అంగదుదు దక్షిణద్వార మాక్రమించు
పశ్చిమద్వారమున నుండు పవనసుతుడు.

భ్రాతతో జేరి ఉత్తర ద్వారసీమ
రావణుని గూల్తు నేను సంగ్రామమందు
వీరజాంబవంతుదును విభీషణుండు
మారుకొందురు వైరుల మధ్య నిలిచి."

మంత్రవిదులతో రాత్రి సమయము గడప
వింతకాంతుల వెల్గు సువేల నెక్కి
రాము డనె "స్వజాతి నశింప రావణుండు
అవనిజాతను నా సతి నపహరించె."

రాత్రి కపులు సువేల పర్వతమునుండి
సుందరోన్నత ప్రాకార శోభితంబు
రావణాసుర పాలిత రమ్యలంక
విస్మయానంద చిత్తులై వేడ్క గనిరి.

క్షణము గాంచె రాముండు లక్ష్మణునితోడ
బహువిధోద్యాన శోభా విభాసితంబు
విశ్వకర్మ నిర్మిత మతివిశ్రుతంబు
కనుల కానందకరము లంకాపురమ్ము.

కాంచి రావణు నచలశృంగమ్ము నుండి
క్రోధమున వానిపై దూకి గొంకు లేక
జంకులేక సుగ్రీవుడు సలిపి పోరు;
వ్యోమమార్గాన మరల శ్రీరాము జేరె.

ప్రేమతో కపివిభునకు రాము డనియె
"సాహసింపకు మొక్కటి జరిగె నేని
మాకు భరత శత్రుఘ్న లక్ష్మణుల తోడ
తనువుతోడ వైదేహితో పని యికేమి?"

అనియె నిట్లు రాముండు లక్ష్మణుని గాంచి
"అనుజ! అయ్యదె ప్రళయ భీషణము నగుచు
వీచు పెనుగాలి; భూమి కంపింప దొడగె
అశుభసూచకంబులె తోచు అన్ని యెడల."

రామభద్రుండు కోదండరాము డగుచు
వెంట సుగ్రీవవిభుడు విభీషణుండు
లక్ష్మణాదులు రాగ శైలమ్ము డిగ్గి
మొదట ఉత్తరద్వారము ముట్టడించె.

అధిక సైన్యము వారల ననుసరింప
వ్యూహ నిర్మాణ దక్షులౌ యూథపతుల
కడమ ద్వారాల నిలిపి అంగదుని గాంచి
రాము డనె నిట్లు రాజధర్మమ్ము నెంచి.

అసురపతి సభకేగి ఏ వ్యథయు గనక
వానికి వచియింపుము నాదు పలుకు లిట్లు
"దేవ దానవ గంధర్వ భూవిభులకు
నీ వొనర్చిన పాపము నిండిపోయె.

జానకీదేవి నర్పించి శరణు గనుము
లేనిచో దైత్యజాతి జగాన మనదు"
భక్తి నంగదు డట్లె నభంబు కెగసి
రావణేశు సుందరమందిరమ్ము చేరె.

కొలువు దీరిన దనుజుతో పలికె నతడు
మహిమ కలిగిన రాముని మాట లనుచు
"ధర్మరతుడు దశరథుండు తండ్రి నాకు
జనవినుత పుణ్యశీల కౌసల్య తల్లి.

నీ పురద్వారమందున నిలిచి యుంటి
చేయు మిప్పుడు నీ మహామాయ ధూర్త!
పుడమిపుత్రిని సత్కారపూర్వకముగ
అప్పగించనిచో చావు తప్ప దింక."

పట్ట నలువు రసురులు రావణుని యాజ్ఞ
అంగదుండు వారిని పాదహతుల జేసి
విస్మయంబును భయ మరివీరు లంద
వ్రాలె శ్రీరామచంద్రు పాదాల చెంత.

సమర సన్నద్ధు డా మహాశౌర్యశాలి
రామభద్రుండు లంకాపురమ్ము గాంచి
అవనిజాత జ్ఞప్తికిరాగ వ్యథితు డయ్యె;
ఆజ్ఞ యిడె శీఘ్రముగ దనుజాళి దునుమ.

బహుళ సైనికపటలి రావణుని యాజ్ఞ
ఆరభటితోడ మ్రోయింప భేరిచయము
రణము భీకరభంగి ప్రారంభ మయ్యె
మహిత వానర రాక్షస మధ్యమందు.

ప్లవగవీరులు ధైర్యసంపదలు చెలగ
తరులు గిరులు ధరించి యుద్ధమ్ము సలుప
దారుణంబగు కోపాన దైత్యబలము
పరిఘతతి దాల్చి సలిపెను భండనమ్ము.

ధరణి కంపింప ద్వంద్వయుద్ధమ్మునందు
తలపడిరి శౌర్యకలితు లుద్ధతి యెసంగ
అంగదుం డింద్రజిత్తుతో అనికి దిగియె
సలిపె సంపాతి పోరు ప్రజంఘుతోడ.

ఒలి నాంజనేయుడు జంబుమాలి నెదిరె
తలపడియె విభీషణుడు మిత్రఘ్నుతోడ
కోరి నీలుండు వైరి నికుంభు దాకె
రణ మొనర్చె సుగ్రీవుడు ప్రఘసుతోడ.

ఆజిలో లక్ష్మణుడు విరూపాక్షు గొట్టె;
రామచంద్రుడు తలపడె రశ్మికేతు
అగ్నికేతు సుప్తఘ్నుల యజ్ఞకేతు;
కపు లెదుర్కొన అన్యరాక్షసగణంబు.

ఒండొరులతోడ కపిదైత్యు లుక్కుమీరి
ఆల మొనరింప పారె రక్తాల ఝరులు;
దనుజకపుల మొండెమ్ములు ధరణి బడగ
యుద్ధరంగమ్ము భయదమ్మై యొనరె నపుడు.

వీరు వారు జయము గోరి పోరుచుండ
అంధకారము వ్యాపించె నఖిలదిశల;
చంపి రసురుల రామలక్ష్మణులు, విడిచి
విషభుజంగాల పోలెడు విశిఖతతుల.

అంగదుం డింద్రజిత్తు త్రుంచంగ నెంచి
సారథిని అశ్వముల గూల్చ సంగరాన
రావణుసుతుండు కాంచనరథము విడిచి
అమితభీతి నంతర్ధాను డయ్యె త్రుటిని.

భీమవేగులు వానరవీరవరులు
మేఘనాదుజాడ నెరుంగ మింటి కెగయు
అణచి వారి వేగమ్ము మాయావి యతడు
రాఘవులపైని సర్పశరాల గురిసె.

ఇంద్రజిత్తు పెనుధనుస్సు నెక్కుపెట్టి
తీవ్రశరములు గురియ నదృశ్యు డగుచు
ధరణి నొరగిరి వీరులు దాశరథులు
అస్ర మొలుకంగ స్వీయ దేహాలనుండి.

చలనమే లేని రామలక్ష్మణుల జూచి
ఏమిచేయుటో తోచక ఏడ్వ కపులు
వారిని వధించినట్లు రావణి వచింప
రావణాసురు డమితహర్షమ్ము నందె.

ధరణిజకు వార్త రావణుం డెరుగ జేసి
పుష్పకమ్ము పై నెట్లొ గొంపోవజేయ
జనకపుత్రి దర్శించి రోదన మొనర్చె
మృతుల రామలక్ష్మణుల సువ్రతుల దలచి.

భర్తృశోకార్త త్రిజటతో పలికె నిట్లు
"పద్మ రేఖలు గ్రాలుట పాదయుగళి
ధన్యగా పుణ్యకాంతగా ధరణి నేను
వెలయుదు నని దైవజ్ఞులు తెలిపి రెపుడొ.

పట్టమహిషి ననియు వీరపత్ని ననియు
భద్రచిహ్నాలు కనుగొన్న వారి నుడులు
ఏల వ్యర్థమ్ము లయ్యెనో ఎరుగజాల
మడుగులో గూలిరే వీరు కడలి దాడి?"

తన్వి దుఃఖితమతి బహుధా కలంగ
అనియె త్రిజట "వారు మరణ మందిరేని
మోయ దీరీతి నిను దివ్యపుష్పకంబు
వెలయునే కపిసేన ఉద్వేగపడక?

కాంత! కనుము వారి ముఖాల కాంతిలక్ష్మి
దుఃఖమోహంబులకు నీవు దూర మగుము"
శోక మది కొంత తగ్గ అశోకవనికి
పూవుబోడిని చేర్చెను పుష్పకమ్ము.

అన్నదమ్ములు పడియుండ నంపశయ్య
వంతను మునింగి గుమిగూడె వానరాళి;
మూర్ఛదేరి అనుజుని రాముండు గాంచె
రక్తసిక్తగాత్రునిగ శరాలపైని.

విక్రముండు రాముడు విలపించె నిట్లు
"భ్రాత యిటులుండ పని యేమి సీతతోడ?
దొరకు నటువంటి వరనారి ధరణి వెదక
దొరకునే లక్ష్మణసమ సోదరుడు ధాత్రి?

వానరుల ముందు విడుతును ప్రాణచయము;
తమ్ముడా! ఇంక నన్ను ఓదార్చు నెవడు?
పరుషవచనంబు లాడుట ఎరుగ నెపుడు
పోరితిరి చాలు కపులార! పోయిరండు."

అటకు వచ్చి విభీషణు డార్తిగుందె
సత్యధర్మైక నిష్ఠుల శౌర్యనిధుల
రాఘవుల జూచి, తన కోర్కి భ్రంశమంద
ప్రాప్తకాము డయ్యె దశవదను డంచు.

సఖుడు సుగ్రీవు డా విభీషణుని కనియె
"మూర్ఛదేరి దాశరథులు పుత్రసహితు
రావణు వధించి నీ మనోరథము తీర్చి
జనకజాతను తెత్తురు శంకవలదు."

పవనసుతుని సుగ్రీవుడు పంపనుండె
క్షీరవార్ధిని గల ద్రోణగిరికి తేర
శస్త్రసంజీవకరణి విశల్యకరణి
అనచెలంగెడు మహితదివ్యౌషధులను.

అంత వైనతేయుడు గరుత్మంతు డటకు
వేగమే రాగ పీడించు నాగవితతి
భయముతో భ్రాతలను వీడి పారిపోయె;
మహితతేజంబు రామలక్ష్మణులు కనిరి.

పలికె రామునితోడ సుపర్ణు డిట్లు
"రామ! నెరవేర్ప మిత్రధర్మమ్ము నేను
నాగపాశవిముక్తులైనారు మీరు
సేతు వింక రాజ్యమ్మును సీతగూడి."

వేగమే ఖగపతి వినువీథి కెగయ
భీమనాదాలు చేసిరి వీరకపులు;
వారి యుల్లాస మెల్ల రావణు డెరింగి
అర్కకులమణి ద్రుంప ధూమ్రాక్షు బంపె.

వ్యథితుల నొనర్ప పోరిలో నతదు కపుల
ఆంజనేయుడు క్రోధతామ్రాక్షు డగుచు
రయముతో వైచి పెనుశిల రథముపైని
అవని నద్దాని గూల్చి ధూమ్రాక్షు దునిమె.

వజ్రదంష్ట్రుడు వెడలె రావణుడు పంప
అనుసరింప మహాశూరు లతులబలులు;
అలఘుతేజోవిరాజితుం డంగదుండు
చంపె రణమున నతని రాక్షసులు పార.

అనికి రావణాసురు డకంపనుని బంపె
సర్వశస్త్రకోవిదులు రాక్షసులతోడ;
మారుతి అతని నెదిరించి దారుణగతి
మహితవృక్షంబుతో గొట్టి మడియ జేసె.

అమితబాహుబలుండు ప్రహస్తు డేగ
సిద్ధముగ నుండె కపిసేన చేయ రణము;
వీరవర్యులు పోరగ వివిధగతుల
నీలు డా చమూనాథుని నేలగూల్చె.

అఖిలరాక్షస సర్వసైన్యాధికారి
కూలగా నెమ్మనమ్మున కుమిలి రగిలి
గప్పమను నగ్నివలె దశకంఠు డేగె
కపియుతంబుగ రామలక్ష్మణుల జంప.

మహితపర్వతసము లసమానబలులు
వీరదానవు లెల్లరు వెంటరాగ
కదనభూమికి చనె దశకంధరుండు
శౌర్యగాంభీర్యవిక్రమస్థైర్యగుణుడు.

దేవతల కావర మడంచు ధీరు డతడు
కంటబడగ భావించె నిక్ష్వాకు డెడద
"తీవ్రశరముల నీ మహాతేజు నిపుడె
భస్మ మొనరింతు జగములు పడయ శాంతి."

లంక రక్షింప నాత్మబలప్రముఖుల
పంపి వెనుకకు వేగ రావణవిభుండు
విక్రమించి సుగ్రీవుపై వేయ శరము
పొంగ దైత్యులు, కపిరాజు మూర్ఛవోయె.

రావణుండు మహావీర్యరాజితుండు
క్రూరబాణాల బరపంగ ఘోరభంగి
వాలముల నెత్తి త్రిప్పుచు పలువిధాల
సానువృక్షాలతో గొట్టె వానరాళి.

భయముతో రాము స్మరియింప భక్తకపులు
పరమదారుణ మైన చాపంబు దాల్చి
ఆహవమ్మున కేగె రామానుజుండు;
పలికె రావణాసురు గాంచి పవనసుతుడు.

"గరుడ గంధర్వ దేవతా ఖచర యక్ష
రాక్షసభయంబు లేకుండ రణము నందు
వరము నంది తీవు వనజభవుని వలన;
భయము నీకగు వానరబలము కతన."

ఆ క్షణమె హనుమంతుని వక్షమందు
కోపమున దశగ్రీవుడు కొట్ట కేల
దారుణంబుగ మారుతి దైత్యవిభుని
చరచె చరచేత ఆతడు చంచలింప.

హనుమ బలసంపదను కొనియాడి తనదు
ముష్టిగొట్టె దైత్యు డతని మూర్ఛ మునుగ;
నీలు జేసె విసంజ్ఞుడై నేల నొరగ
ఆంజనేయుదు లేచెదు నంతలోన.

రావణుదు లక్ష్మణుదును శరాలతోడ
ఘోరగతిని సాగించిన పోరిలోన
బ్రహ్మదత్తశక్తిని వేయ రాక్షసుండు,
భూమిపై బడె సౌమిత్రి మూర్ఛనంది.

కొట్ట రావణు వక్షాన క్రుద్ధు డగుచు
వజ్రతుల్యమహోముష్టి, వాయుసుతుడు;
ముక్కుచెవుల రక్తము కారి మూర్ఛపొంది
తేరుకొన జాలడయ్యె ఆ దితిజవిభుడు.

కపివరుడు రాముకడకు లక్ష్మణుని జేర్చ
మూర్ఛ దేరె నతండు; రాముండు చనియె
ఆలమున కంత హనుమభుజాలపైని
రావణుడు తెలి వందగా రథమునందు.

పరమపురుషుడు రామభూపాలమౌళి
క్రూరరావణుతోడ వాకొనియె నిట్లు
"మదము నందితి వెవ్వాని మహిమ అట్టి
బ్రహ్మశరణంబు జొచ్చియు బ్రదుక లేవు."

అంజనానందనుని గొట్ట నసురవిభుడు
రాము దుగ్రుడై నిశితశరాల బరప
వ్రయ్య లయ్యె మూర్ఖుడగు రావణురథమ్ము
ఉర్వి బడ నాతని కిరీట ముజ్జ్వలంబు.

పలికె రాముడు దీను రావణుని గాంచి
"చంప గల్గియు కరుణతో చంపనైతి
శ్రమపడినవాడ వీవు విశ్రాంతి నంది
రథముపై ధన్వివై పోర రమ్ము మరల."

రావణుండు రథంబు దర్పంబు చెడగ
మానవేంద్రునిచే అవమాన మంది
పురి కరిగి బ్రహ్మశాపాభిభూతుడైన
భ్రాతను దలంచె నత దుండ గాఢనిద్ర.

"శోకముండదు లేవ నా సోదరుండు
కుంభకర్ణుండు నిరుపమఘోరబలుడు
దాన వామర దుర్దమ దర్పహారి
గుండెగాలంబు శాత్రవకోటి కతడు.

త్వరగ మీరు వని శక్రతుల్యు నతని
మేలుకొల్పుడు సమరాన మేలు గూర్ప"
అట్టులు విభుండు రావణు డాజ్ఞసేయ
వెడలి రెందరో అసురులు వేగిరముగ.

అంత దైత్యు లోక మహాగుహాంతరాన
ఘోరనిద్రాప్రమత్తుడౌ కుంభకర్ణు
మోది బాది వాద్యాలను మ్రోగజేసి
మేలుకొలుపంగ అత డీ లీల బలికె.

"ప్రభున కేదేని కలిగెనే ప్రబలభయము?
లేనిచో న న్నిటులు లేప బూన డతడు"
చావు తప్పి సమరమందు రావణుండు
వ్యథితుడైన కథను చెప్పి రసురు లంత.

అన్న కడ కేగుచుండ కాలాంతకుండు
కుంభకర్ణుండు బాహో విజృంభణుండు
కాంచి దూరాన పర్వతాకారు నతని
కపులు పారిరి దెసలకు కంపమంది.

దేవమునికంటకుండైన రావణుండు
పలికె దైన్యము దోపగ భ్రాత గాంచి
"రాఘవుడు సేనతో మహార్ణవము దాటి
నాశన మొనర్చుచూనెను నగర మెల్ల.

పోరిలో వానరులచేత భూరిబలులు
ప్రాణములు వీడ పరువమ్ము బాసి యుండె
పట్టణము; సంకటమ్మెల్ల పారద్రోలి
కావదగినట్టి వాడవు నీవె నిజము."

కుంభకర్ణుండు నవ్వి వాక్రుచ్చె నిట్లు
"రావణా! వీడి వీర్యదర్పంబు నీవు
దేశకాలపాత్రంబుల తీరు నెరిగి
చేయుము విభీషణుదు ముందు చెప్పినట్లు."

రావణుదు మండిపడి పల్కె భ్రాత గాంచి
"ప్రాతగాథలు త్రవ్వుట వ్యర్థ మింక
నీకు జోడైనవా డెందు నాకు లేదు
సాగు మిక విక్రమింపగ శత్రువధకు."

కుంభకర్ణుండు నడయాడు కొండవోలె
వెడలుచుండగ చేబూని పెద్దపరిఘ
వానరు లపారమగు భీతి పారుచుండ
అంగదుండు వారలకు ధైర్యమ్ము గూర్చె.

భండనంబున దూక కుంభశ్రవుండు
మారుకొని రాంజనేయుడు మైంద ఋషభ
శరభ నీల సుషేణాది శౌర్యధనులు
కపివరేణ్యులు మిగుల సంగ్రామకాంక్ష.

మూర్ఛనంద సుగ్రీవుడు పోరిలోన
కుంభకర్ణుండు హస్తాల గొని చనంగ
స్మృతిని గాంచి వానరులకు హితము గూర్ప
గోళ్లతో వాని చెవులు ముక్కులను జీరె.

జారిపడి కుంభకర్ణు హస్తాలనుండి
ప్రాణములు దక్క కపిరాజు పరువు లిడగ
రక్తసిక్తగాత్రుం డటు రణమొనర్ప
కుంభకర్ణుండు వచ్చెను కోప మడర.

కాలవహ్ని విధంబున కపులతోడ
తనదు దనుజుల నేనియు తినదొడంగి
రాముని శరాభిఘాతాన రాక్షసుండు
కుంభకర్ణుండు సమరాన కూలిపోయె.

కపివరుల మ్రింగి కాలసంకాశు డగుచు
తుదకు కుంభకర్ణుండు తుత్తునియ లయ్యె
సగము దేహము కూలంగ సంద్రమందు
ఎగిరిపడె లంక గుమ్మాన సగముతనువు.

భ్రాతకోసము ఖేదించి రావణుండు
మది దలచె నిట్లు "నాకేల మగువ సీత?
వినగనైతి వచింప విభీషణుండు
రాము రణమున గూల్చని బ్రదుకదేల?"

అసురవల్లభు సుతులు శస్త్రాస్త్రవిదులు
రణనిపుణులు మాయావిశారదులు; వారు
ఘనులు దేవాంతక నరాంతక త్రిశీర్ష
లాహవమ్మున కేగిరి సాహసించి.

శ్రేష్ఠకపు లంత దానవశ్రేణి గాంచి
శైలములతోడ పృథుల వృక్షాలతోడ
పదిలముగ నెదిరించిరి బహువిధాల
సాహసంబున జంప రాక్షసబలంబు.

కరము భీకరమైన సంగ్రామమందు
వేగ పైబడి చీల్చుచు వీరరిపుల
కపులసైన్యము ప్రమదము కాంచుచుండ
దైన్య మందుచు నుండెను దనుజసేన.

శ్రేష్ఠహయమున విహరించి స్వేచ్ఛమీర
హతుల జేయ వానరుల నరాంతకుండు
అశ్వమును జంపి క్షణములో అంగదుండు
ముష్టిఘాతమ్ముచే దైత్యు పుడమి గూల్చె.

మృతిని గన భ్రాత పగదీర్పు కుతుక మెసగ
అంగదు నెదిరించిరి సమరాంగణాన
ప్రథిత దేవాంతక మహోదర త్రిశిరులు
భూరిపౌలస్త్యకులజులు శూరవరులు.

కావరంబున మువ్వు రొక్కపరి దూక
సరకుగొనక సంగ్రామము సలుపుచున్న
అంగదుని గావ నీలుతో హనుమ వెడలి
కొట్ట ముష్టిని దేవాంతకుండు చచ్చె.

శైలశిఖరాలతో గొట్టు నీలుపైని
నిశితశరపరంపర వేసె త్రిశిరు డంత;
కొండపడగ వేగముతోడ కూలె నేల
దక్షుడైన మహోదర రాక్షసుండు.

బాణములతోడ శక్తిని వైచినట్టి
త్రిశిరు రణరంగమున సంహరించె హనుమ
రావణభ్రాత దివ్యపరాక్రముండు
అతిబలుండు మహాపార్శ్వు డట్లె చచ్చె.

ధీరుడు మహాద్రిసన్నిభదేహు డైన
దనుజు డతికాయుడు విరించిదత్తవరుడు
ప్లవగసముదాయమున కెల్ల భయము గదుర
రణ మొనర్చె సౌమిత్రి శౌర్యమున నిలిచె.

రావణసుతు డతడు పొందె బ్రహ్మనుండి
రవిసముజ్జ్వలకవచము రమ్యరథము
కాని లక్ష్మణుం డనిలోన వాని జంపె
అసదృశంబైన దివ్యనిజాస్త్ర శక్తి.

క్రమముగా చావ నసురులు ఖ్యాతబలులు
దైత్యనాథుడు ఖేదము దైన్యమందె;
ఇంద్రజిత్తు మహాతేజ మెసక మెసగ
తరలె అప్రతిరథుడు రథమ్ము పైని.

హుతవహుడు ప్రీతినొందగ హోమ మొందు
మేఘనాదుండు చేసి యమేయశక్తి
బాణవృష్టి నచింత్యరూపాన కురిసె
కపుల నసురులు దునుమాడ విపులసంఖ్య.

మేఘనాదుడు మాయతో మింటినుండి
వానరేంద్రుల నొనరించె మ్రానుపడగ;
అన్నదమ్ములు కనగ మహాస్త్రపీడ
మరలె నంతర్హితుండు ధామమ్ము చేర.

చచ్చి పడియున్న కపులలో జ్ఞానవృద్ధు
జాంబవంతు హనుమ విభీషణుడు వెదక
జాంబవంతు డనియె విభీషణుని గాంచి
"హనుమ బ్రతికిన సర్వసైన్యమ్ము బ్రదుకు."

వాయుపుత్రునితో నిట్లు పలికె నతడు
"గ్రక్కున సమర్థుడవు నీవె కపుల నెల్ల
ప్రాణదాన మొనర్చి కాపాడవలయు
రాఘవులకు తొలంగ శరప్రపీడ.

కడలి మీదుగా నేగ నాకాశవీథి
అలరు నతులప్రభంబు హిమాద్రికడను
క్షితిని ఋషభాద్రి కైలాసశిఖరి నడుమ
పరమసుందర మోషధిపర్వతంబు.

జీవనౌషధులైన సంజీవకరణి
జగతి ప్రఖ్యాతి గన్న విశల్యకరణి
ధరణి సౌవర్ణకరణి సంధానకరణి
అనెడు వానిని తెమ్ము నీ వచటి నుండి."

మారుతాత్మజు డనిలసమానబలుడు
రామకార్యధూర్వహుడు పర్వతము జేరి
కానలేక ఓషధుల, పెకల్చి తెచ్చె
వృక్షములతోడ లతలతో వెలయు నగము.

భ్రాతయగు లక్ష్మణునితోడ రామవిభుడు
సమరమందు నిహతులైన సర్వకపులు
ఓషధుల వాసనకు లేచి ఊరడిల్ల
మరల నట జేర్చి వచ్చె తద్గిరిని హనుమ.

సింహనాదాలు చేసిరి చెలగి కపులు;
రేయి వీర్యవిక్రములు సుగ్రీవునాజ్ఞ
కొరవులను పెక్కు చేబూని కోర్కితీర
కాల్చిరి గృహాలనెన్నొ లంకాపురాన.

రణమునకు పంపె సుగ్రుడు రావణుండు
కుంభుడు నికుంభు డనియెడు క్రూరబలుల;
ఘోరభంగి సుగ్రీవుడు కుంభు జంప
కోపమున పరిమార్చె నికుంభు హనుమ.

కదనభూమి పడగ కుంభకర్ణుసుతులు
రాక్షసవిభుండు శోకపరవశు డగుచు
ఖరతనయు బంపె మకరాక్షు కదనమునకు
రామలక్ష్మణుల దునిమి రమ్మటంచు.

ఖరసుతుడు మకరాక్షుడు ఘనయశస్వి
ప్రల్లదంబులు పలుక సంగ్రామమందు
రామచంద్రుడు పావకాస్త్రమ్ము విడిచి
ధరణి గూల్చెను దైత్యులు పరువు లెత్త.

తండ్రి రావణునాజ్ఞ నౌదల ధరించి
ప్రణుతబలులైన రామలక్ష్మణుల జంప
ఇంద్రజిత్తు మహోద్ధతి నేగ దలచి
హోమ మొనరించి వడివెక్కె హేమరథము.

తేరిపై నభోవీథి అదృశ్యభంగి
తిరుగుచు దశాస్య తనయుండు తెరపిలేక
శాతసాయకఘోరవర్షంబు కురిసి
కటికచీకటి నెల్లెడ క్రమ్మజేసె.

రామలక్ష్మణులపయి శరాలు వైచె;
సైచి వారలు లక్ష్యవిస్తార శక్తి
దివికి జిమ్ముచు బాణాలు దిశ నెరింగి
ద్రుంపసాగిరి వారు తోడ్తోడ వాని.

క్రుద్ధుడగు మేఘనాదు డగోచరుండు
కదనరంగమునందున కపిచయమ్ము
శరపరంపర బరగించి చంపుచుండ
ఇనకులుం డంత శాత్రవు దునుమ నెంచె.

అస్త్రవిదు డింద్రజిత్తు మాయావి కాన
పశ్చిమద్వారమును దాటి వానరాళి
కాంచుచుండంగ వధియించె కాంత నొకతె
రథముపై జేర్చి సీతయన్ భ్రాంతి గొలిపి.

దీనతను గాడ్పుపట్టి మైథిలిని గాంచి
అశ్రుచయము విడిచి, కూడి అఖిలకపుల
శైల శృంగ మహావృక్ష సముదయంబు
తోడ నసురలతో చేయదొడగె రణము.

కపులచే దైత్యకోటి చీకాకునంద
భూరిదుఃఖాన హనుమ రాముకడ కేగి
సీత హతయైన విషయమ్ము చెప్పినంత
భూమి బడె రాఘవుడు శోకమూర్ఛితుండు.

భ్రాతృవత్సలు డతిభవ్యవర్తనుండు
రామభద్రు శీఘ్రముగ కరాల నెత్తి
కౌగిట గదించి యిట్లు లక్ష్మణుడు పలికె
శాంతవచనాలతోడ ప్రశాంతి గూర్ప.

"కావదయ్యె ధర్మము నిన్ను కష్టవేళ
ధర్మఫల మందుచుండి రధర్మపరులు
ధర్మమన్నది యున్నచో ధరణిలోన
అనుభవింతురె కీడు మహాత్ము లిట్లు?

ధర్మమొ? అధర్మమో రేడు తప్పకుండ
ఆచరింపంగ వలయును అదనుబట్టి
నీకు ప్రియ మొనర్పగనె జన్మించినాడ
క్రోధవశుడను రావణి గూల్తు నిపుడె.

అనగ సౌమిత్రితో రావణానుజుండు
దైత్యు నింద్రజిత్తును జంప త్వరపడుమని
శాత్రవుల సేనలో విభీషణుని గాంచి
పలికె మేఘనాదుండు కోపంబు గదుర.

"ఓ దురాత్మ! అరయ పితృవ్యుడవు నన్ను
కూలజేయగ వచ్చితె కులవినాశ!
నీతిమాలి విభీషణ! జాతివీడి
చేర వైరులపంచను సిగ్గులేదె?".

తనయు గాంచి విభీషణుం డనియె నిట్లు
"దైత్యుడనె కాని మెలగ నధర్మసరణి
అగ్రజన్ముని విడిచితి నందువల్ల
వదరకుము దుష్టుడా! కాలవశుడ వీవు."

దుర్మతియగు రావణి సాధుదూషితుండు
కారుకూతలు కూసె లక్ష్మణుని గాంచి
"నాదు బాణాలు నీదు ప్రాణాలు తీయ
కాంచు ఖలుడైన నీ యన్న కన్నులార."

పలికెద వదేల పరుషాలు పలువిధాల
అని శరాలు గుప్పింప రామానుజుండు
ఇంద్రజిత్తట్లు చేయగ ఎసక మెసగె
మనుజ దానవ సింహుల ఘనరణంబు.

రణవిశారదు లిరువురు రమ్యయశులు
ఆలమున రక్త మొలుక దేహాలనుండి
ఏకదీక్షతో పోరుచు ఎరుగ రయ్యె
శ్రమము నావంతయును మహాశ్చర్య మొదవ.

ధనువు గైకొని సంగ్రామతత్పరుండు
భీమబలవిక్రముండు విభీషణుండు
రాక్షసనిచయమును విదారణ మొనర్చె;
ప్రోత్సహించె వీరకపుల పోరు సలుప.

లక్ష్మణుండు రావణిని కూల్పంగ నెంచి
వాని! రథసారథిని త్రుంచివైచె తొలుత
శోకమందిన దైత్యుని చూచి కపులు
స్యందనమ్మును హయముల చదిపిరంత.

రాక్షసేంద్రసుతుండు ధైర్యమ్ము విడక
నేలపై నిల్చి నిశితశరాల ముంచ
లక్ష్మణుండు పరాక్రమలక్షణుండు
త్రిప్పి కొట్టెను వానిని తేజమలర.

ఆహవము మధ్యలోన రహస్యసరణి
పురికి నేగి రథమ్ముపై తిరిగి రాగ
అంది రాశ్చర్యమును రఘునందనుండు
వానరులు విభీషణుడు రావణిని గాంచి.

క్రోధవశవర్తి రావణు కూర్మిసుతుడు
శౌర్యశాలి సౌమిత్రి ఉత్సాహ మొప్ప
సమర మొనరింపగా పరస్పరజిగీష
రాఘవుండు ఖండించె సారథి శిరంబు.

స్యందనాశ్వంబులను విభీషణుడు చంప
రావణియు క్రింది కురికి శరాలు వేసె;
కడకు చచ్చెనతండు లక్ష్మణునిచేత
ప్రాణభయమున దైత్యులు పారిపోవ.

ఇంద్రజిత్తు నాజిని వధియించి నపుడు
తోడ నున్నట్టి జాంబవంతుండు హనుమ
రావణసహోదరుడు మెచ్చ వేవిధాల
అరిగె సౌమిత్రి వెంటనే అన్నకడకు.

భ్రాత లక్ష్మణు గని శుభవార్త తెలిసి
కదుముదంబున రాము డంకంబుపైని
కూరుచుండగ జేసి వాత్రుచ్చె నిట్లు
తనువు నిమురుచు పరమవాత్సల్యగరిమ.

"మేఘనాదుని దునిమి సుమిత్ర సూతి!
శుభము చేకూర్చినాడవు సుమ్ము నాకు
పాపచిత్తుని పుత్రశోకోపహతుని
సులభగతి రావణాసురు గెలువ గలను."

శీఘ్రముగ రాఘవుండు సుషేణు బిలిచి
లక్ష్మణ విభీషణుల కపుల నొనరింపు
స్వస్థచిత్తుల; అనగ ఆ క్షణములోన
అతడు శ్రమబాపె శల్య వైద్యమ్ము సలిపి.

మూడులోకాలు గెల్చిన ముద్దుకొడుకు
మరణమంద యుద్ధమున లక్ష్మణునిచేత
రక్తనేత్రమ్ము లగ్నివర్షమ్ము కురియు
చనియె నా సుందరాశోకవనికి విభుడు.

కత్తి చేపట్టి పుత్రశోకవివశుండు
దానవేశుండు కరుణావిహీను డగుచు
పుడమిజాతను వధియింప పూనినంత
మగువ విలపించె రామలక్ష్మణుల దలచి.

అపుడు సచివుండగు సుపార్శ్వు డసురపతికి
సాంత్వనోక్తుల బోధించె సాహసించి
"విశ్రవసునకు సుతుడవు విబుధమణివి
తగదు స్త్రీ వధ; అరి గెల్చి తరుణి గొనుము."

అసురనాథుడు పరమదురాత్ము డయ్యు
ధర్మవచనాలసారము దలచి మదిని
సీత జంపక సంక్రుద్ధసింహమట్లు
సైన్యమును బంపె కలనికి సభనుజేరి.

వానరనిశాచరుల రణభంగి తోచె
దైత్య దానవ పూర్వయుద్ధంబు పగిది;
కపులు వేడ రాక్షసుల నిక్ష్వాకువిభుడు
క్షణములో భస్మ మొనరించె శరమహాగ్ని.

దేవ గంధర్వ సిద్ధులు వేవిధాల
సన్నుతింపంగ రాముండు స్వజనుల కనె
"శివుడు నేను దక్క ఎరుగ రెవరు కూడ
అఖిలలోకాలలో ఈ మహాస్త్రశక్తి!"

రాక్షసస్త్రీలు లంకాపురమ్ము నందు
పతులు సుతులు హితులు చావ వగచి రిట్లు
"సకలలోకోత్తరము రామచంద్రుశక్తి
శూర్పణఖ మన్మథాకారు చూచె నెట్లు?

ఈ కురూపిణి రాము మోహింపనేల?
ఘోరముల కెల్ల నీమెయే కారణమ్ము;
దీర్ఘదర్శి విభీషణు దివ్యమైన
మాట వినగ నీ కష్టాలు మనకు గలవె?

శేషరాక్షసు లెల్లరు చేరిరాగ
శౌర్య గాంభీర్య యుతుడు రాక్షసవిభుండు
కదనమున కేగుచుండంగ కానవచ్చె
అశుభము లవెన్నొ మార్గమధ్యంబు నందె.

తరిమి కొట్టంగ కపులను దశముఖుండు
వీర్యయుతుడు సుగ్రీవుడు శౌర్య మెసగ
రాక్షసులపైని శైలవర్షంబు కురియ
వానరాసుర కదనంబు భయద మయ్యె.

ఘనుడు సుగ్రీవుడు సమరాంగణమునందు
క్రూరకర్మ మహోదరు కూల్చనేల
అంగదుండు మహాపార్శ్వు హతు నొనర్ప
దశముఖుదు క్రోధవివశుడై తాండవించె.

దిశల స్యందనరవము ప్రతిధ్వనింప
రాఘవుల గూర్చి సంగరరంగమందు
సీతపాణిగ్రహణమును చేతు ననుచు
చని కపుల జంపె తామసాస్త్రమ్ము నేసి.

రావణుం డేయు అస్త్రశస్త్రముల ద్రుంచి
లక్ష్మణుండు చూపగ పాణిలాఘవమ్ము
రాముపై తీవ్రబాణవర్షంబు గురిసె
ఎడతెరిపి లేక దనుజకులేశ్వరుండు.

రామచంద్రుడు కోదండరావ మొప్ప
సర్వ రావణశర వినాశమ్ము చేసె;
ఇరువురు జయేచ్ఛతోడ తా మిట్లు పోర
రామరావణయుద్ధమ్ము భీమ మయ్యె.

రామభద్రుండు వాడిశరాలు వైచి
దుష్టదానవపతిమేను తొలచివేయ
ఖండన మొనర్చె నా లక్ష్మణుండు కనలి
రావణేశు ధనుస్సు సారథిశిరమ్ము.

వడి జని విభీషణుదు రథాశ్వముల జంప
రావణుదు ధారుణికి దూకి రథమునుండి
వేయ నొక మహాశక్తి విభీషణు గని
అడ్డుపడె శౌర్యధనుడు రామానుజుండు.

అది మయుని మాయనిర్మితమైన శక్తి
అరివిఘాతుక మది హృదయంబు చొరగ
సకలభూతసంఘంబులు సంచలింప
అవనిపై బడి లక్ష్మణుం డందె మూర్ఛ.

సదయుడగు రాముదు విషణ్ణహృదయు డయ్యు
శక్తి దునిమి కౌగిటను లక్ష్మణుని జేర్చి
రావణుదు కొట్టగా శరవ్రజము చేత
తనువు, వానరవిభునకు హనుమ కనియె.

"భయమునందకుడీ కపివర్యులార!
రక్షణముసేయుడు మదీయ భ్రాత; నిపుడె
చంప రావణు కాల మాసన్న మయ్యె
చిరము వేచియుంటిని దీని కొరకె నేను.

వినుదు రావణు డింక జీవింపలేడు
మూడులోకాల నెల్లరు చూడు డయ్య!
పృథివి యున్నన్ని వాళ్లు ఈ ప్రథితరణము
విశ్రుతమ్ము విశిష్టమై వెలయు గాత."

పలికె నతడు సుషేణుతో భ్రాత గనుచు
"యుద్ధమున మరణింప సహోదరుండు
రమణితో నాకు పనియేమి? రాజ్యమేల?
నాకు నవసరమేమి ప్రాణాలతోడ?"

చెప్పె నూరడించుచును సుషేణు డిట్లు
"చూడగా లక్ష్మణు ముఖంబు సుప్రభంబు
రామ! ఖేదంబు వలదు సప్రాణు డితడు
మునిగియున్నట్లుగా తోచు మూర్ఛయందు."

అనియె నాతండు వెంటనే హనుమ గాంచి
"శీఘ్రముగ ఓషధినగంబు చేరి నీవు
దాని దక్షిణశిఖరభాగాన వెలుగు
నాల్గుదివ్యౌషధుల తెమ్ము నయగుణాఢ్య!

తనరు సౌవర్ణకరణి సంధానకరణి
ధరణి సంజీవని విశల్యకరణి యనగ
వానిచేత లక్ష్మణుమూర్ఛ నేను తేర్తు"
అనగ మారుతి వెంటనే యరిగె గిరికి.

ఆ మహాపర్వతశిఖర మందు కనగ
దీపములవోలె దిశలను తేజరిల్లు
ఉత్తమౌషధు లెన్నియో ఒప్పుచుండె;
వాని పోల్చుకో లేడయ్యె వాయుసుతుడు.

బుద్ధిశాలి హనుమ తలపోసె నిట్లు
"ఎరుగ జాలక ఓషధు లిందు నెవియొ
ఆలసింప, సౌమిత్రికి హానికలుగు
కాన నగమునే కొనిపోవ నౌను మేలు."

ఓషధీగిరి హనుమంతు డూపి యూపి
ఒక్కసారి బాహుద్వయి గ్రక్కదల్చి
కరమునం దాల్చి అంతరిక్షమున కెగసి
చేరి రఘురాము, పల్కె సుషేణుతోడ.

"సరిగ గుర్తింపలేక ఓషధుల నేను
తెచ్చినాడను కొంచు మద్రిశిఖరమ్ము"
అనగ నా సుషేణుడు కొనియాడి హనుమ
పిండె వలసిన ఓషధినుండి పసరు.

పోయగా దాని నాసికాపుటమునందు
క్షణములో లక్ష్మణుడు శౌర్యశాలి లేచె
శ్రేష్ఠవైద్యు సుషేణు పూజింప కపులు;
హనుమ గిరిని యథాస్థానముననె నిలిపె.

దివ్యతేజోవిశేషసందీప్తి నొప్పు
భ్రాత సౌమిత్రి గాంచి శ్రీరామవిభుడు
"అవని నీవులేని జయంబు వ్యర్థ" మనుచు
కనుల నీరు నింపంగ లక్ష్మణుడు పలికె.

"రామ! తగదు నీ వంద నైరాశ్య మిపుడు
నిల్పుకొనుము రావణు జంపి నీ ప్రతిజ్ఞ
వాంఛిత మ్మది చీకటిపడక ముందె
ప్రేమ మాపయి కరము వర్తిల్లు నేని."

రామ రావణ యుద్ధమారంభ మయ్యె
రావణుం డుండగా భూరిరథముపైని
నిలిచె నా రఘురాముండు నేలపైని
అరసి దానిని దివిజు లన్యాయ మనగ.

అంత సురపతిరథముతో అరుగుదెంచి
తరణివంశ్యునితోడ వచించె
"రామ! దేవేంద్రు డంపె స్వర్గంబునుండి
తావకజయమ్ము నర్థించి తన రథమ్ము.

కవచము శరాలు మఘువుని కార్ముకమ్ము
శ్రీకరమ్ములు వీనిని స్వీకరించి
రథము నెక్కుము నేను సారథిని కాగ
రావణాసురు జంప సంగ్రామమందు."

అనెడు మాతలి మాటల నాలకించి
కాంతిని తరుణభానుసంకాశమైన
అరదమునకు ప్రదక్షిణ మాచరించి
దాని నెక్కె రాముండు యుద్ధమ్ము సలుప.

రామరావణు లిరువురు రణములోన
సర్వశస్త్రాస్త్ర విద్యాప్రశస్తి నెల్ల
చూపుచుండంగ దశరథసుతుడు పలికె
పరుషముగ రావణునితోడ పరిహసించి.

"రాక్షసాధమ! మంచి మర్యాద లేక
పరుల పత్నుల గోరుట పాప మనక
వనములో నాదు సతిని వివశను నీచ!
అపహరించితి వీవు మాయాప్రవృత్తి.

నేను లేని సమయమందు దీనురాలి
దూష్యభంగిని గొనిపోయి దొంగపగిది
విఱ్ఱవీగుచుచుంటివి వీరు డనుచు
అగుదు విప్పుడె యమునింటి కతిథి వీవు."

ఉభయులకు మధ్య సాగు రణోర్విలోన
క్రోధపరవశు డసురుండు కొంతవడికి
అంతరంగమ్ము వైక్లబ్య మావహింప
తడబడియె నంత్యకాలమ్ము దాపురించి.

వడిగ సారథి రావణావస్థ నెరిగి
త్రోలె నవలికి రథమును తొట్రుపడక;
సూతు దూషింప విశ్వాస ఘాతుకునిగ
ప్రభువునకు బుద్ధిశాలి సారథి వచించె.

"తొలగ ద్రోలితి రథము నట్టులు నిజమ్ము
సంగరాంగణమున నీ యశస్సు నిలుప;
భక్తిభరితుడ తీర్తును ప్రభుఋణమ్ము"
అనుచు రణభూమి చేర్చె స్యందనము మరల.

దైత్యవిభు గెల్చు టెట్లని తలచుచున్న
రామభద్రుని గాంచి సంగ్రామసీమ
ఘనతపోధనుడైన అగస్త్యమౌని
పలికె నిట్టులు ప్రేమసంభరితు డగుచు.

"శత్రుసంహారకారియు శాంతికరము
దివ్యమహిమాన్వితము ఆదిత్యహృదయ
మెలమి నుపదేశ మొనరింతు నిపుడె నీవు
జపము గావించి పొందుము జయము రామ!"

కర్మసాక్షియు మీ వంశకర్తయైన
భాస్కరుని కొల్వు మయ్య! సభక్తికముగ
సకలభువనమ్ములకు ప్రవర్తకు డతండు
చంపగలవు రావణుని సంశయము లేదు.

విజయసిద్ధికి శ్రీరామ విభుడు వడయు
పావనాదిత్య హృదయంబు భక్తిమీర
వెంటనే అగస్త్యుడు వినువీథి నరిగె,
సలిపె రాముడు మంత్రరాజమ్ము జపము.

మనసులోన జపింప ముమ్మారు రవిని
సూర్యభగవాను డా దివ్యసుందరుండు
కట్టెదుట దోచి పలికె రాఘవునితోడ
"అనిని మరణించు నేడు దశాననుండు."

దీవనలతోడ నత్యంతదీప్తి గన్న
రామభద్రుండు భీకరరవ మెసంగ
వచ్చు చున్న రావణరథవరము గాంచి
ఇంద్రసారథి మాతలి కిట్టు లనియె.

"అల్లదే చూడు మాతలి! అరుగుదెంచు
అమితవేగాన దశముఖుస్యందనమ్ము;
భద్రముగ నీవు నడపుము భవ్యరథము
ఇట్టె వైరి రావణు వధియింతు నేను."

వేగ రిపులనడుమ చెలరేగె రణము;
వారలు పరస్పర మ్ముంపవాన గురియ
రామరావణ భయద సంగ్రామ మరసి
భూతగణము కడుంగడు భీతి నందె.

పోరుచును వారు చేరంగ వ్యోమపథము
కనుగొనిరి సర్వలోక భీకరము దాని
కపులు నసురులు యుద్ధము కట్టిపెట్టి
కరము నిశ్చేష్టు లగుచును మరచి పగను.

అరసి రామరావణుల ఘోరాహవమ్ము
సిద్ధ గంధర్వ కిన్నరశ్రేష్ఠు లెల్ల
జపముచేసిరి రాముని జయము కోరి;
భండనము చూచి రటు రెప్పపాటు లేక.

రాము డద్భుతశక్తి శరమ్ము విడువ
రయముతో నది పగతు శీర్షమ్ము దునిమె;
శిరము క్షితి బడ నంది రందరును ముదము
చిత్రముగ వైరికి మరొక్క శిరము మొలిచె.

చండవిక్రము డా రామచంద్రు డటులె
రెండవశిరమ్ము ద్రుంప మరొండు పొడమె;
వరుస ఖండింప మొలిచె; రావణవిభుండు
చావకుండ ఏకోత్తరశత శిరాలు.

పర్వ నిర్వారి సంగ్రామ ముర్వి కదల
పలికె మాతలి బుద్ధివైభవము తనర
దశరథాత్మజుతోడ "ఆ దైత్యనాథు
అరిని గూల్పుము ధాత్రమహాస్త్రశక్తి."

కౌతుకము నెమ్మనమ్మున గడలుకొనగ
విలయకాలాగ్నిశిఖవోలె వెలుగుదాని
క్రూరసర్పంబువలె బుసకొట్టుదాని
అందుకొనియె రాముండు బ్రహ్మాస్త్ర మపుడు.

అతులశక్తియుతంబు బ్రహ్మాస్త్రవరము
అమిత మగు వేడుక సరోరుహాసనుండు
మున్ను మహిమాన్వితు డగస్త్యముని కిడంగ
కుంభసంభవుండు తనకు కూర్మి నొసగె.

దాని విడువ రాము డభిమంత్రణ మొనర్చి
రావణుని వక్షమును జీల్చి రయ మెసంగ
చేరె నదియు శ్రీరాము తూణీరమందు;
దైత్యవిభు విల్లునమ్ములు ధరణి బడగ.

ప్రాణములు పోవ వేగమే రథమునుండి
అవని బడియె రావణుడు బ్రహ్మాస్త్రహతుడు
దాని గని నలుగడ పార దైత్యగణము
శేషదనుజుల తరిమిరి చెలగి కపులు.

అప్సరోంగన లెల్లరు ఆడిపాడ
నభమునందున దేవదుందుభులు మొరసె
విరులవాన కురిసె నభోవీథినుండి
సిద్ధమునిజను లంది రశేషముదము.

సురమునివిరోధి రావణాసురు వధింప
హనుమ సుగ్రీవలక్ష్మణు లంగదుండు
జాంబవంతుండు తను మెచ్చ సంతసించె
రఘుకులోద్వహుడైన శ్రీరామవిభుడు.

అవని బడి యున్న రామశరాభిహతుని
రావణుని గాంచి సంగరరంగ మందు
ఖిన్నుడై విభీషణుడు శోకించె నిట్లు
"మహిని బడియెనే నేడు నీ మకుట మకట!

అమితతేజస్కుడవు విక్రమాధికుడవు
నాదు వాక్యాలు నాడు విన్నావు కావు;
నీవె కయ్యంబులో మరణింప నిట్లు
ఇంక తలప దైత్యులకు ది క్కెవ్వరయ్య?"

రావణానుజు జూచి శ్రీరాము డనియె
"క్షాత్రధర్మ యుక్తముగ సంగ్రామమందు
పోరి వీరమరణమందె శూరు డితడు
భావికర్తవ్య మెంచుము బాధవలదు.

సత్యము గ్రహించి ఆ విభీషణుడు పలికె
"అని నిత డెరుంగ డెన్నడు నపజయంబు
దానధర్మాలుచేసె నుదార బుద్ధి
ఆచరించెను నిష్ఠ మహాతపమ్ము.

**అలరె** రావణుండు మహాహితాగ్ని యనగ
**చక్క**గ కనియె నిశ్చలజ్ఞాన మితడు
**కాం**చె నసమానకీర్తి జగాలలోన
సెల వొసంగు మే కృత్యాలు చేయుదగునొ."

**సాధు** గుణుడు రాముం డనె సరసఫణితి
కరము శ్రద్ధ స్వర్గవిధాయకంబులైన
ప్రేతకృత్యాలు సలుపుము ప్రేమమీర
ఇతని మరణంబుతో వైర మెల్ల సమసె.

వరసురవిరోధి వల్లభు మరణవార్త
చేరగా రాణివాసమ్ము శీఘ్రగతిని
వనిత లెల్లరు దుఃఖవారినిధి మునిగి
సమరభూమిని వెదకిరి స్వామికొరకు.

వసుధ బడియున్న పతిని రావణుని గాంచి
బహువిధంబుల అతని వైభవము దలచి
రాక్షసస్త్రీ లొనర్చి రాక్రందనమ్ము
దైవగతి మాన్ప నెవ్వాని తరము ధరణి?

జ్యేష్ఠపత్ని మందోదరి చేరి విభుని
కనుల దుఃఖాశ్రు లొలుక నీ కరణి నేడ్చె
"సురలు యక్ష గంధర్వ భూసురులు ఋషులు
**భీతి** పరచిరి కాదె నీ పేరు వినగ.

కూలితివె నాథ! మూడులోకాలు గెలిచి
రణమున మనుజమాత్రు కరాల నిట్లు?
విష్ణుదేవుండు నిను సత్యవిక్రముండు
శాశ్వతుడు లోకహితకాంక్ష చంపె నేడు.

చెప్పితిని రాముతో పగ తప్పటంచు
నన్ను లక్ష్యపెట్టక స్వజనమ్ముతోడ
మరణ మందితి విట్టులు సిరితొలంగ;
అశుభ మొదవదె పాపకృత్యంబు సలుప?

మహితసౌందర్యవతి సీత మాన్యచరిత
కామవశత మహాసాధ్వి నామె దెచ్చి
మృత్యువును కోరుకొంటివి; సత్య మరయ
నాదు సౌభాగ్య మెల్లను బూది గలసె.

రావణానుజుతో నంత రాము డనియె
"వనిత లందరి నింక న వ్వలకు బంపి
అంత్యకర్మము లొనరించి యగ్రజునకు
యశము నందుము నీవు మహాత్ము డతడు."

ధార్మికుడు విభీషణుడు వేదవిహితముగ
శ్రద్ధతో ప్రీతితోడ సంస్కార మెల్ల
జరిపి రావణస్త్రీలను పురికి బంప
పరమముదమందె రాముడు ప్రథితకీర్తి.

గరుడ గంధర్వ యక్ష కిన్నర గణమ్ము
రావణుని వధ రామపరాక్రమంబు
కపుల రణకౌశలమ్ము లక్ష్మణుని శక్తి
వేవిధాల పొగడి వినువీథి చనియె.

రామభద్రుని యాన శిరంబు వంచి
మాతలి రథంబు గొనియేగ మఘువు కడకు
కౌగిటను జేర్చి సుగ్రీవు గారవించి
భ్రాతకు వచించె నిట్టులు రఘువరుండు.

"లక్ష్మణా! నీవు లంకాపురమ్ములోన
శీఘ్రమే విభీషణు నభిషిక్తు చేయు
ఒదవును ముదమ్ము నాకు; మహోపకారి
భక్తుడే కాక మన కనురక్తు డతడు."

విభవ మెసగ సౌమిత్రి విభీషణునకు
సలుప పట్టాభిషేకంబు శాస్త్రవిధిని
రాము మంగళద్రవ్యాల రమ్యరీతి
పూజ లొనరించె నాతండు భూరిభక్తి.

కానుకల మిత్రు పరితృప్తికై గ్రహించి,
ప్రాంజలించి భక్తిని తన పార్శ్వమందు
కరము పొంగెడు కమనీయగాత్రుడైన
ఆంజనేయుని గని రాము డనియె నిట్లు.

"మారుతీ! విభీషణు ననుమతిని పొంది
రాణివాసము జేరి హర్షంబు గాగ
భూమిజకు మన విజయమ్ము క్షేమమెల్ల
తెలిపి, కొనిరమ్ము ఆమె సందేశ మేమొ."

స్వర్ణమయ శింశుపాఖ్య వృక్షంబుక్రింద
హీనసంస్కారయై కృశియించి యున్న
జనకజాతను గాంచి వందన మొనర్చి
చెప్పె నీ రీతి కపివంశశేఖరుండు.

"నీచ రాక్షసనాథుడు నీల్గె నేడు
అరుల గెలిచి నీ మగడు కృతార్థు డయ్యె
రాజుగా విభీషణుజేసి రామవిభుడు
తెలుపుమనె; నీకు కష్టంబు కలుగ దింక."

ఆంజనేయుని కిట్లు ధర్మాత్మ పలికె
"పవనపుత్ర! పరమశుభవార్త నీవు
చెప్పి చేకూర్చినావు విశేషముదము
తుల్యబహుమాన మొసగంగ తోపదయ్యె.

పల్కులందు ప్రోడవు బృహస్పతివి బుద్ధి
ధార్మికుండవు శౌర్యసత్త్వాలు ధృతియు
నయము వినయము నాభరణాలు నీకు
శోభితుండ వీవు సకలసుగుణవితతి."

అంత భక్త్యంజలి ఘటించి హనుమ పలికె
"పతివియోగ దుఃఖితవైన సతిని నిన్ను
కసిగ వేధించినట్టి రాక్షసరమణుల
హత మొనర్తును నేను నీ వనుమతింప."

అ మ్మహాదేవి మారుతి కనియె నిట్లు
"కినిసి దాసీజనంబు శిక్షింప దగదు
మెలగుదురు వారు రాజాజ్ఞ తలధరించి;
పూర్వదుష్కృత ఫల మేను పొందినాను."

రాము పాలికి జని సీత క్షేమవార్త
వినిచి "నిను జూడ వాంఛించె జనకతనయ"
అనుచు భక్తివినమ్రుడై హనుమ దెలుప
దనుజవల్లభుతో రాము డనియె నిట్లు.

"వెంటనే భూమిపుత్రి రప్పింపు మిటకు
సౌమ్య! లంకాధినాథ! సుస్నాత జేసి
క్రమకాంచనాంబరములు కట్టబెట్టి
అతులదివ్యభూషల నలంకృత నొనర్చి."

సీత నట్లొక రమణీయశిబికలోన
వినుతమర్యాద దెచ్చె విభీషణుండు;
సుందరంబగు పతిమోము చూచినంత
చిరవిరహదుఃఖ భరమున చెలువ యేడ్చె.

చిన్నవోయిన పడతిని సీత గాంచి
నిష్ఠురోక్తుల రాముండు నిందసేసె
"వీర రాక్షసవధను గావించి నేను
మూడుభువనాల బడసితి భూరియశము.

లక్ష్మణుని విక్రమమ్ము సఫలత గడించె
వాయుసుతు పరిశ్రమము సాఫల్య మొందె
సార్థకం బయ్యె సుగ్రీవుసాయ మెల్ల
సఫల మయ్యె విభీషణు శ్రమము కూడ.

జగ మెరింగె పౌరుషము; నా శ్రమ యదెల్ల
రఘుకులాచార భవ్యధర్మమ్ము నిలిపి
తొలగ నపవాదు నా కీర్తి నిలుపు కొరకె;
ఎరుగు మెంతమాత్రమ్ము నీ కొరకు గాదు.

రావణాంక పరిభ్రష్ట వీవు తలప
దుష్టజనదృష్టిచే పరిదృష్ట వీవు
ఆత్తచారిత్రసందేహవైన నిన్ను
స్వీకరింపగ జాలను స్వేచ్ఛ జనుము."

కాంచువారల హృదయాలు కరగిపార
బాష్పగద్గద కంఠియై పలికె సీత
"తోచితివె నీకు నే నొక నీచ గాగ
ఎరుగవే మది చిరము కాపురముచేసి?

అతుల మగు నాదు శీలంబు నరయకుండ
చెడు కినుక నెంచి నావు నా స్త్రీత్వమొకటె"
అనుచు దుఃఖించి మరది లక్ష్మణుని గాంచి
చితిని చేర్పంగ నప్పుడు సీత కోరె.

భ్రాత మోమున భాసించు భావ మెరిగి
చింతతో లక్ష్మణుడు చితి సిద్ధపరచె;
సీత వేగ పతికి ప్రదక్షిణము చేసి
పలికె వహ్నికి భక్తి నంజలి ఘటించి.

"నిచ్చలు పతిదలంచెడి సచ్చరితను
సాధువృత్తను వ్రతనిష్ఠ సాధ్వి నేని
సకలదిక్పాలకులు మెచ్చు సకియనేని
కీలి నా శీలమెరిగి రక్షించుగాత!"

జానకీదేవి గొంకును జంకులేక
వహ్నిజొచ్చె చూపర దిశాభ్రాంతినంద
పావకాహుతియైనట్టి పడతి గాంచి
దేవ దానవ మునితతి దిగులుచెందె.

ప్రజలు పలువిధాల పలుక రామవిభుడు
క్షణము చింతించె నంతరంగంబు నందు;
బ్రహ్మయు మహేశ్వరుండు దేవతలు వచ్చి
కరములు మొగిడ్చి వీరరాఘవున కనిరి.

"కర్త వరయుంగ సర్వలోకాల కీవె
మిన్నకుంటివి ఎరుగవే నిన్ను నీవు;
జ్ఞానికోటిలో మిన్నవు జలజనయన!
సీత అగ్నిజొర ఉపేక్షసేయ దగునె?"

పరమధర్మనిష్ఠుడు రామభద్రు డనియె
"దశరథక్ష్మాతలేశు నందనుడ నేను
మనుజమాత్రుండ నంచు నా మది దలంతు
పలుకగలవాడు ననుగూర్చి వనజభవుడు."

బ్రహ్మ వచియించె నిట్టులు రాము నరసి
"రఘుకులాన్వయ! సత్యవిక్రమ! విను మిది
నీవు నారాయణుండవు నీదు పత్ని
సీత శ్రీలక్ష్మి; సత్యము చెప్పుచుంటి."

ఆదిమధ్యాంతములు లేక వేదవేద్య!
వెలయుదువు కృష్ణు డంచును విష్ణు వనుచు
సిద్ధసాధ్యాశ్రయుం డీవ సృష్టి కెల్ల
ఆదికర్తవు ధర్తవు హర్త వీవ.

నరుడ వైతివి దానవనాథు దునుమ
దలచి, దండించి తా దైత్యు దనుప మమ్ము
పరమసంతుష్టి నీ వింక ధరణినేలి
దివిని జేరుము శ్రీరామ! దివ్యమూర్తి!"

అగ్నిహోత్రుడు బ్రహ్మవాక్యాలు వినుచు
అంకతలమున గొనివచ్చి అవనిసుతను
పూర్వసుందరమూర్తితో పొలుచుదాని
పలికె రఘుకులస్వామి కర్పణ మొనర్చి.

"లేదు వైదేహిలో పాపలేశ మేని
త్రికరణంబుల నీమె సాధ్వీలలామ
నిన్ను మీరలే దే యొక్క నిముసమందు;
ఈ పవిత్రచరిత్ర నింకేలు కొనుము."

కంట తడిపెట్టి రాముడు క్షణము, పలికె
"చూడ సత్యము మైథిలి శుద్ధురాలు
చిరము దైత్యునంతిపురి వసించుకతన
పలుక కుందునె జగములు పలువిధాల.

సత్యనిరతుండ జానకి సాధ్వి యనియు
మచ్చలేని దనియు ఆమె మనసు నెరిగి
చేకొనక అట్టులు పరీక్షచేసినాడ
అఖిలజగములలోన ప్రత్యయము కలుగ.

పుడమిసుత మూడులోకాల పూతచరిత
నను విడిచి యోర్వజాలదు క్షణము గూడ
జానకిని బాసి నే నుండజాల నెపుడు
చేయుదును లోకమాన్యులు చెప్పినట్లు."

రఘువరాన్వయరత్నము రామవిభుడు
సీత ప్రియువచనమ్ముల చేరదీయు
పొగడి రెన్నియో విధముల మునులు సురలు;
రామచంద్రుని కనె శంకరప్రభుండు.

"పరమపురుష! శ్రీరామ! మా భాగ్యవశత
క్రూరరావణు ఘోరాజి కూల్చితీవు;
చేయలే రెవ్వ రటువంటి శ్రేష్ఠకర్మ
సమసె లోకాల నెలకొన్న సాధ్వసంబు.

భరతు కౌసల్య కైకను మరి సుమిత్ర
వీరి నెల్లర నోదార్చి విమలమతిని
పట్టమును నీ వయోధ్యలో గట్టుకొనుము;
ప్రజల రంజింప జేయుము ప్రథితకీర్తి.

నిలిపి నిస్తుల మిక్ష్వాకుకులము పేరు
అశ్వమేధమహాయజ్ఞ మాచరించి
అల వికుంఠపురమ్మున కరుగు మయ్య;
కనుగొను మతండె మీతండ్రి గగనమందు."

రాము డనుజుతోడ విమానరాజమందు
దివ్యవస్త్రభూషితుని దేదీప్యమాను
కన్నతండ్రిని కనులార గాంచియపుడు
వందనమ్ము లొనర్చెను పరమభక్తి.

ఆ మహాతేజుడైన రాజాధిరాజు
రామచంద్రుని ధన్యుని ప్రాణసముని
అధివసింపగ జేసి నిజాంకపీఠి
శిరము మూర్కొని వేడ్క వచించె నిట్లు.

సత్యమిది దేవమౌని పూజలనుగూడ
కాననైతిని సుఖము స్వర్గంబునందు
పరమపూరుషు ని న్నెడబాసియుంట;
కాంచ నిన్ను లక్ష్మణుని దుఃఖమ్ము తొలగె.

రామ! రావణవధయె కారణముగాగ
దేవతల వ్యూహ మిప్పుడు తెలిసె నాకు;
పురుషపుంగవ! నీ వింక పురికి నేగి
ప్రజల సుఖముగ నేలుము పట్టమంది.

భక్తుడు నృపధర్మవిదుడు భరతుతోడ
కూడియున్నట్టె నిను జూడ కోర్కెపొడమె"
అనఘు సౌమిత్రిని పరిరంభణ మొనర్చి
అనియె నిట్టులు దశరథావనివిభుండు.

"పరమసాధ్వికి వదినెకు భ్రాత కెపుడు
వత్స! సేవచేసితి వీవు భక్తియుక్తి
ప్రాప్తమయ్యె ధర్మఫలంబు పరమయశము;
రామచంద్రు నెరుంగుము బ్రహ్మ మనుచు."

'పతినిరంతర సేవలో వరలు తల్లి!
పాపదూరగ ని న్నిట్లు చూపదలచి
భర్తచేసిన పనికి కోపమ్ము వలదు"
సీత నిటు తేర్చి శ్వశురుండు చేరె దివికి.

రాముతో పల్కె నింద్రుడు ప్రాంజలించి
"మమ్ము రక్షింప స్వీయమౌ మాయబూని
రావణు వధింప భూమిభారమ్ము తీరె
చేయ నేదేని కలదేని చెప్పుమయ్య!"

అపుడు శ్రీరాము డింద్రున కాజ్ఞ నొసగె
"ఋక్ష వానరు లనిని నా పక్షమూని
ప్రాణములు కోలుపోయిరి; వారలెల్ల
బ్రతికి పూర్వబలస్థితి బరగవలయు."

వినయ మెనయ నింద్రు డమృతవృష్టి గురియ
అసువు లర్పణచేసిన అఖిలకపులు
నిదురలేచిన వారలు నిలిచినట్లు
బ్రతికివచ్చి; రెల్లరు నంద నతిముదంబు.

వనజభవు డమరేంద్రుడు వహ్ని వరుస
రాము ననుమతి దివిజవర్గంబు చనగ
వినయ వినిమితు డౌచు విభీషణుండు
కోరె రాముని తనదు సత్కారమంద.

ఉత్తముడు రాము డొసగె ప్రత్యుత్తరంబు
"నిరుపమానంబు నాయెడ నీదు భక్తి
వేగ బంపు మయోధ్యకు వెడల దలతు
భరతు డట పూనియున్నాడు భవ్యదీక్ష."

పంపగా నట్లె కృతకార్యు వాంఛ నెరిగి
రాక్షసవిభుండు శీఘ్రమే రాము నెదుట
నిలిపె నా విశ్వకర్మవినిర్మితంబు
పుష్పభూషిత రమణీయ పుష్పకంబు.

శస్తచరితుని కపిరాజు సత్కరింప
రాక్షసేశు నర్థింపగ రాఘవుండు
వివిధరత్నహారాలతో వినుతభంగి
కపుల నాతండు తగురీతి గౌరవించె.

ఆ విమానరాజంబును హర్ష మొదవ
రాము డెక్క, విఖ్యాతపరాక్రముండు
సీత నతడు వామాంకసంస్థిత నొనర్ప
అనుజుడగు లక్ష్మణు డధిరోహణముసేసె.

పుష్పకము మీద సాకేతపురికి చనెడు
ఇనకులుండు సుగ్రీవున కనియె నిట్లు
"వానరేశ్వర! కిష్కింధవరకు రాగ
మమ్ము చేరుము సర్వసైన్యమ్ముతోడ."

సేనతోపాటు సుగ్రీవవానరపతి
అట్టులె విభీషణుడు రాక్షసాళి పురికి
వేడుకలు జూడ గొనిపోవ వేడి రాము,
బయలుదేరి రెల్లరును పుష్పకముమీద.

రామునాజ్ఞను వ్యోమమార్గమ్ము వెంట
సాగుచుండ విమానము జవము మీర
పరమసంతోషచిత్తుడై పలికె నిట్లు
జనకజాతను గాంచి ఇక్ష్వాకుకులుడు.

కాంచు మా త్రికూటశిఖరాగ్రమ్ము పైని
విలసితంబగు లంకను, విశ్వకర్మ
నిర్మితంబది; మృతు డయ్యె నేలగూలి
క్రూరరాక్షసనాథుడు కుటిలు డటనె.

నీలవేణి! ఈ క్షోణినే నిహతు లైరి
వేలుగా లక్షలుగ దైత్యవీరవరులు;
కడలి యొడ్డున నిట రేయి గడపినాము
నలుడు నా ఆజ్ఞ సేతుబంధన మొనర్చ.

దేవి! సేతుబంధంబను తీర్థ మిందె
దీనుడై చేరె నను రావణానుజుండు;
ఇదిగొ కిష్కింధ నే వధియించి నాడ
వాలి; నే డిది; సుగ్రీవపాలితమ్ము.

మిగుల వేడుక పడినంత మగువ సీత
పుష్పకముమీద సాకేతపురిని జూడ
రాణులను తేర సపరివారమ్ముగాగ
కీశపతికి శ్రీరాము డాదేశ మొసగె.

నగచరేశుని రాణు లానంద మొంది
ఆ విమానము నెక్క న య్యదియు కదలె;
పలికె రాముడు "అదిగో! పంపాసరస్సు
కామవశత నేడ్చితి నిను కానలేమి.

శబరి మద్భక్తురాలి ఆశ్రమము కనుము;
అతిబలు కబంధు నిచట చంపితిని నేను
ఇట జటాయువు బలిమితో నెదిరిపోరి
ప్రాణములు కోలుపోయె రావణునిచేత.

పర్ణశాలను గౌతమి పంచవటిని
కాంచు మిచ్చట పదియేండ్లు గడపినాము
అదిగో! అత్రిమహాముని ఆశ్రమంబు
సాధ్వి అనసూయ గంటి మిచ్చటనె మనము.

చిత్రకూట మహానగశిఖర మదిగో!
పూర్ణభక్తిని నను గొనిపోవ పురికి
ఇచ్చటికె నాడు భరతుండు వచ్చెగాదె!
కాంచు మల్లదే పూతగంగాస్రవంతి.

చారుశీల! చూడుము శృంగిబేరపురము
అయ్యె నిచ్చటనె గుహసమాగమంబు
యూపమాలిని అదె సరయూస్రవంతి
ఆమ్రవనసుందర మయోధ్య యదియె దేవి!

రమ్య తరమదె కోసలరాజధాని
క్షేమముగ మరల నిటకు చేరినాము
మ్రొక్కు మద్దాని కంచు రాముడు వచింప
కాంచి రెల్లరు లేచి ఉత్కంఠతోడ.

నాటితో సరిగా పదునాలుగేండ్లు
పూర్ణ మగుచుండ పంచమి ప్రొద్దునందు
రాఘవుడు భరద్వాజునాశ్రమము చేరి
తపసి గని మ్రొక్కె సీతతో తమ్ముతోడ.

"వారు మాతలు బ్రదికియున్నారె స్వామి!
సుఖియె కద భరతుండు నా సోదరుండు
క్షేమయుక్తులె ప్రజలు సాకేతపురిని"
అటులు రాముడు ప్రశ్నింప అనియె మౌని.

"క్షేమ మెల్లరకు నీదు గృహమునందు;
భరతుడు జడలు ధరియించి పాలనమ్ము
పాదుకలచేత జేయుచు భక్తిమీర
నీదు రాకను వాంఛించు నీరజాక్ష!

సమరదుర్జయులైన రాక్షసుల గూల్చి
జగములకు శాంతి సుఖము లొసంగినావు
సర్వ మెరిగితి నా తపశ్శక్తి వలన
దివ్యముగ రేపు వెడలు మాతిథ్య మంది."

తాపసేంద్రుని పలుకు లౌదలను దాల్చి
విభుడు కోరె "అయోధ్యకు వెడలు నట్టి
మార్గ మంతట జేయుము మహితశక్తి
వివిధ ఫలపుష్పభరితమై వేడ్క గూర్చ."

వరమటు లొసంగగా భరద్వాజమౌని
బహుల ఫలపుష్పపత్రాల వరలె తరులు;
ప్లవగముఖ్యులు మౌనీంద్రు ప్రస్తుతించి
చిగుళులు ఫలాలు సుమములు స్వేచ్ఛ దినిరి.

రాము డిట్టులు విజమనోరథము దెల్పి
పవనజుని ముందుగా పంపె భరతు కడకు
"క్షితిపు గృహమందు నెల్లర క్షేమ మెరిగి
మా కుశలవార్త చెప్పు నా మాట గాగ.

రాక్షసు డపహరించుట రమణి సీత
కీశపతి వాలివధయు సుగ్రీవమైత్రి
వేడుటయు శరణమ్ము విభీషణుండు
రావణు వధించి రాక సర్వమ్ము చెపుము.

పరిజనముతోడ నిటనుండి తరలిరాక
భరతునకు దెల్పి హావభావాలబట్టి
అప్పగింప దలచెనొ రాజ్యమ్ము నాకు
ఏలగా నెంచెనో తానె ఎరుగు మయ్య."

రాము నాజ్ఞను వాయుమార్గంబుబట్టి
మనుజ రూపంబుతో హనుమంతు డేగి
శృంగిబేరపురంబును జేరి గుహుని
కాంచి తెలిపె రామవిభునాగమనవార్త.

రాజధానికి క్రోశదూరంబునందు
నందిగ్రామమ్ము జేరి ఆనంద మెసగ
ఆంజనేయుడు కనె నొక ఆశ్రమంబు
బహుళ తరు వల్లరీ చయ భాసురంబు.

నారచీరలు కృష్ణాజినంబు దాల్చి
భ్రాతకోసము జడలతో వరలుచున్న
దీను ఫలమూలభోజిని మౌనధనుని
బ్రహ్మఋషితుల్యు సద్భక్తు భరతు నరసె.

భరతుతో హనుమ పలికె ప్రాంజలించి
"రామచంద్రు డవక్రపరాక్రముండు
సీతతో వచ్చుచున్నాడు శీఘ్రగతిని
రావణాసురు వధియించి రణమునందు.

పరవశంబున మోదబాష్పాలు రాల్చి
భరతు డాతని కౌగిట బట్టి పలికె
"దేవుడవు నీవు శుభవార్త తెలిపినావు
గోశతసహస్రములను గైకొనుము నీవు.

మారుతీ! నీ కొసగెద గ్రామాలు నూరు;
సత్కులీనల సర్వభూషణయుతలను
హేమవర్ణల కన్యల శ్రీమహితల
పదియునార్వుర నిచ్చెద భవ్యమతుల."

విపులసమ్మోద మట్టు లావిర్భవింప
హనుమ నాసీను జేసి సమ్మర్దభంగి
భ్రాతృవత్సలు డైనట్టి భరతు డనియె
"కపులతో రామునకు మైత్రి కలిగె నెట్లు?"

రావణకృతమ్ము సీతాహరణమునుండి
మహితసుగ్రీవ కపిపతి మైత్రినంది
సేతువును గట్టి రావణు చెండువరకు
రామకృత్యాలు హనుమ సర్వమ్ము తెలిపె.

పొంద తన అభీప్సితము ప్రపూర్ణసిద్ధి
శాంతుడును దాంతుడును తాపసవ్రతుండు
సాధుశీలుడు భరతుడు శస్తగుణుడు
ప్రాజ్ఞుడతడు శత్రుఘ్నున కాజ్ఞ నొసగె.

సర్వసన్నాహములు చేసి సముచితముగ
ఎదురుకొనవలె శ్రీరాము ముదము గదుర
ఆలయాలలో సర్వచైత్యాలలోన
సకలదేవతాపూజలు సలుపవలయు.

సక్రమంబుగ ఏర్పాట్లు సాగిపోవ
గాయక గణిక ద్విజమునిగణముతోడ
బంధుపరివారములతోడ బయలుదేరి
చనియె భరతుండు రామదర్శన మొనర్ప.

రామపాదుకాయుగము శిరాన బూని
చీరకృష్ణాజినాంబరధారి యతడు
రాజదార లమాత్యులు రాగ వెంట
పరమభక్తి నందిగ్రామపురము జేరె.

చూడగనె పుష్పకం బతిసుందరంబు
అంబరాన దవ్వున సమీరాత్మజుండు
అనియె "అల్లదిగో వ్యోమయాన మలరు
రమ్యరమణీయ బహుదివ్యరత్నదీప్తి."

బ్రహ్మమానససృష్టి పుష్పకమునందు
కనుడు రాముడు సీతతో అనుజుతోడ
తనరు సుగ్రీవుతో విభీషణుని తోడ
కపివతంసులతోడను కాంచు డదిగో."

ప్రజ సమస్త మాబాలగోపాల మంత
మిగుల గీర్తింప రఘువరు మిన్నుముట్ట;
పుడమి తాకంగ జేయించి పుష్పకంబు
భ్రాత భరతు నెక్కించెను రామవిభుడు.

సన్నిధి గని రామునకు సాష్టాంగ మెరగి
పలికె భరతుండు సంతోషపరవశుండు
"పరమధన్యుండ శ్రీరామభద్ర! నేను
అభిమతార్థ సంసిద్ధి నే డంద గంటి."

స్నిగ్ధవీక్షణ నికరంబు చెలు వొసంగ
బరపి శ్రీరామచంద్రుండు భరతు ననుజు
కౌగిటంజేర్చి ప్రీతి నిజాంకమందు
కూరుచుండంగ నొనరించె కూర్మి యెసగ.

భరతు గనినంత హర్షసంభరితుడైన
లక్ష్మణుండు మహాశుభలక్షణుండు
మ్రొక్క నా భరతుండు సమ్మోద మంది
అనుగు సోదరుని పరిరంభణ మొనర్చె.

సీతచరణంబులకు మ్రొక్కి క్షేమ మడిగి
భరతు డా తల్లి కాంచంగ కరము ముదము
పిదప సుగ్రీవవిభుని సౌహార్దకలితుని
ప్రకటన మొనర్చె పంచమభ్రాత యనుచు.

అనియె నా భరతుడు విభీషణుని గాంచి
"తలప దుష్కరకార్యంబు సులభ మయ్యె
ధర్మనిరత! విభీషణ! తగ జరించి
నిస్తులంబైన సాయంబు నీ వొనర్ప."

పరమభక్తిని శత్రుఘ్ను డరసి రాము
పాదయుగళికి నొనరించె వందనమ్ము
అట్లె సీతకు సౌమిత్రి కాచరింప
ఆదరించిరి వార లత్యంతకరుణ.

ప్రథితకౌసల్య కానందవర్ధనుండు
భక్తిమీర సుమిత్రకు ప్రణతి సల్పె
మ్రొక్కె నాతదు కైకకు ముదము గదుర
శ్రేష్ఠకులగురుడైన వశిష్ఠమునికి.

జయము జయ మంచు పురినున్న జనులు మ్రొక్క
జానకీజాని నలరించె స్వాగతంబు
పాదుకాద్వయి భ్రాతకు భక్తిదొడిగి
భరతు డనియె వినయ భయభరితు డగుచు.

"నీవు నిర్జనవనికేగ, నీ మహాజ్ఞ
నీదు పాదుకలం గొని నేటి దనుక
పురిని రక్షింప నది పరిపుష్ట మయ్యె
రామభద్ర! గైకొనుము నీ రాజ్యలక్ష్మి."

మిత్రసహితుడై సైన్యసమేతు డగుచు
రామచంద్రుడు భరతు నాశ్రమము చేరె;
రామునాజ్ఞ విమానము వ్యోమవీథి
చని కుబేరు జేర నతండు కనియె ముదము.

పావనేక్ష్వాకు వంశవివర్ధనుండు
రామభద్రుండు పరమహర్షమ్ము నంది
కలశభవుడు వశిష్ఠుండు కులగురునకు
భక్తి నొనరించె పాదాభివందనమ్ము.

ఆ మహర్షిని నిలిపి మహార్ఘపీఠి
వీర్యవంతుడు సద్ధర్మవీరుడైన
రాము డయ్యె నాసీనుడు; భ్రాత కలరి
భరతుడు వచించె నీ రీతి భక్తితోడ.

"కూర్మి నా తల్లి కైకేయి కోర్కితీర్ప
అన్న! ము న్నొసంగితివి రాజ్యమ్ము నాకు
బహుళ మంగళవాద్యరవమ్ము లెసగ
పట్టు మందుము నే డిదే ప్రజల బ్రోవ."

అట్టులే యని గ్రహియించి ఆసనంబు
సకలశుభవిలేపనముల స్నాతుడైన
రఘువరుండు మహార్ఘవస్త్రాలు దాల్చి
కూరుచుండె యశమ్ము దిక్కుల వెలుంగ.

భరతుడు పవిత్రగుణగణభాస్వరుండు
శత్రుసూదనుడైన సుమిత్రసూతి
వినుతరాక్షసాధిపతి విభీషణుండు
సదృశుండు సుగ్రీవుడు స్నాతు లైరి.

పుణ్యమూర్తి శత్రుఘ్నుడు భూష లొసగి
భ్రాతలగు రామలక్ష్మణభరతులకును
సత్కరింపంగ; సీతను స్నాతజేసి
తీర్చి దిద్దిరి దశరథస్త్రీలు రమగ.

సారథి సుమంత్రుడును తేర స్యందనమ్ము
సుందరం బది సర్వాంగశోభితంబు
రామచంద్రుండు వసియించి రథముపైని
చనియె పరిజను లెల్లవా రనుసరింప.

తావులను విరజిమ్మగ పూవులెల్ల
వింగుల ధ్వజపతాకలు మింట నెగురుచుండ
ముంరువు లొలికెడు వన్నెలముగ్గు లొప్ప
కనులవిం దొనరించె మార్గంబు లెల్ల.

వానరులు కామరూపులు గాన వినుత
మనుజరూపమ్ములను గాంచి చనిరి పురికి;
ప్రీతి రాముండు తా జొచ్చి పితృగృహంబు
తనదు భవనమ్ము వానరేశున కొసంగె.

సుందరోద్యానవనముతో సొబగు మీరు
విడిదియం దుంచి సుగ్రీవవిభుని వేడి
ధర్మనిరతుడు భరతు డత్యంతభక్తి
జలములం గొనిరాగ దూతలను బంప.

రత్నఖచితంబులైన స్వర్ణకలశాలు
వానరప్రవరుల కిచ్చి ప్లవగరాజు
అంబుధుల జలమ్ములు తేర ఆజ్ఞ నొసగె
కరము భక్తి రామాభిషేకంబుకొరకు.

జాంబవంతుడు హనుమయు సత్వరముగ
వల బుషభ సుషేణాదులు నభము కెగసి
నాల్గువార్ధుల జలము లానంద మెసగ
తెల్లవారెడునంతలో తెచ్చి రెట్లొ.

సౌమ్యమూర్తి శత్రుఘ్నుడు సచివయుతుడు
స్వర్ణకలశాల వారాశిజలము లన్ని
సిద్ధపరుపంగ గురుడు వశిష్ఠమౌని
జానకీయుతు రాము నాసీను జేసె.

రత్నపీఠి గూర్చుండగ, రామవిభుడు
సీతయు పవిత్రజలముల గౌతముందు
వామదేవ వశిష్ఠాది పరమమునులు
జరిపి రభిషేకకార్యంబు సంతసిల్లి.

వరగుణాఢ్యులు విప్రులు గురులు హితులు
సచివు లభిషేకకృత్యమ్ము సలిపి రంత
సరభసంబుగ; రాముని శౌర్యమహిమ
అప్సరఃస్త్రీలు చూపంగ ఆడిపాడి.

ధీరుడగు రామునకు వాయుదేవు డొసగె
కనకమయ శతపుష్కర క్రమమాల;
మణివిభూషితంబగు కంఠమాల నిచ్చె
శక్రచోదితవాయువు సంతసించి.

శంఖభేరీ నినాదాలు చదల నంట
వందిమాగధ స్తోత్రాలు వరల చెవుల
మైథిలీసంయుతుందు రామప్రభుందు
చెలువు మీరంగ పట్టాభిషిక్తు డయ్యె.

కాశ్యపియు సస్యపులకిత గాత్ర యయ్యె
చక్కని ఫలాలు బహుళవృక్షాలనిండె
గుమగుమ సువాసనల నొప్పె సుమము లెల్ల
క్షితితలంబున రాముని కీర్తి వెలుగ.

భూషణమ్ములతోడుత భూసురులకు
ధేనువుల వృషభంబులు దాన మొసగె
వజ్రవైదూర్య భూషితభాసురంబు
పసిడిహారంబు రవిసూతి కొసగె విభుడు.

అంగదున కిడి శ్రీరాము డంగదాల
అవనిజాత కొసంగె ముత్యాలమాల;
రాముని యనుజ్ఞ సీత వస్త్రద్వయంబు
తనదు కంఠహారమ్మును హనుమ కిచ్చె.

ద్వివిద మైందుల నీలుని వృద్ధకపుల
సర్వవానరాధిపతుల సత్కరించె
మేటిబహుమతు లెన్నియో మిగుల నొసగి
రామభద్రుండు సంతోషధాము డగుచు.

"దాశరథికి ప్రక్కను దేవతలు చరింప
సాగె రాజ్యాభిషేక ముత్సాహ మొప్ప
వైభవముగ నయోధ్యలో ప్రజలు మెచ్చ
తృప్తి తీర కంటిమి మహాదృష్టమహిమ."

ఆంజనేయుడు సుగ్రీవు డంగదుండు
జాంబవన్ముఖ్యు లట్టులు సంతసించి
రాము ననుమతి వదలి ఆ రాజధాని
చేరినారు కిష్కింధకు సేనతోడ.

పిదప రాక్షసవిభుడు విభీషణుండు
స్వీయపురికేగె రాము నాశీస్సులంది;
సకలలంకాధిపత్యంబు సంక్రమింప
చల్లగా నేలె నతడు రాక్షసుల నెల్ల.

ధారుణీశుదు రాముదు తమ్ము గాంచి
ఆదరంబున మధురవాక్యాల బలికె
"లక్ష్మణా! తాల్పుమయ్య సల్లక్షణుడవు
రాజకార్యభారము యువరాజు గాగ."

చెప్ప విభు డట్లు, సౌమిత్రి సేవగోరి
ఎంతమాత్ర మంగీకృతి నీయ డయ్యె;
అంత భరతుని యౌవరాజ్యాన నిలిపె
తనకు జతగ రాముందు వాత్సల్య మొప్ప.

జానకీవల్లభుందు లక్ష్మణుదు గొలువ
జ్ఞాతిబంధువు లెల్లర సంఘటించి
దశసహస్రవర్షంబులు ధరణి నేలె
ఎల్లయెడల నానందము వెల్లివిరియ.

రాము డాతదు భూప్రజారంజకుందు
సత్యసంధుందు సౌమ్యుందు శాంతమూర్తి
వరుసగా అశ్వమేధాదిబహుమఖాలు
వాజపేయంబు లెన్నియో వాసి జేసె.

రామభద్రు ప్రజాహితరాజ్యమందు
ప్రజలు వ్యాళభయంబును వ్యాధిభయము
చోరభయము అనర్థాలు చూడలేదు;
సుఖశుభమ్ములకె కల దచ్చోట చోటు.

పృథివిలేదెవ్వరి కకాలమృత్యుభయము
ప్రమద లెల్లరు నిత్యసౌభాగ్యవతులె
ప్రజ లజస్ర మన్యోన్యవైరమ్ము లేక
మెలగుదురు నిర్మలప్రేమకలితు లగుచు.

రాజ్య మేలుచు నుండంగ రఘువరుండు
రామనామ జపధ్యాన రమ్యులగుచు
ప్రజలు చెప్పుకొనంగ శ్రీరాము కథలె
రామమయ మయ్యె జగము సర్వమ్ము కనగ.

రాజ్యరమ నేలుచుండంగ రామవిభుడు
ప్రకృతి సహకార మందించె పరవశించి
ధారుణిని సత్యశీలురై ధర్మబుద్ధి
పరగుచుండిరి ప్రజలు సద్భక్తి గలిగి.

ఇనకులాధీశ్వరుడు రాజ్యమేలు నపుడు
అవనితల మెల్ల వస్తువాహన సమృద్ధి
ధాన్యధనవృద్ధి పుణ్యసంతాన వృద్ధి
భోగభాగ్యాభివృద్ధిని పొలుపుమీరె.

సారగుణవల్లి మాతల్లి నారయమ్మ
శుద్ధచరితుండు జనకుండు సూర్యరావు
రావులాన్వయ సూర్యనారాయణుండ
పలికినాడ నీ కథ రామభద్రు కరుణ.

లోకకల్యాణకరము వాల్మీకికృతము
అసమరసరమ్య మైన రామాయణమ్ము
భక్తితోడ పఠించిన పరగ విన్న
కలుగు ముదము ముక్తియు సర్వకార్యసిద్ధి.

సర్వలోకమంగళమె లక్ష్యమ్ము గాగ
అంచితంబుగ రామకథామృతంబు
పంచె వాల్మీకిమౌని ప్రపంచమందు
గ్రోలగా దగు శ్రేయంబు కోరి జనులు.

జానకీకళత్రుడు రామచంద్రవిభుడు
లలితవిస్తార శుభగుణ లక్షితుండు
భక్తజనుల కెల్లరకు కల్పద్రుమంబు
సర్వవిధ సౌఖ్య ఫలము లొసంగుగాక!.




* * *

